సెప్టెంబరు
1986

# భారతి

వెల
4 రూపాయలు

సాహిత్య మాస పత్రిక

Kasi



## చిన్న నవలల పోటీ ఫలితాలు!

డీంగ - కలువ కొలను సదానంద

నవ్వుల సందడి - రావినూతల సువర్ణాకన్నన్

చరిత్ర పరుగు - డా. సి. నారాయణరెడ్డి



# ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం

## నవ వనితా సచిత్ర పక్షపత్రిక

* అభ్యుదయానికి మనో వికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు, చర్చలు.
* కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు.
* బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీరైన బొమ్మలు.
* ఒక పూర్తి నవల + 2 సీరియల్స్.
* పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు: వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, రాశిఫలం కూడా ... బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన హరివిల్లు!
* ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల : 2-50

వివరాలకు :

'కలువబాల', కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3.

ఏడ్రెప్రతి వెల : రు. 2.50

### చందా వివరాలు

| | ఏజెంట్ ద్వారా | | పోస్ట్ ద్వారా |
|---|---|---|---|
| 3 నెలలకు | రు. 15-00 | - | 15-90 |
| 6 నెలలకు | రు. 30-00 | - | 31-80 |
| సంవత్సర చందా | రు. 60-00 | - | 60-00 |

సంవత్సర చందా ఒకేసారి ఆఫీసుకు చెల్లించండి.






సంపుటము : 63 సెప్టెంబరు,1986 సంచిక 9

# భారతి

## సాహిత్య మాసపత్రిక

సంస్థాపకుడు

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

(1938-1972)

*

## విషయానుక్రమణిక

ముఖచిత్రం గజాననుడు

చిత్రకారుడు శ్రీ ఎస్. కాశీ విశ్వేశ్వరరావు.



గమనిక

ఆగస్టు సంచికలో ప్రచురింపబడిన ఆంధ్రప్రదేశ్‌లో ఆహార ధాన్యాల ఉత్పత్తి వ్యాస రచయితలు యం రమేష్ రెడ్డి, యం ఉపేందర్ అని గమనించ కోరుతున్నాము

సం

# స్వవిషయం

ఆంధ్రపత్రిక సంస్థ ప్రచురణ వినాయకచవితితో మొదలయింది. మళ్ళీ కొంతకాలంగా భారతి అట్టమీద బొమ్మలు వేస్తున్నాము. ఈ నెల ముఖచిత్రం గణపతిదే ...

* * * * * * *

కీ. శే. జనమంచి వెంకటరామయ్యగారి పద్యాలు కొన్ని ఈ నెల భారతిలో వెయ్యగలిగినందుకు సంతోషంగా ఉన్నది. వారి ఇతర రచనలు మరికొన్ని వేసే అవకాశం కలుగగలదని కూడా ఆశిస్తున్నాము ...

* * * * * * *

డా మహీధర నళినీమోహన్‌గారు అంతరిక్ష పరిశోధన చేస్తున్న భారతీయ ప్రముఖులలో ఒకరు. ఆయన భారతి చదువరులకి సుపరిచితులే...

* * * * * * *

నవలా రచయిత్రిగా పేరుపొందిన శ్రీమతి రావినూతల సువర్ణాకన్నన్‌గారి నాటకం ఒకటి ఈ సంచికలో ప్రచురిస్తున్నాము ...

* * * * * * *

చిన్న నవలల పోటీకి నవలలు ఎక్కువగానే రావటంచేత బహుమతుల నిర్ణయం కొంచెం ఆలస్యం అయింది!

మొదటి బహుమతి శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావుగారి సుందరం" నవలకి వచ్చింది రచయిత తెలుగు పాఠకలోకానికి బాగా తెలిసినవారే ...

శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారి "యాత్ర"కి రెండవ బహుమతి లభించింది. ఈయన కవిత్వం తరుచు భారతిలో పడుతూనే ఉంటుంది ...

మూడవ బహుమతి పొందిన "నది" రచయిత శ్రీ ఎ. వి. వి. ఎస్. ఎస్. ప్రసాద్ గారి పేరు కూడా భారతి చదివేవారికి సుపరిచితమే ...

బహుమతులు పొందినవారికీ, ఇతరులకీ కూడా మా అభినందనలు తెలుపుకుంటున్నాము!

పోటీలో పాలుగొన్న వారందరికీ కృతజ్ఞులము!

"సుందరం" నవల అక్టోబరు సంచికలో పడుతుంది. "యాత్ర" తరువాతి మాసంలో ప్రచురించగలము. డిసెంబరు సంచికలో "నది" వేస్తాము ...

* * * * * * *

వచ్చే నెల భట్టిప్రోలు స్తూపం మీద డా. ఇంగువ కార్తికేయ శర్మగారు రాసి పంపిన ఒక వ్యాసం వేస్తున్నామని తెలుపటానికి సంతోషంగా ఉంది ...

ఏడి పత్రిక వెల : నాలుగు రూపాయలు

నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రయివేట్ లిమిటెడ్ తరఫున ముద్రాపకుడు, ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు;

ముద్రణ : ఆంధ్రపత్రికప్రెస్, గాంధినగరం, విజయవాడ-3, సంపాదకుడు · శివలెంక రాధాకృష్ణ

ఫోన్లు :- బిజినెస్ : 61247, 61248; ఎడిటోరియల్ : 75667

# నతి

సీ॥ కాననములందు నిస్సారమై - మిన్నుకామి
నకాను తెల్గు పల్కుల గతిఁదలంచి
గానట బీసట గాథలే గతియైన
తనజాతి దురవస్థలనుఁ దలంచి
పండితాదరణ - సభాపూజ్యతయు లేక
అణిగిన దేశ భాషనుఁ దలంచి
రాజ రాజ నరేంద్ర ప్రార్థిత కాంక్షలో
యనలారు జాతి శ్రేయస్సుఁ దలచి—

తే॥గీ॥ విశ్వ కళ్యాణకరము - శశ్వదమృత
తత్వ రూపంబు - నిత్య నూతనము నైన
వ్యాస భారత సారంబు నాంధ్రభాష
పలికె నన్నయ "తెలుగుల ప్రథమ గురువు"॥ 1

సీ॥ సారమతులకు ప్రసన్నకథా కవి
తార్థ యుక్తులు హత్తునట్లు చెప్పి
క్లిష్టమౌ ఘట్ట మక్లిష్టంబుగాజేసి
అక్షర రమ్యత్వమద్ది - దిద్ది-
రసభంగ కరములౌ పసలేని తావులు
పరిహరించియు - సూక్తి వైభవమున
తనవాశి, రసదోరణిని పర్వులెత్తంగ
నుడికారముల సొంపు నూలు గొల్పి

తే॥గీ॥ శైశిరాహతవన వీధి సమమునైన
ఆంధ్ర సారస్వతో ద్యానమందు - నన్న
పార్యకవి కోకిలముఁ బాడె ప్రపత్రిథమముః
అంధ్రి పంచమామ్నా యరసార్ద్రగీతి॥ 2

శా॥ శ్రీవాణీ గిరిజాశ్చిరాయ - యనుచున్ శ్రీకారముం జుట్టినా
డావిశ్వశ్రేయస బుద్ధి - నన్నయః రసవ్యాపార పారీణమై
జీవత్కాంతులు సంతరించుకొని వచ్చెం భాషయుం భావమున్
చేవం బొందిన దాంధ్రవాణియు రస శ్రీస్నిగ్ధ మాధుర్యమైః 3

శా॥ సంతోషించిన దొక్కవేంగిధరణీ సమ్రాట్టె కాదాంధ్రి సీ
మాంతమ్ముంబుల కించిపోయెనుః హరా దావిర్భవత్ స్వచ్ఛ వా
సంతజ్యోతులు జాతి గుండెయలలో సంధిల్లె - శ్రీ నన్నపా
ర్యాంతస్సాదు మనోజ్ఞభారత శుభ ప్రారంభ సరంభమైః 4

సీ॥ తత వచేశిమ సుధా ధారాస్రవమ్ములౌ
పనసపండ్లకు నీడువచ్చు కవిత
అపుడెఁ దీసిన - పచ్చియారని చందన
శ్రీకిఁదోడై మించి చెలగుకవిత
పండువెన్నెలలోని పారిజాతపు పూల
పంమళంబులఁదోచి వరలు కవిత
గిరినిస్సరన్మనోహర ప్రపుష్జలపాత
నాదమ్ముఁదలపించు స్వాదుకవిత—

తే॥గీ॥ వేద నాదంబు - సంగీత స్వాదునాద
కోటిఁదనలోన జీర్ణించుకొన్న కవిత
ఆంధ్రకవి లోకగురువు నన్నయ్య కవిత—
భారతీదేవి యెదకు కస్తూరి పూత॥ 5

చం॥ తెలుగు పదాల తావులకు తీపులఁదెచ్చెదు సంస్కృతింపు స
ల్లలిత సమాస ధోరణియు - లాలితమై చను దేవభాష కుం
జిలుగు మటించుఁదెల్గు నగిషీ పని - నన్నయ పద్యమాధురుల్
అలఘు స్వతంత్రతా పథ విహారమనోజ్ఞములై చెలంగెడిన్ః 6

ఆ॥వె॥ సకల కావ్యరత్న సంచయగుణపరీ
క్షైక శాణ విబుధ సంఘమెల్ల
ఆది కావ్యరత్నమా మూలముగఁ జూచి
ఇంచు భక్తిని శిరసా వహించినారుః 7

తే॥గీ॥ సంస్కృతోక్తికి దూరమైఁ జనినవారు
దేశభాషకు హృదయ మందిచ్చువారు
"వ్యాస పీఠమ్ము"పై నన్న పార్యకృతిని
నిలిపి నారాంధ్ర మాధురి వలచినారు॥ 8

చం॥ తెలుగున కావ్యగీతములు తీయని కంఠములెత్తి పాడగా
మెలకువ నేర్చుకొన్నవి సుమాః కవి కోకిలలున్ తదాదిగా
అలఘుడు నన్నపార్యుని రసాదర మేదురకావ్య సృష్టితో
లలిత మహాంధ్ర శారద విలాసమువొప్పె సభాప్రపూజ్యమైః 9

ఉ॥ వ్రాసెను రెండు పర్వములపై సగభాగమె నన్నపార్యుఁడా
వ్రాసిన వ్రాతలోని రసభావము - నాదములన్ - తదీయవాక్
శాసన ముం ధరించి జయసంహితఁబూర్తిగ జెప్పిరుత్తముల్
దీనము పేతుడైన కవి తిక్కన - ధీరుడు నెఱ్ఱనార్యుడున్ః 10

చం॥ కవులకు భిక్ష పెట్టెననగా దగు నన్నయ పద్య విద్యలో
కవి తిలకుల్ - కవీంద్రులును, కావ్య కళానిధి రత్నముల్ - మహా
కవులును - సార్వభౌములును కావ్యములల్లిరి - యాంధ్రవాణి వై
భవము దిగంత విశ్రుతము భాసిలె జాతికి గర్వహేతువై॥ 11

కం॥ నాటికి - యీ నాటికి - యే
నాటికి - నన్నయ్యను కవి నాటిన కవితా
పాటవలత క్రొంబూతల
వాటించు రసజ్ఞ హృదయ పాటచ్చరమై॥ 12

మ॥ స్మరణీయంబు - మహాంధ్రభారత కథా సామ్రాజ్య నిర్మాణవి
ద్వరసా వేశము - వేంగి భూధవ సభాలంకార శ్రీ శారదా
పర రూపంబు - జగద్హితైక మతిశోభాధుర్య మాధుర్యభ
వ్యరస స్థాయి వచస్సు - నన్నయ పరబ్రహ్మంబు సేవింతెదన్ 13

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

# దొంగ

## 'కలువకొలను సదానంద

అసంఖ్యాకమైన విద్యుద్దీపాలు - చీకటిపిల్ల పెట్టుకున్న సొమ్ముల్లా ధగధగలాడిపోతున్నాయి. బజారులో - ముందుకు కదిలేందుక్కూడా వీల్లేనంత రద్దీగావుంది. ఇసుకవేస్తే రాలనట్టుంది జనసమ్మర్దం. కేకలతో, చీత్కారాలతో, అట్టహాసాలతో చెవులుగింగురుమంటున్నాయి.

రోడ్డుమధ్య సమూహాన్ని విడిచి, ఆవైపూ ఈవైపూ- ఈ చివరినుండి ఆ చివరివరకు ఒక్క అడుగుమేరకూడా ఖాళీ లేకుండా ఒకదానికొకటి ముడిపెట్టినట్టు యిరుకుగా నెలకొని, కళ్ళకు మిరుమిట్లుగొలుపుతున్నై దుకాణాలు. గోడలమీద పెద్దపెద్ద అక్షరాలతో "పుష్పపల్లకి సేవ" అన్న వాల్‌పోస్టర్లు- ఆ గోడల క్రిందనే నానారకాల జూదాలు, వ్యభిచారుల స్వైరవిహారాలు, తాగుబోతుల పరుషవాక్యాలు మట్కా-జూదగాళ్ళ మంతనాలు - ఈ అర్ధరాత్రి ఏ మారుమూలల్లో ఎటువంటి పాపాలు జరుగుతున్నాయో - పీటినంతా చూచీ చూడనట్టు పల్లకిలో ఊరేగుతున్నాడు సర్వాంతర్యామి.

* * *

దూరంగా బ్యాండు సంగీతం సన్నసన్నగా వినిపిస్తోంది- పూలపల్లకి ఆ చివర కనిపించింది.

ఉత్సవానికి ముందుగా కొయ్యగుర్రాలు ఆడుతూవస్తున్నాయి ప్రేక్షకుల దృష్టి తేరుమీదకాక, ఈ గుర్రాల ఆటమీదికి మరలింది. గుర్రాలు నేత్రానందంగా ఆడుతోంటే - లయబద్ధంగా మ్రోగుతోన్న డోలుశబ్దం శ్రవణానందంగా వుంది. అక్కడక్కడా ఆగి ఆడుతూ ముందుకు సాగిపోతున్నాయి గుర్రాలు.

చిన్నగా కదిలివస్తోంది తేరు. ఒక్క అడుగు ముందుకు కదిలేందుకే కొన్ని నిమిషాలు పడుతున్నై. మెల్ల మెల్లగా దృష్టి- దగ్గరగా వస్తోంది. ప్రజల్లో సంచలనం, ఉత్సాహం! అందరి చూపులూ తేరుమీదే!

పల్లకిని దట్టంగా కట్టేసివున్నాయి పూలు. బంతులు బంతులుగా వేలాడుతున్నాయి. దేదీప్యమానంగా వెలిగిపోతూ దేవలోకపు నమూనాలా వుంది. గుప్పుమంటూ చుట్టుకొంటున్నై సువాసనలు.

జనం ముందుకు విరగబడ్డారు. త్రోపుడు ఎకువైంది- ఒకరినొకరు తిట్టుకున్నారు. తన్నుకున్నారు. ముందుకూ వెనక్కూ తోసుకున్నారు.

సమూహగర్భంనుంచి- బలిపశువు ఆర్తనాదంచేసినట్టు ఒక కేకవినిపించింది. కండలుతిరిగిన ఒక బలకాయుడు తన బాహుబలంతో జనాన్ని అటూయిటూతోసి, సందడిలో గుక్కతిరక్కుండా గిజగిజలాడిపోతూన్న ఒక అయిదేళ్ళ పిల్లను పైకెత్తుకొన్నాడు. అతనికళ్ళు జిగేల్‌మన్నాయి. ఆ పిల్ల ఒంటినిండుగా నగలే!...

సమూహాన్నంతా ఒకసారి అవలోకించాడు ఆ వ్యక్తి. తేర అందరిదృష్టినీ అయస్కాంతంలా ఆకర్షించివుంది. ఒకరి గొడవలతో ఒకరికి పనిలేదు.

అతడు తన తలగుడ్డను విప్పి ఆ పిల్లమీద కప్పాడు. జనాన్ని చాటుచేసుకొని తొందర తొందరగా ఊరిబయటికి వెళ్ళిపోయాడు. రైలుకట్ట పక్కనే నడిచి కూలీలగూడేనికి యివతల కొంతదూరంలో ఆగి ఓసారి చుట్టూ కలయజూశాడు. మొండిధైర్యాన్నితెచ్చుకొని. భయంతో క్యారుమంటూ అరిచిన ఆ పిల్లనోటిని చేతితో అదిమిపట్టి, రైలుకట్ట కింది తూములోపలికి జొరబడ్డాడు.

న్యాయానికిలేని కళ్ళు చీకటికున్నాయి. అయితే దాని! నోరులేదు.

* * *

నల్లని పొగను పైకిచిమ్ముతోన్న కిరసనాయిలుదీపం చుట్టూ పెద్ద గుంపు.

"కాయ్‌రాజా కాయ్! వారివారి అదృష్టం! పావలా - అర్ధ రూపాయ్- రూపాయ్! మోసంలేదు, దగాలేదు, వారివారి అదృష్టం! పెట్టూ-పెట్టూ-"

డబ్బా డబడబ మోగింది. డబ్బులు గల్లుగల్లున రాలాయి.

హృదయంలోని విచారాన్ని నిట్టూర్పుతో జోడించి- "ఎర్రగుండు పావలా!" అంటూ చివరి పావలాను పడేశాడు రంగడు.

"ఔర్ బెట్! క్లావర్ ఖాళీ!"

డబ్బులుకురవడం ఆగిపోయిన తర్వాత-బోర్లించివున్న డబ్బా పైకిలేచింది.

"డబుల్ ఆటీన్, సింగల్ డైమండ్!"

రంగడి హృదయంలోంచి యింకో నిట్టూర్పు!

మళ్ళీ ఆశతో జేబు తడుముకొన్నాడు. అందులో 'యింకేమీ

లేదు, ఒక్క బీడీతప్ప. కాస్సేపు అలాగేకూర్చుని మోకాళ్ళ పట్టుకొని బద్ధకంగా లేచాడు. తిమ్మిరెక్కిన కాళ్ళను ఒకమారు జాడించుకొన్నాడు. అక్కడ వుండలేక దూరంగా నడిచివెళ్ళి బీడీవెలిగించి గట్టిగా దమ్ములాగుతూ కరెంటు కంబానికి ఆనుకున్నాడు.

ఇరవైఅయిదేళ్ళ వయస్సు.

మురికి పేరుకొన్న నల్లనిశరీరం, అంట్లుకుట్టిన నిక్కరు, చిరుగుల పాతచొక్కా, జీబురుతల, లోతుకుపోయిన కళ్ళు, ఆ కళ్ళల్లోని నిరాశ - కటిక పేదవాడని, దౌర్భాగ్యుడనీ చెప్పకనే చెబుతున్నై.

పెదవులు చుర్రుమంటుంటే గట్టిగా చివరిదమ్ములాగి, ఆ చిన్నముక్కను అవతల పారేశాడు. కాలి బొటనవేలితో నేలను గోగుతూ, తలెత్తి కరెంటుదీపానికేసి చూస్తూ, ఏదో ఆలోచించుకో సాగాడు.

దరిద్రుడు, ధనికుడు అని - భగవంతుడెందుకు మానవులను రెండు తెగలుగా పుట్టించాడు? పేదవాడు. భాగ్యవంతుడు అన్న రెండు వర్గాలమధ్య అగాధాలను సృజించి, ఒకవైపు స్వార్థం, అత్యాశ,





# కుమారి ప్రియలక్ష్మి కూచిపూడినాట్యరంగ ప్రవేశం

కుమారి ప్రియలక్ష్మి శ్రీ వరాహగిరి ప్రభాకరరావు గారి కుమార్తె. నాట్య ప్రవీణ శ్రీమతి కె సూర్యశ్రీ వద్ద ఈమె కూచిపూడి నృత్యాన్ని అభ్యసించింది. కుమారి ప్రియలక్ష్మి కూచిపూడి నాట్యరంగ ప్రవేశం (అరంగేట్రం) మద్రాసులోని రాణి సీతై హాలులో జూన్ 20వ తేదిన వివిధ రంగాలకు చెందిన ప్రముఖుల సమక్షంలో జరిగింది

ఈ ప్రదర్శనను చూసిన వారందరూ కుమారి ప్రియలక్ష్మి నృత్యాన్ని ప్రశంసించారు. ఆకర్షణీయమైన ముఖారవిందం కలిగి అతి సున్నితమైన హావభావాలని సైతం సునాయాసంగా ప్రదర్శించిన కుమారి ప్రియలక్ష్మికి కూచిపూడి నాట్యరంగంలో ఉజ్వల భవిష్యత్తు ఉన్నది ☐

కుత్సితం, క్రౌర్యం... మరోవైపు నైరాశ్యం, నిస్పృహ, దారిద్ర్యం, మార్దవం తాండవమాడుతూండగా అజ్ఞాతంగావుండిచూస్తూ వినోదించ డానికా?

సందడితోవున్న దుకాణాల వరుసను అవలోకించాడు రంగడు.

ఎన్నివిధాల వ్యాపారాలు!

లాభాలు గుంజేస్తున్నాయి!....

* * *

ఈ పుష్పపల్లకి ఊరేగింపు పూట ఏదైనా చిన్నవ్యాపారం చేదామన్న ఊహ తనకూ కలుగకపోలేదు.

టెంకాయలో, అరటిపళ్ళో, బొరుగులో, శనగలో... ఏదో ఒకటి ...

అందుకే నిన్నటిరోజు రమణయ్యను తనకివ్వవలసిన పంద రూపాయలూ అడిగాడు పెట్టుబడికిందికి.

తన పంద! తన కష్టార్జితం! రెణ్ణెల్లపాటు ఆకలికిసైతం ఓర్చుకొని, డబ్బివ్వమని నోరెత్తిఅయినా అడక్కుండా రమణయ్య కొట్లో పనిచేసినబాపతు డబ్బులు!

అంతమాత్రానికే రమణయ్య అంతెత్తున లేచాడు. ఏవో కుంటి సాకులు చెప్పాడు. మాటామాటా పెరిగింది

"అయితే యివ్వరన్నమాట?"

"ఇప్పుడు నాదగ్గిర లేదన్నానా?"

"ఇవ్వరా?"

"లేదు!"

రంగడికి ఉద్రేకం పొంగుకొచ్చింది. కోపం, ఏడుపూ ఒకేసారి ముంచుకొచ్చాయి. ముఖం ఎరుపెక్కింది. ఉక్రోషంతో ఆకులా ఆడిపోయాడు.

"నువ్వే వుంచుకుని పొట్ట యింకాస్త పెంచు. ఒక ముష్టి వాడికిచ్చేగాననుకుంటాను" అనేసి పోతూపోతూ - "ఎందరినోళ్ళు కొట్టి కూడబెట్టావో యిలా!" అన్నాడు రోషం పట్టలేకుండా.

అధముడు ఒక్కమెట్టు పైకి వెళ్ళబోతే - ఎక్కనివ్వకుండా కిందికి తంతాడు ఉన్నతుడు!

ఉదయం రెండుబారల పొద్దెక్కినా లేవకుండా ముసుగుకప్పు కొని యింట్లోనే పడుకొన్నాడు రంగడు.

"ఏమిట్రా యింకా పడుకునేవున్నావ్ - కొట్టుకెళ్ళకుండా?" అంది అతని ముసలి తల్లి.

ఆమెకు ఏమీచెప్పలేదు. చెప్పడానికి మనస్కరించలేదుకూడా "వెళ్తాలే, నువ్వూరుకో!" అన్నాడు విసుగ్గా.

మధ్యాహ్నం లేచి గంజితాగి- బస్టాండ్దగ్గిర, రైల్వేస్టేషన్లో తిరిగి రాత్రయ్యేసరికి మూడురూపాయల కూలీ సంపాదించాడు.

ఆ మూడురూపాయలు కూడా క్షవరం!

ఆశపడి ఆటలోకూర్చున్నాడు. వచ్చినట్టేవచ్చి మొత్తంగా వూడ్చుకుపోయింది.

* * *

చిన్న కునుకువచ్చి ముందుకుతూలాడు రంగడు. వెంటనే సర్దుకొని నిలబడ్డాడు. నిద్దరొస్తోంది. ఆవులించాడు. అక్కడినుండి కదిలి జనసమూహాన్ని చీల్చుకుంటూ చిన్నగా నడిచిపోతున్నాడు. బజారుదాటుకొని ఊరిచివరికి వచ్చాడు. అంతా నిర్జనంగా, నిశ్శబ్దంగా వుంది. బజారువీధుల్లోవున్న రద్దీ, సందడి, త్రొక్కిడీ - యిక్కడ మచ్చుకైనాలేవు.

కూతవేటు దూరంలోవుంది తన తాటాకుల గుడిసె. తనతల్లి తనకోసం కళ్ళు కాయలుచేసుకొని ఎదురుచూస్తుంటుంది- పాపం!

తెల్లవారడానికింకా రెండు మూడు గంటల వ్యవధివుంటుంది.

చల్లటిగాలి! చలి!... దూరాన- అంతులేని ప్రజావాహినిమధ్య

రణగొణధ్వనులు ఎండుటాకుల చప్పుడులా వినిపిస్తున్నాయి.

సన్నటి ఏడుపు!

స్పష్టంగా వినిపిస్తోంది.

ఎక్కడ?—

సమీపంలోనే ఎక్కడో....

అతని కళ్ళు నాలుగువైపులా వెతికాయి.

కాస్తదూరంలో - లైటు స్తంభం ప్రక్కనుండి ఏడుస్తూ చిన్నగా నడిచివస్తోంది అయిదేళ్ళ పసిపిల్ల.

ఆశ్చర్యంగా దగ్గరికెళ్ళాడు రంగడు.

తేరిపారచూచి "ఏంటిపాపా ఏడుస్తున్నావు?" అంటూ దగ్గరికి తీసుకున్నాడు. ఆశ్చర్యపోయాడు.

రమణయ్యగారి కూతురు- బుజ్జీ!

ఇక్కడికెలావచ్చింది?

ఏం జరిగింది?

విలువైన ఉడుపుల్లోవుంది బుజ్జీ. రోజూలాగా ఆభరణాలు లేవు.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?"

తనకు పరిచితుడైన రంగణ్ణిచూసి మరీ వెక్కివెక్కి ఏడ్చింది బుజ్జీ.

రంగడికి జాలివేసింది. "ఇంటికెళ్దాం రామ్మా!" అన్నాడు మృదువుగా. చేతుల్లోకి తీసుకున్నాడు. పైకెత్తుకున్నాడు.

పొంగివస్తున్న ఏడుపును ఆపుకోలేకపోతోంది పసిపిల్ల.

"ఊరుకోమ్మా, ఊరుకో! ఇంటికెళ్తున్నాంగా?.... అంటూ బుజ్జగిస్తూ- మళ్ళీ బజారువేపు నడిచాడు రంగడు.

* * *

బాలభానుని కిరణాల పదునుకు భయపడి దూరదూరంగా పారిపోతున్న మేఘజాలంతోబాటు - ఉత్సవానికొచ్చిన జనం చెల్లాచెదరైపోతున్నారు.

నిద్రలేమిచేత కళ్ళెరుపెక్కిన జానపదులంతా నీరసంగా వెళ్ళిపోతున్నారు.

వీధులన్నీ పలుచబడిపోతున్నాయి.

బజారులో రోడ్డువార అంగళ్ళన్నీ ఒక్కటొక్కటిగా లేచిపోతున్నై...

పల్లెపడుచుల పెదవులపైని చిరునవ్వులు, యువకుల ప్రేమ వ్యవహారాలు, పామరుల బోళానవ్వులు, నాగరికుల చీదరింపులు, ముష్టివాళ్ళ ప్రార్థనలు, జేబుదొంగల విహారాలు, పోలీసువాళ్ళ దబాయింపులూ- యిప్పుడు లేవు.

వింతలూ, వినోదాలూ మాయమైపోయాయి.

అంతా ఒక్కరాత్రి సంబరం.

మళ్ళీ మామూలే!

నిన్న మధ్యాహ్నం వెళ్ళిన రంగడింకా రాకపోవడానికి కారణ మేమిటి?— ముసలావిడ మాతృహృదయం తహతహలాడిపోతోంది. వాకిట్లోనుంచొని, కొడుకు వస్తున్నాడా లేదా అని రోడ్డుమీదికి చూస్తోంది.

ప్రొద్దు క్రమంగా పైకెక్కుతోంది.

ఎండ వేడెక్కుతోంది.

ఇంతవరకూ రంగడు రాలేదు.

ముసలావిడ ఆరాటం ఎక్కువైపోతోంది.

రోడ్డుమీదికి వెళ్ళి నిలబడింది.

ఊహుఁ! రంగడు కనిపించడంలేదు.

ఎవరా పరుగెత్తుకొస్తున్నది?— గంగులా?

ఔను-గంగులే!

వాణ్ణి అడిగితే ఏమైనా చెబుతాడేమో!

దగ్గరకురానీ—అదిగొచ్చు!

రానేవచ్చాడు గంగులు రొప్పుకుంటూ

ముసలామె అడగబోతుండే వాడేఅన్నాడు అదుర్దాగా....

"పెద్దమ్మా, పెద్దమ్మా! రంగడు రమణయ్యబాబుగారి చిన్నమ్మాయి ఒంట్లో నగలు దొంగిలించాట్ట! పోలీసులు వాణ్ణి లాకప్‌లోపెట్టారు..!"

వృద్ధురాలు పిడుగుపాటులాంటి ఆవార్తకు తట్టుకోలేకపోయింది. వెర్రెత్తినదానిలా కేకపెట్టింది. కాళ్ళు తడబడుతుండగా ముందుకు నాలుగడుగులు వేసింది. ఊతకర్ర పట్టుజారింది. మనసు ముందుకు పరుగుతీసింది. కాళ్ళు సాగలేదు. కుప్పగా కూలబడిపోయి గోలుగోలున విలపించింది. □



# (సాల) గ్రామాలు

ఇక్కడ.
వెదురు పొదలు
బుట్టలుగా ఒదిగి పోతాయి
బురదమన్ను
కుండలుగా నాట్యభంగిమలు చేస్తుంది
ప్రత్తి వాములు
మగ్గాలలో పరుగులు పెడతాయి
వృక్షాలు
రథాలుగా ప్రత్యక్ష మౌతాయి
ఇక్కడే "ఎంకి" పుట్టింది
"కిన్నెరసానీ" పురుడు పోసుకుంది
ఇక్కడ అతిథులను పరామర్శించి
ఆశ్రయమిస్తాయి రావిచెట్లు రచ్చబండలు
ఇక్కడ
కొళాయిలలో కొనఊపిరి పెట్టదు నీరు
ఇళ్లలో సుళ్లు తిరగదు గాలి
ఇక్కడ ప్రశాంతతకు భంగం కలుగకుండా
ఎడ్లబండ్లూ, గున్నమామిళ్లూ
చింతతోపులూ, కొబ్బరి తోటలూ
చతురంగ బలాలై సంరక్షిస్తాయి.
కోడికూత సైరన్ వినగానే
అంకెవేసే అంబోతులు
గంతువేసే లేగదూడలు
కడుపుతీపికి కొసరి చూపులు చూసుకుంటూ
మేతకుపోయే గోమాతలు కన్పిస్తాయి.
ఎలుకైనా, చిలుకైనా
ఝషమైనా, ఋషభమైనా
దేవతల వాహనాలన్నీ
ఇక్కడ దైనందిన దృశ్యాలు.
శుకపికాల కలస్వనాలు
పిల్లనగ్రోవి పల్లెపదాలు సహజమైన శ్రుతిగానాలు.

కాడె భుజానకెత్తిన రైతు
కొడవలి పిడికిటపట్టిన కూలీ
చిందించిన చెమటచుక్కలే పండిన ధాన్యపురాసులు.
ఏషాపుల్లోనూ పంటలు పండవు
నగరాలలో నదులు ప్రవహించవు
చౌరస్తాల్లో కొండలూ, కోనలూ, జలాశయాలూ కనిపించవు.
ఇక్కడ మతమౌఢ్యపు నెత్తుటి మడుగులుండవు.
దేవునికై భాగస్వామ్యపు గొడవలుండవు.

ఇక్కడ గుడులలో గుండెలలో ఆధ్యాత్మిక
సుధలు వర్షిస్తాయి.

ప్రతియింటా భారతీయతా వారసత్వం వెలారుతుంది.
పక్షులతో జంతువులతో ఇక్కడి జనులకు సహవాసం
బ్రతుకుల్లో మచ్చుకైనా ఉండదు కుహనాత్వం
అమ్మ ఆవు వీరికి ఆరాధ్యదేవతలు
పాడి పంట ఇక్కడ స్వర్లోక సంపదలు
బారుల్లో కూర్చున్నా పొందలేని హాయి
ఆరుబయలనే అనుభవిస్తారు తారస్థాయి
సస్యలక్ష్మి ఋతో చిత్రాలంకారాలు ధరించి
విశ్వమోహినిలా దర్శనమిస్తుందిక్కడ.
ఇక్కడ పరిసరాలు సహజసుందర మధుర దరహాసాలు.
సజీవ గ్రామిక కళా నిక్షేపాలు.
అమ్మ పేరు వింటే,
అంటుమామిడి పండు తింటే,
చెట్టునీడ సేదతీర్చుకుంటే
నూతి నీటితో గొంతు తడుపుకుంటే
కలిగే అనుభూతి
గ్రామాలలోని జీవనగతి
అందుకే మనకు గ్రామాలు
పవిత్రమైన సాలగ్రామాలు.

శ్రీ పైల క్రిష్ణారావు

**శ్రీ యస్. యల్. యస్. ఆచార్య**

# కొండపాక శాసనాలు

కొండపాక మెదక్‌జిల్లాలో సిద్దిపేట నగరానికి సుమారు 15 కిలోమీటర్ల దూరంలో ఉన్నగ్రామం. ప్రస్తుతమిది మండల కేంద్రం. ఒకప్పుడీ గ్రామం మంచి ఉచ్చస్థితిలో ఉన్నట్లు ఆ గ్రామంలో లభిస్తున్న శిలాశాసనాల ద్వారా శిధిలమై పోతున్న శిల్పకళద్వారా తెలుస్తున్నది. ప్రస్తుత శాసనం కొండపాక రుద్రేశ్వరాలయం ప్రక్క పాతగుడి అని పిలువబడే దేవాలయం ముందు రెండు ముక్కలుగా విరిగిపోయి ఉంది.

ఈ శాసనశిల సుమారు నాల్గడుగుల ఎత్తు, రెండడుగుల వెడల్పు, ఒక టిన్నర అడుగు మందంతోఉంది. నల్లరాయి కావడంవల్ల అక్షరాలు ఇప్పటికి చాలావరకు స్పష్టంగా ఉన్నాయి. కాని శాసనాన్ని రాసేటప్పుడు శాసన లేఖకుడు శిలను చక్కగా చదరంగా నునుపుచేసికొని వ్రాసినట్లు కనిపించదు. కొంతభాగం పెచ్చులు పోయినట్లు కనబడినా శాసనం మాత్రం చెడలేదు. మధ్యవిరిగినప్పుడు కొంత భాగం పక్కకుకూడ విరిగిపోయినందువల్ల కొన్ని పదాలు, అక్షరాలు ఎగిరిపోయాయి. ఐనా శాసనం చాలావరకు స్పష్టమైన అక్షరాలతో నేటికీ ఉండడం ఒక విధంగా అదృష్టమే.

ఈ శాసనం ప్రధానంగా దాన విషయాన్ని తెలుపుతున్నా నాటి సాంఘిక స్థితి గతులను, కొద్దిగా నాటి రాజకీయ వ్యవస్థను, భాషను చక్కగా వివరిస్తున్నది. దాత వంశాన్ని గుణగణాలను ప్రస్తుతించే ఈ శాసనాలు కావ్య భాషలో ఉన్నందువల్ల ప్రశస్తి కావ్యం అనదగింది. కాని లేఖకదోషాలు అధికంగా కన్పిస్తున్నాయి. నాటి లేఖన సాంప్రదాయంతోపాటు ఈ లేఖక దోషాలు, శిధిలమైనందువల్ల చెదిరిపోయిన అక్షరాలు కొంత గజిబిజిని సృష్టిస్తున్నాయి. పైగా శాసన లేఖకుడు అశ్రద్ధతో శాసన శిలను సరిగా నునుపు చేసికొనక అక్షరాలను చెక్కినాడు. అదే విధంగా శాసన ప్రారంభంలో ఉండాల్సిన సూర్యచంద్ర చిహ్నాలను శాసనానికి మూడవ ప్రక్క వచ్చేటట్లు చెక్కినాడు.

శాసన విషయం:— ఇది రెండు శాసనాల సముదాయం. ఒక శాసనాన్ని కాకతిగణపతిదేవ చక్రవర్తి దగ్గర శ్రీ కరణాధికారియైన ఆదిత్యామాత్యుని పుత్రుడైన గణపతిమంత్రి వేసినాడు. రెండో శాసనం గణపతిదేవ చక్రవర్తి అనుగ్రహాన్ని సంపాదించిన కేశవామాత్యుని కొడుకైన కేశవామాత్యునిది. మొదటిశాసనంలోని ఆదిత్యామాత్యునికి రెండోశాసనాన్ని వేయించిన కేశవామాత్యుడు అల్లుడు. కేశవామాత్యుడు మామ ఆదిత్యామాత్యునిపేర అయితేశ్వరాలయాన్ని, తాతపేర సోమనాద దేవాలయాన్ని, తండ్రిపేర కేశవనారాయణ దేవాలయాన్ని పూజకు గుగ్గుల ధూపాదులకు పెద్ద చెరువు, దక్షిణగంగ అనే చెరువుక్రింద భూమిని దానంచేస్తూ పూజోపకరణాలు, ఆభరణాలకై కూడ మరికొంత భూమిని దానంచేస్తూ స్థానికంగా ఉన్న స్థానపతులనే అధికారులను నందాదీపం పెట్టమని అభ్యర్థించినాడు.

పై దేవాలయాలకే ఆదిత్యామాత్యుని గణపతి మంత్రి గణపతిదేవ చక్రవర్తిపేర గణపతి సముద్రమనే చెరువు తవ్వించి ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం మూడు పూటలా జరిగే నిత్య పూజా నైవేద్యములకు గణపతి ముద్రం కింద కొంత భూమిని దానం చేశాడు.

ఇద్దరూ (గణపతి మంత్రి, కేశవామాత్యుడు) ఒకే దినాన దానంచేసి, శాసనం వేయించినట్లు భావించుకోవలసి వస్తుంది. శాసనం వేయించిన తేదీ శాసనం చివరకున్నది. తిధి రెండిటికి విడివిడిగా లేనందువల్ల, కేశవామాత్యుడు ప్రతిష్ఠించిన దేవాలయాల పూజానైవేద్యాలకై గణపతిమంత్రి దానం చేసినందువల్ల, ఇద్దరికీ దగ్గరి బంధుత్వమున్నందువల్ల ఈ రెండు శాసనాలు ఒకే దినాన వేయించినట్లు ఊహించవచ్చు. వ్రాతను గమనిస్తే రెండు శాసనాలను ఒకే వ్యక్తి చెక్కినట్లు కూడ కనిపిస్తున్నది.

ఇచ్చట అయితేశ్వరాదుల ప్రతిష్ఠ శాలివాహన శకం ౧౧౪౬ పార్థివ సంవత్సరంలో వైశాఖ శుద్ధ తృతీయ, రోహిణీ నక్షత్రయుక్త శనివారంనాడు జరిగినట్లు ఈశాసనం తెలుపుతుంది. అంటే దేవాలయ ప్రతిష్ఠ క్రీ. శ. 1224 మే నెలలో జరిగింది. అందువల్ల శాసన రచనా కాలంకూడ అదేకావచ్చు.

## సాంఘిక విశేషాలు

'ఈ శాసనాలలో కేశవామాత్యుడు మామ, తాత, తండ్రులపేర ప్రతిష్ఠించిన సూర్యాలయం, ఈశ్వరాలయం, కేశవాలయం పేర్కొనబడ్డాయి. కాకతీయుల కాలంలో త్రికూటాలనే మూడుగుళ్ళను ప్రతిష్ఠించటం సర్వత్రా సామాన్యం. 12వశతాబ్దానికి చెందిన మాచేడు శాసనాలలో "మహాదేవ, ఆదిత్యదేవ, నారాయణ దేవుల ఆలయాలు పేర్కొనబడ్డాయి.[1] అదే శతాబ్దికి చెందిన రుద్రదేవ చక్రవర్తి సామంతుడైన గంగాధరమంత్రి హనుమకొండలో హరి, హర, తిమిరహర, ప్రతిష్ఠను చేసినట్లు గంగాధరమంత్రి హనుమకొండ శాసనం మరియు కరీంనగర్ శాసనం తెల్పుతున్నాయి.[2] రుద్రదేవ చక్రవర్తి కూడ సహస్రస్తంభ మండప దేవాలయంలో తనపేర రుద్రేశ్వరుని, శ్రీవాసుదేవర, శ్రీ సూర్యదేవర అను ప్రతిష్ఠ చేయించినట్లు హనుమకొండ శాసనం తెలుపుతున్నది.[3] 13వ శతాబ్దిలోని కటుకూరు కూడ ఈ మూడు దేవాలయాల ప్రతిష్ఠ పేర్కొనబడింది.[4] ఇదే తరువాతి కాలంలో శైవమత విజృంభణ వల్ల సూర్య, శివ, నారాయణ దేవాలయాలకు బదులు మూడు శివాలయాలే త్రికూటాలుగా తమ ప్రాచీనుల స్మృతి చిహ్నాలుగా తమకు కీర్తి వర్ధకాలుగా ప్రతిష్ఠింపబడేవి.

ఆంధ్రదేశంలో సూర్యనారాయణ ప్రతిష్ఠ చాలా ప్రాచీనమైనది. అనేక స్థలాల్లో జరిగిందే ఐనా తెలుగుదేశంలో సూర్యదేవాలయాలు కనుమరుగైపోయాయి. కొండపాకలో కూడ మూడుగుళ్లు ఉన్నా సూర్య విగ్రహం గుర్తుకూడ లేకుండా పోయింది. శాసనమే దానికి ప్రస్తుతం ఆధారం.

2. కాకతీయులు మహామండలేశ్వరులై తెలుగుదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించినా నిరంకుశంగా మాత్రం పరిపాలించలేదు.[5] మహారాజులననుసరించి వారిసామంతులు, అధికారులూ ప్రజానుకూలంగానే పరిపాలన చేశారు. ఒక విధంగాచూస్తే వారి పరిపాలన ప్రజా స్వామ్య పద్ధతిలో నడిచిందనే చెప్పాలి. రాజులైనా, సామంతులైనా, అధికారులైనా దానం చేసేటప్పుడు స్థానికులను సంప్రదించి, అధికారంలో చిన్నవారైనా వారి అనుమతితోనే దాన ధర్మాలు చేసేవారు. కొన్ని సందర్భాలలో గ్రామంలో ఉండే సమస్త ప్రజాపతినిధులను అంటే అన్ని కులాల ప్రతినిధులను సంప్రదించి వారి అనుమతితో శాసనాలు వేసేవారు.

మొదటి బేతరాజు మంత్రియైన వైజ దండనాదుని కొడుకు నారణయ్య శనిగరంలో దుద్ధమల్ల జినాలయానికి జీర్ణోద్ధరణచేసి స్థానికాధికారులైన ముప్పచయ్యను, పున్నెరడ్డిని ఒప్పించి రాటం (బావిలోనుండి నీరు తోడే యంత్రం) దానం చేశాడు.[6] మొదటి ప్రోలుడు శనిగరంలోనే ఉన్న మధుపేశ్వరునికి ముప్పదయ్య, పున్నెయగా వుండలనే స్థానికాధికారులను ఒప్పించి దానం చేశాడు.[7]

ఇదే విధంగా ప్రతాపరుద్రుని కాలంలో నల్లగొండజిల్లాలోని ఇంక్రియాల గ్రామంలో శ్రీ మన్మహామండలేశ్వర పెండ్లికొడుకు మల్లిదేవ మహారాజుల లెంక ఎల్లురవుతు మూడు ఊర్ల కాపులను, అశేష ప్రజను పిలిపించి వారికి దండము పెట్టి విన్నపమువేసి వారి అనుమతితో దానం చేసినట్లు ఇంకిర్యాల శాసనం తెలుపుచున్నది.8 మెదక్‌జిల్లా దేకుమాలశాసనం మహాప్రధాని పురవరి మహాదేవనాయంకులు అష్టాదశ ప్రజల అనుమతితో చేసిన దానాన్ని తెలుపుతూంది.9

ఇదే విధంగా కొండపాకలో గణపతిమంత్రి, కేశనామాత్యుడు శామధికారులైనప్పటికి ధనవంతులైనప్పటికి ఆ గ్రామంలో ఉన్న ఎక్కటి వీర పరివారానుమతితో దానం చేశారు.

3. ఆ కాలంలో సప్తసంతానాలపై రాజులకు, సామంతులకు, ప్రజలకు చాలా మక్కువ ఉండేది. అందువల్లనే నాటి ప్రజలు అధికారులు, సామంతులు, చెరువులు తవ్వించుట, కాలువలు తవ్వించుట, దేవాలయాలు కట్టించుట వంటి పుణ్యకార్యాలు చేశారు. గంగాధరమంత్రి కరీంనగర్ శాసనం1 తను పెంచిన సంతానము తన సంతానము, కృతి, నల్లిల్లు, (అగ్రహారం) వనము చెరువు, గుడి సప్తసంతానాలని వివరిస్తున్నది. అదే విధంగా ఈ శాసనంలో కూడ వన, నిధి, తటాక, కృతి, నందన, శివభవనా, గ్రహారలబ్ధ మహాసప్త సంతానుడని కేశవామాత్యునిగూర్చి వివరించబడింది. అదే విధంగా సప్త సంతానాలపై ప్రీతితో కేశావామాత్యుడు దేవాలయ ప్రతిష్ఠచేస్తే గణపతిమంత్రి గణపతిదేవ చక్రవర్తిపేర గణపతి సముద్రమనే చెరువును త్రవ్వించాడు.

4. దేవాలయ నిర్మాణంచేసి పూజా నైవేద్యాదులకు భూమిని దానం చేసిన నాటి అధికారులు సామంతులు పూజాది కార్యక్రమ నిర్వహణపై తమ పెత్తనాన్ని, యాజమాన్యాన్ని ప్రదర్శించక తాము దానంచేసిన భూమి మొదలైన వాటిని స్థానికాధికారులకిచ్చి పూజాది కార్యక్రమాల నిర్వహణ జరిగేటట్లు చూడమనేవారు. ముఖ్యంగా నందా దీపానికై కొన్ని గొఱ్ఱెలనో, ఆవులనో, దేవాలయానికి దానం చేస్తూ వాటిని గ్రామంలో ఉండే పెద్ద మనిషికి (బోయుడు అనే వానికి) అప్పగించి ఆ గొఱ్ఱెలను, ఆవులను తరతరాలుగా అనుభవిస్తూ దేవాలయానికి నందాదీపానికై ప్రతిదినం నేయి పోయమని కోరేవారు. "11

ఇదే విధంగా ఈ శాసనాలలోకూడ స్థానపతులనే స్థానికాధికారులను నందా దీపం పెట్టమని కోరినారు.

## రాజకీయాంశములు

1. ఇందలి మొదటి శాసనంలో పేర్కొనబడ్డ ఆదిత్యామాత్యుడు శ్రీ కరణాధికారి. ఈ శ్రీకరణాధికారాన్ని గణపతి దేవచక్రవర్తి ప్రసాదించినట్లు శాసనంలోఉంది. దేవగిరి యాదవరాజైన మహాదేవరాజు దగ్గర హేమాద్రి పండితుడు శ్రీకరణాధికారిగా ఉండేవాడు. "శ్రీ కరణ" అంటే ఉన్నతాధికారి అని శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు పేర్కొన్నారు. ఈ రోజుల్లో గ్రామ కరణముండినట్లే నాడు గ్రామాల్లో రాజుకు సుంకాన్ని వసూలుచేసి లెక్కలుచూపి ఇచ్చేవాని స్థలకరణము, స్థల సుంక కరణము అని అనేవారు. శ్రీ కరణాదికారి కొంతమంది కరణాలపై ఆధిపత్యము వహించే ఉన్నతోద్యోగి కావచ్చును.

ఆదిత్యామాత్యునికి శ్రీ కరణాధికారిత్వంవల్ల కొలిపాక (నేటి నల్లగొండ జిల్లాలోని కొలనుపాక) మొదలైన డెబ్బై గ్రామాలపై అధికారం లభించింది.

ఆదిత్యామాత్యుడు ఇంకా మహామండలేశ్వర బల్లహునివల్ల నూరుగ్రామాలపై ఆధిపత్యాన్నికూడ పొందినాడు. ఈ మహామండలేశ్వర బల్లహుడు చరిత్ర ప్రసిద్ధినొందినవాడు కాదు. వందగ్రామాలపై ఆధిపత్యాన్ని ఇతరులకిచ్చినందువల్ల, మహామండలేశ్వర బిరుదు ధరించినందువల్ల ఈ ప్రాంతంలో ఉన్న ఒక చిన్న సామంతరాజు కావచ్చు. ఈ బల్లహుడే కేశవామాత్యునికి డెబ్బై గ్రామాలపై ఆధిపత్యాన్ని ఇచ్చినట్లు ఇదే శాసనం తెల్పుతున్నది. ఇందు పేర్కొనబడ్డ మహామంగళపురం కూడ ప్రసిద్ధి చెందినదికాదు. అంత ప్రసిద్ధి లేకపోయినా చినచిన్న సామంతులైనా కాకతీయ చక్రవర్తుల విశాల దృక్పథంవల్ల ఆనాడు మహామండలేశ్వర బిరుదు ధరించేవారు. ఇంకిర్యాల శాసనంలో శ్రీమన్మహామండలేశ్వరి పెండ్లికొడుకు మల్లిదేవ మహారాజు పేర్కొనబడ్డాడు. ఇతడుకూడ ఇతర శాసనాలలో ఎక్కడా కన్పించడు.

## భాష

లేఖన దోషాలను వదిలివేస్తూ నాటి లేఖన సాంప్రదాయాలను గమనిస్తే ఈ శాసనాలలోని భాష కావ్యభాషకు మిక్కిలి సన్నిహితమైంది. పైగా ఈ శాసనాలను చదువుతుంటే ప్రశస్తి కావ్యమా అన్నట్లుంటుంది,

మహాభారతాది కావ్యావతారికలలో "తత్కథా ప్రారంభంబెట్టిదనిన" అని వ్రాసి కథను ప్రారంభించినట్లు ఈ రెండు శాసనాలలో "వంశ ప్రశస్తి క్రమం బెట్లన్న " అని ప్రశ్న వేసికొని వంశప్రశస్తిని చిన్న చిన్న సమాసాలతో వర్ణించినాడు.

ఆనాటి శాసనాలన్నిటిలో ఉన్నట్లు వలపలగిలక వాడబడింది.

మహాప్రాణాక్షరాలన్నీ వత్తులులేకుండ అల్పప్రాణాలుగానే రాయబడ్డాయి. థ. ధ- వత్తులు మాత్రం ప్రత్యేకంగా కన్పిస్తాయి.

ఈనాటి రాతలో రెండురకాలైన దీర్ఘచిహ్నాలు ఉపయోగంలో ఉన్నాయి. అ, ఉ, ఋ కారాంత అక్షరాలపై నుండే దీర్ఘ చిహ్నమొకటి. (కా, కూ, కౄ) ఇ, ఎ, ఒ కారాంతాక్షరాలపై నుండే దీర్ఘచిహ్నమింకొకటి. (కీ, కే, కో) కాని నాటి శాసనలిపిలో ఇ, ఎ, ఒ" కారాంతాక్షరాలపై దీర్ఘాలను చాలా చోట్ల సందర్భాన్ననుసరించి ఊహించుకోవల్సిందే. కొన్నిచోట్ల మాత్రం తరువాతి హల్లును ద్విత్వం చేయడంవల్ల (కాకతియ్య, మహనియ్య) పూర్వాక్షరంలో దీర్ఘముందని ఊహించుకోవాలి.

ఈ శాసనాలలో అనేక సంయుక్తాక్షర పదాలను మధ్యకు విడదీసి "ఉ" వర్ణాన్ని చేర్చుకొని రాసినారు. మహాశబుద, అనుమకొండ, దిగుబరిత, తతుకీశ్వర, నవుత్రుండు, లకుమి, శ్రీమనుమహామండలేశ్వర మొదలైనవి. ఇట్టి పద్దతి నాటి శాసనాలలో చాలాచోట్ల కన్పిస్తున్నది.

యకారానికి ఇత్వమిచ్చేటప్పుడు ఈనాటి రాతలో ఇత్వచిహ్నమైన గుడి కన్పించదు. కాని ఆనాటి రాతలో గుడి తప్పక కన్పిస్తుంది.

1. అయిలేశ్వర, నలువయి, స్థాయిగను, యిచ్చితిమి మొదలైనవి.

ఈనాటి రాతలో సంయుక్తాక్షరానికి దీర్ఘము కొమ్ము మొదలైన చిహ్నాలుంచాల్సివస్తే తొలియక్షరం పైననే అద్దులుంచుతున్నాం. కాని నాటి రాతలో వత్తుకు దీర్ఘాలు కొమ్ములు పెట్టేవారు. మన లేఖన సంప్రదాయంలో జరిగిన మార్పిది. ఐనా ఈనాటి రాతలోకూడ "తప్పు" మొదలైన పదాలలో వ వత్తుకు మాత్రమే కొమ్మును పెట్టూ ప్రాచీన లేఖన సంప్రదాయాన్ని జ్ఞప్తిలో ఉంచుకొంటున్నాం. ఆనాటి రాతలో "ఆదిత్య" అంటే ఆదిత్యా అని దీర్ఘాంతంగా చదువుకోవాలి. "ఆదిత్య" అని హ్రస్వాంతంగా రాయల్సివస్తే "ఆదిత్య" అని రాసేవారు. అమాత్యుని అని రాయటానికి బదులు "అమాత్యుని" అని రాసేవారు.

కాకతీయులనాటి శాసనభాషలో సీడ్లు, గుడ్లు, ఊడ్లు, తమ్మడ్లు, కాడ్లు, ఏలముడ్లు దేవడ్లు వంటి'డ్లు' అంతములైన పదాలే ఎక్కువగా కన్పిస్తాయి. "ళ్ల" అంతమందు కల రూపాలు క్వాచిత్కమే. ఈ శాసనాలలోను "గుడ్లు, దేవడ్లు" అనే "డ్లు" మంత రూపాలే కన్పిస్తాయి.

ప్రాచీన లిపిలో సున్నను తేల్చి పలుక వలసినచోట్లకూడ అనుస్వారాన్నే వ్రాసేవారు, వేంటకాఖ, నడుపువాండు, మూండు, తోంట, పోంకవంటి రూపాలు నాటి శాసనాలలో విరివిగా కన్పిస్తాయి. ఇచ్చట కూడ "మూండు" అనేది అనుస్వారంతో వ్రాయబడింది.

ఈ శాసనంలో పాఠిక అనటానికి బదులు "పాదుక" కన్పిస్తుంది. తెలంగాణా ప్రాంతానికే చెందిన వరంగల్లు 12 పెరూరు 13 శాసనాల్లో పాదిక అనే రూపంకూడ కన్పిస్తున్నందువల్ల రెండు రూపాలు నాడు ప్రచారంలో ఉన్నట్లు భావించవచ్చును.

ఇవికాక సాంబ్రాజ్య (సామ్రాజ్య) పవుత్ర (పౌత్ర) వంటి క్వాచిత్కమైన వ్యావహారిక రూపాలుకూడ ఈ శాసనాలలో కన్పిస్తాయి.

కాకతీయులనాటి కొన్ని శాసనాలలో కొన్ని వాక్యాలు చాలా వింతగా కన్పిస్తాయి. కర్త ప్రథమావిభక్త్యేక వచనంలో క్రియ ఉత్తమపురుష బహువచనంలో కన్పిస్తాయి. ఇవి శాసనలేఖకుల అశ్రద్ధవల్ల ఏర్పడ్డాయని చెప్పజాలము. అనేక శాసనాలు ఈ పద్ధతిలో కన్పిస్తున్నాయి. చందుపట్ల శాసనంలో 14 "పువుల ముంమడింగారు......................విత్తిధారా పూర్వకముగానిస్తిమి" అని త్రిపురాంతకం శాసనంలో 15 "...............అన్న వెల్లయరెడ్డింగారు..................సర్వ మాన్యముగానిస్తిమి" అని కనిపించును. ఇట్టి వాక్యాలుగల శాసనాలు నాడనేకం కన్పిస్తాయి.

ఇదే విధంగా ఈ రెండు శాసనాలలోను "గణపతిమంత్రి.........ఆ చంద్రార్కం స్థాయిగాను యిచ్చితిమి॥..........కేశవామాత్యుండు..........వ్రిత్తి ఆ చంద్రార్కం స్థాయిగాను యిచ్చితిమి" అని పై పద్ధతిలోనున్న వాక్యాలు కన్పిస్తాయి. ఈ వాక్యాలు శాసనదాతయే శాసన రచతయైనట్లు భావించుకొనుటచే (శాసనరచయితకూడ కావచ్చును) తన పేరును చెప్పుకొని క్రియను ఉత్తమ పురుషలో వాడినారు. ఈ శాసన రచయితలు పేర్ల తర్వాత "అను మేము" అనే పదాలను జోడిస్తే మనకు ఇబ్బంది తప్పేది. ప్రథమా విభక్తిలో ఉన్న పేరుతోపాటు "మేము" అనే పదాన్ని ఉపయోగించిన శాసనాలుకూడ (నందలూరు,16 మాచెర్ల 17, నాగులపాడు 18 శాసనం మొదలైనవి) నాటికాలంలో కన్పిస్తాయి.

ఈ విధంగా ఒకే శిలపై మలచబడ్డ ఈ రెండు శాసనాలు కావ్య పక్కిలో కన్పిస్తూ నాటి సాంఘిక స్థితిగతులను, భాషను తెలుసుకోవటానికి చాలా చక్కగా ఉపయోగ పడ్తున్నాయి.

ఈ శాసనాలను పరిశీలించటానికి అన్నివిధాలా తోడ్పడ్డ మిత్రులు కొండపాక వాస్తవ్యులు శ్రీ పి. వీరేశం గారికి శాసన ప్రతిబింబాలను స్పష్టంగా తీసి సహకరించిన శ్రీ లక్ష్మీనారాయణగారికి మిక్కిలి కృతజ్ఞతలు.

### శాసన పాఠం

1. శ్రీలక్షుమి (క్ష్మి) కౌ వరాహస్య-యాచరిత .......
2. స్య మెరౌ॥ జజజాయతె॥ స్వస్తి సమధిగత పంచ (మహాశబ)
3. ద మహామండలేశ్వర॥ అనుమకొండ పురవరాధీశ్వర (రవర)
4. మ మాహేశ్వర॥ పరహిత చరిత॥ సకలకీర్తి దిగుబరిత॥ మను(మా)
5. గ్గవిదిత వినయభూషణ॥ మహామండలిక గణపోషణ॥ సిత్యన-
6. -ణ॥ శ్రీమను మహామండలేశ్వర కాకతియ గణపతిదేవ (మ)
7. హారాజులు పృధివి రాజ్యము సేయుచుంనుండంగాను తత్పాదీ (క్ప)
8. ద్మప్రసాద శ్రీ కరణాధికారుండైన ఆదిత్యామాత్యుని వంశ ప్రశ
9. -స్తిక్రమం బెట్టిన॥ శ్రీమను మహామండలేశ్వర (బల్ల) హద త్తలఖ
10. ద శకగ్రామోపేత కాంచిరి పురవర శాసన పట్టబద్ధుండును మ
11. హా మండలేశ్వర చిత్తవశీకరణ మంత్ర సిద్ధుండును॥ సకలగు
12. ణ గణోపేత సత్యసంధ్దుండును॥ గణపతిశితిశ్వర కారుణ్యోపేత కా
13. విపాకాది సప్తతిగ్రామ.-శ్రీకరణాది కారుండును॥ సదాచారుండు
14. ను....కారుండును॥ వరాంగనాదూరుండును॥ వరమేశ్వరాచ్యుతా
15. -స్తోత్రుండును॥ గొమ్మనామాత్య సత్పుత్రుండును॥ ఆ............
16. -ండును॥ సోమనామాత్య పుత్రుం......................
17. .... .... .... ... .... ... .... ...............



కొండపాక 1వ వైపు

18. .... .... .... ▮ చందనుండును॥ ఆదిత్యామాత్య........
19. .... .... .... వంశవార్ధిక........ల పూరణస్ శశాంక........
20. .... .. .... రెతాంకుశుండును॥హలకులిశ కులిశ........
21. (హస్తు)ండును॥ లసతు కాంతియుత దేహుండును ఆ
22. .... .... ండును॥ప్రశస్తి సహితుండునుంన లఖుమి దేవి వలన....
23. .... .... శమంత్ర ప్రభావంబున సిద్ధకుమార చతుష్టయంబునుంబ
24. .... .. లత్రశుష్టుండైన కొడుకును గణపతి శితిశ్వర నామాంకం
25. —ద్వి తీయునిని గణపతి శితిశ్వర నామాంకంబు....త....
26. యుని సోమనామాత్య నామాంకంబు సేసితచ్చతుర్థ పుత్రుని....
27. మాత్యుంతను నామాంకంబుసెసి గణపతిశితిశ్వర కారుణ్యలఖుమి
28. యుతుండైన ఆదిత్యామాత్యుని వంశవర్ధనుండయిన గణపతి మం
29. త్రికొండపాకను గణపతిశితిశ్వర నామాంకమయిన గణప
30. తి సముద్ర బంధనంబు సేసి అందు గణపతి శితిశ్వరానుమత
31. మునను అయితేశ్వర దేవరకు వ్రిత్తిమఱుతురు సోమనాథదే
32. వరకు వ్రిత్తి మఱుతురు॥ కేశవనారాయణదేవరకు వ్రిత్తిమ
33. ఱుతురు॥ అయితేశ్వరదేవరకు రంగభోగమునకు నలుపయిమా
34. డల పొలము రంగభోగము వ్రిత్తి॥గ॥౦॥వ్రిత్తిమూండుమఱు
35. తురు తొవలాను మూండు గుర్లకు పందదివములకు ముప్పా
36. దుక॥ తక్కిన ముప్పాదుకలు మూండుగుర్ల దేవర్లకునుగాన
37. గి యోగిరము వగలంటి యోగిరము మావటి యోగిరమునకు
38. కార్తీక వైశాఖమున సర్వమాన్యము గణపతిమంత్రి ఎక్కటి వి
39. రపరి వారాను మతమునను చంద్రార్కస్థాయిగాను యిచ్చితిమి॥

### రెండవ వైపు

1 శ్రీమను మహామం, 2 డలేశ్వర గణపతిశి, 3 తిశ్వర కారుణ్య పుత్త్రోపే, 4 తుండయిన కేశవామాత్యు, 5 ▮ వంశావలి ప్రశస్తి క్రమం బెట్టిన, 6 శ్రీమను మహామండలేశ్వర, 7 బల్లహ కారుణ్యోపేత దత్త,



కొండపాక 2వ వైపు



కొండపాక 1వ వైపు

8 శ్రీమను మహామంగళపుర, 9 వరాధీశ్వరుండును। తరువు, 10 ర్వయు తుత సప్తతి గ్రామా, 11 ధీశ్వరుండును। రాజ్య సామ్రాజ్య, 12.... . ంకారుండును, 13 పరం పరాయాత పురుష, 14 షోత్తమ మహంతామాత్య ప్రశస్తి, 15 శిలాలిఖిత శాసనుండును, 16 రేచనామాత్యన పుత్రుండును,గో 17 మ్మనామాత్య పపుత్రుండును కేశ 18 వామాత్య పుత్రుండును గోత్ర పవి, 19 త్రుండును బొల్లమాంబికా సుపు, 20 త్రుండును భారద్వాజ గోత్రుండు, 21 ను లనదు గాత్రుండును వినయ, 22 పాత్రుండును విబుధ స్తోత్రుండు, 23 ను శ్రుతిస్మృతి పురాణేతిహాస, 24 సకల కలాగమార్థ తత్వానిశ్ర్శ, 25 పణుండును। లక్ష్మినివహ సంని, 26 హిత నిజభవ నుండును మిత్ర, 27 జన వనజ వనానంద కర మి, 28 త్రుండును। వెంనమాంబి, 29 కా కల్త్రుండును ॥॥

## మూడవ వైపు

చంద్రుడు సూర్యుడు

1 సదుగుణ గణోపేత లక్షణ, 2 సంపూర్ణ గాత్రుండును, మనుముని 3 చరితుండును ధర్మార్థ నిరతుండును, 4 ఐశ్వరియోపేతుండును। వన నిధి తటార, 5. కృతిసందన శివభవ్యాగ్రహారలబుధ, 6. మహాసత్ర సంతా నుండును। ఈశ్వరారాధన, 7 తతుపరుండును। తత్ప్రశస్తి సమేతుం, 8 దను। గణపతిక్షితీశ్వర శ్రీ పాదారాధకుం, 9 దను నైన కేశవామాత్యునకుంగారుణ్యో 10 పేతుంక [-] గణపతిదేవ మహారాజు, 11 ..... తరళతభట ఎక్కటి 12.... .... .... ... .... ... .... ... 13 రను ....... ........... 14 ర మహానాయకొపి (పే) త్రిరా.... 15 ంబిచ్చినంద దెక్కటి మహావీర కారుణ్య లకు, 16 మి నమేతుండునునయి ఆదిత్యామాత్య, 17 కామణ్య శ్రీ పెదస్తుండునునయి కేశవా, 18 మాత్యుండు మామ ఆదిత్యా మాత్యునిపేర.

19 నయితేశ్వర దేవరను। తాతపేరనుసోమ, 20 నాథదేవరను। తండ్రి పేరనుం గేశ, 21 వ నారాయణ దేవరాను సపరివార ప్రతి, 22 ష్ఠలుం జేసి కేశవామాత్యుండు ఎక్కటి వి, 23 ర పరివారాను మతమునను। పెద్దచె, 24 ఱువునందు అయితేశ్వరదేవరకు ప్రి 25 త్తి మఱుతురు। గుగ్గిల ధూపమున, 26 కుంబాదుర। అందకేశవ నారాయ 27 ణ దేవరకు ప్రిత్తి మఱుతురు। దక్షిణ, 28 ణ గంగను సోమనాథదేవరకు ప్రిత్తి మ, 29 ఱుతురు ఈ దేవర్లకునుపకరణ ఆ, 30 భరణోపేతము ప్రిత్తి అచంద్రా కల, 31 స్థాయిగును యిచ్చితిమి॥ ఈ, 32 మూండు మఱురు వలనాను, 33 స్థాన పతులు మూండు నందదివ్వె, 34 లు ఎత్తునది ॥

## నాల్గవ వైపు

1 తక్కా.. (ం) బుధిశస్థితితే శా, 2 కే ప్రతిష్ఠాయయితేశ్వరం।, 3 దా (పొ?) త్తిజావే మాధవే శుక్లే త్రు, 4 తియ్యాశనిరొహిణి॥నా, 5 ంటి శకుని వక్షణములు, 6 ంంళఽ॥సామాన్యోయం దమ్మన్, 7 సేతుంస్రు ప్రాపాం కాలే కాలే పాల, 8 నియోణవదుభిః సర్వాన్నేతాను (భా), 9 గి (వి) నః పార్థివేంద్రానుభూయో, 10 భూయో యాచ (తేరామచంద్రః) 11 స్వ దత్తాం వ (రదత్తాం వా యోహరేత), 12 వసుందరా (ం) షష్టి (వషత్సహ) 13 స్రాణి విష్ఠాయాంజా (యతేక్రిమిః)

## అ ధో జ్ఞా పి క లు


1. తెలంగాణా శాసనములు ఆం-ప్ర- ప్రభుత్వ ప్రచురణ
సంపు 3-వరం. 11, 12 పు 141-145

2.. .......... అదే............వరం -2పు. 126.

సీరియల్

# సృష్టి

ఇచ్ఛాపురపు రామచంద్రం

(గతసంచిక తరువాయి)

## 7.

"పద్మా!"

"ఊఁ." నీరసంగా పలికిందామె.

డాక్టర్ ఆలిస్, సుషమ....ఆమెపక్క పద్మ...మరొకవేపు జయదేవ్.

పద్మ చేతిలో టెస్ట్‌ట్యూబ్ ఉంది. దానిలో అడుగున.... నలుపుకి తిరుగుతున్న ఎరుపురంగులో - కొంచెం పదార్థం.

"జయదేవ్! మీరు చైనా డిష్‌ని తీసుకుని — దీనిలోకి కలపండి...." అంది ఆలిస్.

ఎందుకో తెలియకపోయినా ఆ చైనా డిష్‌ని .. తన వీర్యంని ఆ టెస్ట్‌ట్యూబ్‌లోకి వంచాడు. ఆ జిగురు పదార్థం కొన్ని నిముషాలకి కాని టెస్ట్‌ట్యూబ్ అడుగుకి చేరలేదు. అది అలా జారి టెస్ట్‌ట్యూబ్‌లో అడుగునున్న పదార్థంతో కలిశాక—

ఆలిస్ సుషమకి సైగ చేసింది.

సుషమ పద్మని అవతలకి తీసుకుపోయింది చేయి పట్టుకుని.

"ఏమిటిదంతా?" ఆలిస్‌వేపు చూశాడు జయదేవ్.

మందహాసం చిందించింది ఆమె. 'టెస్ట్‌ట్యూబ్ అడుగున వున్నది మీ భార్య విడుదల చేసిన అండం. చైనా డిష్‌లోకి కలక్ట్ చేసి-మీరు టెస్ట్‌ట్యూబ్‌లోకి పంపారే అది మీ వీర్యం. రెండూ కలసి టెస్ట్‌ట్యూబ్‌లో పిండం ఏర్పడుతుంది. సెమెన్...మగవాడు ఒకసారి స్ఖలించే సెమెన్ 5 నుంచి 8 మిల్లీలీటర్లుంటుంది. దానిలో 200 నుంచి 500 మిలియన్ల వరకూ స్పెర్మటోజోవా ఉంటాయి. తలా, మెడా కలిగిన స్పెర్మటోజూన్ తోక సహాయంతో నిముషానికి 3½ మి.మీ. చొప్పున కదులుతూ 60 లేదా 90 నిముషాలకి యుటిరస్ కావిటీ రెండు మూడు గంటలలో ఫాలోపియన్ ట్యూబ్స్‌లోకి చేరుతుంది. ఈ ట్యూబ్స్‌లోనే ఫెర్టిలైజేషన్ జరుగుతుంది..."

"పద్మా....నేనూ ... యిద్దరమూ సంతానోత్పత్తికి అర్హులమే కదా?"

"ఇంతవరకూ....అంటే ఫాలోపియన్ ట్యూబ్స్‌లో ఫర్టిలైజేషన్ జరిగేవరకూ. దీని తరువాతనే ఎదురయింది సమస్య."

"ఏమిటి?"

ఫాలోపియన్ ట్యూబ్‌లో ఫలదీకరణం చెందిన పిండం-8-10 రోజులలో యుటేరస్ కావిటీకి, అక్కడనుంచి యుటేరస్‌లోకి చేరి...గర్భాశయంలో పెరిగి పెద్దదౌతుంది. దురదృష్టవశాత్తూ.... పద్మ గర్భాశయం ఆమె వయసుకి తగినట్లు ఎదగలేదు. దీనిని వైద్య పరిభాషలో ఇన్‌ఫాన్‌టైల్ గర్భాశయం అంటారు. అందుకే ఆమె సంతానాన్ని ధరించలేకపోతూంది. పద్మ పరిస్థితిలో హార్మోన్స్ కాని ఆపరేషన్ కాని పనిచేయవు."

"మరి-టెస్ట్‌ట్యూబ్‌లో....ఏమిటది?"

"మీ కాబోయే సంతానం. టెస్టుట్యూబ్ బేబీ."

"ఆలిస్!"

"ఔను. మీ వీర్యకణం, పద్మ విడుదల చేసిన అండం— రెండింటి సమ్మేళనమూ అది. ఇదే మీ బిడ్డ కాబోతూంది రెండు వందల ఎనభై రోజులలో, అంటే....అక్షరాలా — మీ దంపతుల రక్తం పంచుకున్న బిడ్డనే మీరు కనబోతున్నారన్నమాట."

"టెస్టుట్యూబ్ బేబీ!"

నాలుగు వారాలపాటు పిండం టెస్ట్‌ట్యూబ్‌లో పెరుగుతుంది."

"తరువాత?"

"దీనిని మానవ స్త్రీ గర్భంలోకి బదిలీ చెయ్యాలి. బేబీకి యీ టెస్ట్‌ట్యూబ్ యిరుకైపోతుంది. పెళ్ళితో మగవాడు సింగిల్‌రూమ్ నుంచి ఫ్యామిలీ పోర్షన్‌లోకి మారతాడే-అలాగ. జాగా చాలదన్న మాట."

"ఈ పిండానికి ఆహారం?"

"సహజంగా అయితే తల్లిగర్భం ద్వారా అందుతుంది.. ఇక్కడ టెస్ట్‌ట్యూబ్ కనుక విటమిన్లు కలసిన ఫ్లూయిడ్‌ని డాక్టరు ఫీడ్ చేయాలి. సరయిన ఉష్ణోగ్రతలో ఉంచాలి టెస్ట్‌ట్యూబ్‌ని. ఫుడ్ ఫీడ్ చెయ్యాలి."

"మరి....నాలుగు వారాల అనంతరం స్త్రీ గర్భంలోకి బదిలీ చెయ్యకపోతే?"

"బేబీ టెస్ట్‌ట్యూబ్‌లో చచ్చిపోవలసిందే." తేలిగ్గా అనేసింది ఆలిస్.

"అంటే టెస్ట్‌ట్యూబ్ బేబీ పూర్తిగా టెస్ట్‌ట్యూబ్‌లో పెరగ లేదన్నమాట. నాలుగువారాలపాటే!...." కొత్త విషయమై తెలుసుకున్నట్లు చూసి అంతలోనే ఏదో స్ఫురించినట్లు—"డాక్టర్! ఎందుకి భ్రూణహత్య?" అరిచాడు.

"జయదేవ్! భ్రూణహత్యా!"

"కాక? పద్మ గర్భాశయం పిండాన్ని పెంచడానికి పనికి రానప్పుడు-తెలిసీ-చేతులారా... ఎందుకీ హత్య?" సూటిగా...ఆవేశంగా అడిగాడు.

కరీంనగర్ జిల్లా శాసనములు-ఆం-ప్ర-ప్రభుత్వప్రచురణ 25-పు 71.
3. తెలంగాణా శాసనములు - సంపు-2—3 పు8.
4. ................అదే.............సంపు3 —ఖమ్మం 4 పు 9.
5 కాకతీయులు శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు-పు. 176.
6. కరీంనగర్ జిల్లా శాసనములు—14 పు 39.
7. .. ....... .... అదే ................ .15 పు 40.
8. భారతి—జనవరి 1978 పు. 40.
9. తెలంగాణా శాసనములు—సంపు 2—54, పు. 166.
10. కరీంనగర్ జిల్లా శాసనములు—25 పు. 71.
11. దక్షిణ భారత శాసనములు సంపు 10—358, 361 పు 426, 427.
12. తెలంగాణా శాసనములు—సంపు 2—14 పు. 58.
13. .. ..... ......అదే........... .సంపు 4—32 పు. 72.
14. భారతి మే 1974, పు. 4.
15. దక్షిణ భారత శాసనములు—సంపు 10 497. పు. 268
16. ....... ...అదే ..... .......496. పు 267.
17. తెలంగాణా శాసనములు—సంపు 3 వరం—13 పు. 146.
18 అదే సంపు 2—31 పు 95



కొండపాక 4వ చైత్య

# ప్రేమ వైభవము

తన్ను దానిచ్చుకొనుటయే త్యాగమయ్యె
త్యాగమే సృష్టితోఁ బుట్టి యజ్ఞమయ్యె
ఎవఁడు నెఱుఁగఁడు సృష్ట్యాదియెపుడొ, కలఁడె
తనదు పుట్టుక తా నెఱిఁగిన జనుండు?

ఉన్నదొక్కఁడె బ్రహ్మమంచెన్ను శ్రుతులు
ఒకటి పెక్కయ్యె నొంటిమై నుండలేక
తల్లి యెదఁ బట్టఁజాలని పెల్లుబుకుచుఁ
పొంగి పాఱెడి స్తన్యంబు పోల్కిఁ గనుము॥

నిప్పు వెరసెట్లు పుట్టెనో గుప్పుమనియె
మెండుకొని మండె జగమెల్ల నిండె నొక్క
భవ్యమైనట్టి తేజంబు పాలకడలి
మీఁది నును జిడ్డు తరగల మిసిమివోలె

ప్రేమ ప్రాథ్మిక హృదయంబె వ్యోమమయ్యె
దాని యుచ్ఛ్వసితమె, జగత్ప్రాణమయ్యె
ఊర్ధ్వటావియె తేజమై యుజ్జ్వలించె
సంభవయ్యెను, బాష్పకణంబె యిట్లు॥

వ్యక్తమయిన ప్రేమ రసార్ద్ర పంజసంబు
కాల కర్మ స్వభావ యోగమునఁ జేసి
కరడు గట్టిన పైపాలు గట్టిపడఁగ
ధాత్రియయ్యెను జగదేక ధాత్రి ప్రేమ॥

వివిధ మార్గములను బట్టి ప్రేమలక్ష్మి
విశ్వమయతను నిగ్గొందె విశ్వమయుని
తోడ నతఁడెట్టులాడిన నాడుదట్లె
కూడితో దారమట్లను స్వాంతగతిని॥

కలుషతేదతఁడైనఁ దాఁగాంతియగును
సూన మతఁడైనఁ దాఁదేనె సోనయగును
జలదమతఁడైనఁ దాను క్రొంజలునయగును
తల్లియతఁడైనఁ దాను దత్ స్తన్యమగును॥

ప్రేమ సామ్రాజ్య వైభవంబేమి సెప్ప?
అన్నియును జుట్టుకొనెదుఁ బేరాస కాదు
అన్నియును మ్రింగు లయకాలయముఁడు కాఁడు
కడుపులోఁ బెట్టుకొనుఁ బ్రేమ కన్నతల్లి

ఆదరించును భువి జగత్ప్రాణమట్లు
దివియు భువియుఁ ద్రివిక్రమ దేవునట్లు
చేతులను జాచుఁ గౌఁగిటఁ జేర్చుకొనుటె
పుచ్చుకొనుటకుఁ గాదింత నిచ్చుకొనుటె॥

రచన 1929

**కైలాసవాసి, శ్రీ జనమంచి వేంకటరామయ్యగారు**

ఆమె జవాబు చెప్పలేనట్లు ఉండిపోయింది వెర్రిదానిలా చూస్తూ.

అతను ఉద్రేకంగా లేచాడు.

"జయదేవ్! ఆగండి...నేను చెబుతున్నది వైద్యశాస్త్రరీత్యా సత్యం ''

''ఏమిటి?''

''మరొక జీవిని సృష్టించగలిగే మగవాడి వీర్యంలోని జీవ కణాలూ, స్త్రీ విడుదల చేసే అండమూ రెండూ ప్రాణం కలవే కదా? స్పెర్మటోజోన్‌కి స్వయంచలనం ఉంది కూడా.''

"ఔను. శుక్ర శోణితాలు ప్రాణమున్నవే. ఐతే?''

''ప్రతి మగవాడూ హంతకుడూ, ప్రతి స్త్రీ హంతకురాలూ—''

నిర్ఘాంతపోయి చూశాడు. ''ఎలా?''

''ఒక మగవాడు ఒకసారి స్ఖలించే వీర్యంలో 200 నుంచి 500 మిలియన్ల వరకూ స్పెర్మటోజోవా ఉన్నా - అంటే .... ఒక ప్రపంచ జనాభాని సృష్టించగలిగే అన్ని జీవకణాలున్నా వాటిలో ఒకటే ఫలవంతం ఔతుంది. మిగిలినవి నశించిపోవలసిందే అంతే.. వీర్యం స్ఖలించిన ప్రతిసారీ ప్రతి మగవాడూ 200 నుంచి 500 మిలియన్ల వరకూ హత్యలు చేస్తున్నాడు!''

తెల్లబోయి చూశాడు

''స్త్రీ తన జీవితంలో 30-35 సంవత్సరాలు అండాన్ని విడుదల చేస్తుంది. అంటే 360 నుంచి 540 వరకూ అండాలను తయారుచేస్తుంది కాని...సగటున నలుగురకంటె కనదు. అంటే- ప్రతి స్త్రీ జీవితంలో 350 నుంచి 500 వరకూ హత్యలు చేస్తుందనేగా?''

అతనికి నోటమాట రాలేదు ఆలిస్ చెబుతున్న లాజిక్‌కీ- కొత్త విషయానికి. ఈ ప్రపంచం అంతా హంతకులమయమేనా? ప్రతివాళ్లూ హంతకులేనా?

ఆలిస్ వేదాంతిలా నవ్వింది. "ఇక్కడే భగవంతుడు వస్తాడు. సృష్టి విచిత్రంగా మిగిలిపోతుంది అర్థం కాకుండా. ఒక్క స్పెర్మటోజోవా మాత్రమే అండాన్ని చేరగలిగినప్పుడు (అదీ సందేహమే) అన్ని కోట్ల వీర్య కణాలనెందుకు సృష్టించాలి. ఒకసారి మగవాడు స్ఖలించే వీర్యంలో తడవకు 200 నుంచి 500 మిలియన్ల హత్యలు చేసే మగవాడు - తన జీవితకాలంలో ఎన్నిసార్లు స్ఖలించి - ఎన్ని కోట్ల కోట్ల స్పెర్మటోజోవాని హత్య చేస్తాడు! ఎందుకిలా?"

అతనికి మతిపోయింది. వెర్రివాడిలా మిగిలిపోయాడు.

"జ్ఞాపకం చేసుకోండి జయదేవ్! .. కర్మణ్యేవాధికారస్తే... కర్మ చెయ్యడంవరకే నీ వంతు. మాఫలేషు కదాచన .. ఫలాఫలములతో నిమిత్తం లేదు. హిందూమతం మంచి వేదాంతం చెబుతుంది. నిజంగా మనిషి మనసుని నిర్మలమూ తేలికా చేసేలా ''

కొన్ని నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

అప్పుడు...మాటలకి తడుముకుంటూ అన్నాడు జయదేవ్....

"ఏమిటో . మీరలా చెప్పినా నాకు శాంతిగా లేదు ఆలిస్ .. మీరు చెప్పడానికీ - ప్రస్తుతం జరుగుతున్నదానికీ వ్యత్యాసం ఉంది."



"ఏమిటి?"

"ఆ హత్యలు స్త్రీ పురుషులు కావాలని చేసేవి కావు. వాటికి బాధ్యత ప్రకృతివి. కాని... యీ టెస్ట్‌ట్యూబ్ బేబీ...మనకి తెలుసు రేపు నాలుగు వారాల అనంతరం దీనిని పద్మ గర్భంలో పెంచలేమనీ, హత్య చెయ్యక తప్పదనీ. అంటే - తెలిసీ చేసే హత్య యిది. దీనికి బాధ్యులం మనమే. ప్రకృతి కాదు. అందుకే నాకు పాపం చేస్తున్నట్లనిపిస్తూంది.

అదీకాక...పద్మ కోరిక స్పష్టంగా - తన రక్తం పంచుకు పుట్టిన బిడ్డని హృదయానికి హత్తుకోవాలని, ఈ టెస్ట్‌ట్యూబ్ బేబీని ఆమె గుండెల కదుముకుని తృప్తి చెందదు, కొంచెం గులాబీరంగులో వున్న పింక్‌నుంచి రోజ్‌కి తిరుగుతున్న ట్యూబ్‌లోని జిగురు పదార్థాన్ని తన బిడ్డ అని భావించుకోనూ భావించుకోదు.

వద్దు డాక్టర్... ఏ జన్మలో ఏ పాపం చేశామో....అన్నీ వుండి ఆత్మశాంతికి నోచుకోక అల్లల్లాడుతున్నాం. మళ్ళీ యిప్పుడు యీ జన్మలో మరో హత్యచేసి వచ్చే జన్మలో బాధ అనుభవించడం దేనికి?"

ఆలిస్ నిట్టూర్చింది.

విద్యావంతుడయిన జయదేవ్ కూడా యిలాగే ఆలోచిస్తాడా? పరిస్థితినెందు కర్థం చేసుకోడు? పునర్జన్మలూ...హత్యలూ....అంటూ మూర్ఖత్వమేమిటి?

"జయదేవ్! ఈ టెస్ట్‌ట్యూబ్ బేబీ ...నా ఇన్‌ట్యూషన్... ఏసు చెప్పాడు. సూచించాడు. అందుకే యింత శ్రమ తీసుకున్నాను... "

"మీ శ్రమకి నేను మూల్యం చెల్లిస్తాను. భగవంతుడు మాత్రం అనుగ్రహించడు."

"ఇదే చిట్టచివరి అవకాశం. చేజారితే మళ్ళీ రాదు. పద్మ ఏడాదిలోగా బిడ్డని కనే అవకాశం యిక ఉండదు"

"ఇప్పుడు మాత్రం ఎక్కడుంది? నాలుగు వారాలు టెస్టుట్యూబ్‌లో పెరిగి అప్పుడు పెరిగేందుకు గర్భం దొరక్క...ఊపిరాడక గిలగిలలాడుతూ చచ్చిపోవలసిందేగా? వద్దు. ఆ హత్యేదో ఇప్పుడే చేయనివ్వండి" ఉద్రేకంగా లేచాడతను. "ఆ టెస్టుట్యూబ్‌ని బద్దలు చేసేస్తాను. క్షమించండి ఆలిస్ ..."

ఆమె తృళ్ళిపడింది. కష్టపడి సాధించిన టెస్టుట్యూబ్ బేబీని...అతను...

"జయదేవ్!" అరిచింది తన ప్రాణం పోతున్నట్లు.

కాని అతను ఆగలేదు. వేగంగా ...విసురుగా... తలుపు తోసుకుని....కారిడార్‌లోకి పరుగెత్తాడు క్షణం ఆలస్యమయితే తన మనసెక్కడ మారిపోతుందో అన్నట్లు. స్థూలకాయురాలయిన ఆలిస్ త్వరగా లేవలేకపోయింది.

ఆమె కళ్ళల్లోకి నీళ్ళు వచ్చాయి. "అంతా వృథాయేనా?"

ఆమె తలఎత్తి చూసింది. గోడమీద కరుణామయుడయిన ఏసు ప్రభువు!

* * * *

వ్యసనంకంటె నేరం మగవాడి బాధ్యతారాహిత్యం. వ్యసనం అతడినొక్కడినే నాశనం చేస్తే - బాధ్యతారాహిత్యం అతనితోపాటు అతని కుటుంబాన్నంతటినీ వీధిన పడేస్తుంది. అతనికి సోమరితనమూ, బాధ్యతారాహిత్యమూ. కష్టపడి పనిచేయడమంటేనే కాదు, అసలు పని చేయడమంటేనే అతనికి చిరాకు. పదిహేనేళ్ళు కాపురం చేశాక కానీ నాకాయన తత్త్వం పూర్తిగా తెలియకపోవడం నా దురదృష్టమూ, పిల్లల దురదృష్టమూ.

చిన్నప్పటినుంచీ సోమరే అయిన వారికి చదువు బాగా అబ్బలేదు. అందుచేత మంచి ఉద్యోగమూ లభించలేదు. ఎనిమిది వందల జీతానికి-ఉదయం ఎనిమిదినుంచి రాత్రి ఎనిమిది వరకూ పనిచేయాలి. నేను కొంచెం మాత్రమే చదువుకున్నాను. అయినా పాలిప్యాకెట్లు పంచి నెలకి రెండు వందలు సంపాదిస్తూ వచ్చాను, వేడినీళ్ళకి చన్నీళ్ళుగా.

-మొదటినుంచీ అంటూనే ఉండేవారు - "ఈ వెధవ పని చెయ్యను. ఉద్యోగం వదిలేస్తాను-"

నిజమనుకోలేదు. నవ్వి "వదిలెయ్యడం సులభమే. సంపాదించడమే కష్టం. ఉద్యోగం వదిలేసి ఏం చేస్తారు?" అడిగేదాన్ని.

"వ్యాపారం."

"పెట్టుబడి?"

"అదే చూస్తున్నాను. పెట్టుబడి పెట్టేవాడెవరయినా దొరికితే బాగుండును."

"కోరుకుంటున్నప్పుడు మేనమామ చెవిలో వెంట్రుకలు కోరుకోవడమెందుకూ? ఊరికే లక్షలో కోట్లో వచ్చిపడాలని కోరుకోండి. కాలుమీద కాలేసుకుని కూర్చోవచ్చు మీ కోరిక తీరా."

ఆయనకి చాలామందిలాగే .... ముదనష్టంమీదా, సులభధనం (ఈజీ మనీ) మీదా ఆశ. అందుకే జీతంలో ఏభై రూపాయలపైనే లాటరీ టిక్కెట్లకి తగలేసేవాడు.

"వద్దండీ. ఆ ఏభయ్యీ వుంటే మనం కొంత సుఖంగా బతకొచ్చు. ఎందుకు తగలేస్తారు? నిజంగా అదృష్టముంటే లాటరీలోనే రానక్కర లేదు. మరో రూపంలో అనుగ్రహిస్తుంది. ఇన్నేళ్ళయి కడుతున్నారు, ఒక్కసారి....వొక్క చిన్న ప్రైజయినా తగిలిందా? నా మాట వినండి, ఇకనయినా లాటరీ టిక్కెట్లమీద తగలెయ్యకండి "

"నోరుమూసుకో. అపశకున పక్షిలా కూయకు. ఓర్చినమ్మకు తేటనీరని వినలేదూ? చిన్న ప్రైజులు తగల్లేదంటే అర్థం పెద్ద ప్రైజు తగులుతుందని. శనిగ్రహంలా మాట్లాడకు. నా జీవితాన్ని- మన జీవితాలని మలుపు తిప్పగలిగేది లాటరీయే. ప్రభుత్వంవారే చెబుతున్నారు, లాటరీ టికెట్ కొనండి, లక్షాధికారి కండు ...అని."

నోరు మూసుకున్నాను. ఆడదాన్ని... భార్యని. అంతకంటె

ఏం చేయగలను? వచ్చే డబ్బుతో నాకు చేతనయినంత మేరకు యిల్లు నడుపుతున్నాను.

నాకు కలలున్నాయి. ఇద్దరు పిల్లలనీ చక్కగా చదివించాలని. వాళ్ళకి మంచి తిండీ, చక్కని బట్టలూ... ఎక్కువ చదువూ యివ్వాలనీ ఘనంగా పెంచాలనీ. కాని - అవన్నీ మా తక్కువ ఆదాయంలో ఎలా సాధ్యపడతాయి? రోజు రోజుకీ ధరలు పెరుగుతూ జీవితం మరీ క్లిష్టమైపోతూంది. ఆయన యింట్లో యిచ్చే ఐదు వందలూ, నావి రెండు వందలూ ఏడు వందలలోనూ యింటద్దె కట్టగా తిండికే చాలడంలేదు సరిగ్గా. ఆయనకేమో ఓ పూట మాంసభోజనం కావాలి. విలాస జీవితం కావాలి. ఎలా?

"మీరు జీతం పూర్తిగా యింటికి తెస్తే కాని పరిస్థితి మెరుగు పడదు. లాటరీ టిక్కెట్లకు తగలేసేది - కూరలకి పెడితే కొంత నయం."

ఆయన నావేపు చూశారు....ఎప్పటిలా కాదు. కొత్తగా.

ఒక నవ్వు నవ్వారు. "ఈ దరిద్రం యింకెన్నాళ్ళులే. ఒక్క నెల కళ్ళు మూసుకో."

"మూసుకుంటే?"

"నువ్వే చూద్దువుగాని ఏం జరుగుతుందో."

"ఏం జరుగుతుంది?"

"ఇంటి పరిస్థితి....మన దశే మారిపోతుంది. చిలక జోస్యం. యీ నెలలో నాకు లాటరీ తగులుతుంది. తథ్యం."

"మంచిదే. ఐతే ఒక్క టిక్కెట్టే కొనండి. తగిలేదయితే ఒకటే చాలు, ఫస్టు ప్రయిజు ఒక్కటే ఉంటుంది కనుక. మిగిలిన జీతమంతా ఇంటికి తెండి ఇవాళ జీతాలరోజు..."

ఆయన నవ్వి వెళ్ళిపోయారు.

సాయంత్రం వంట త్వరగా చేసేశాను. పిల్లల్ని పడుకోమన్నాను, సెకండ్‌షోకి తీసుకెళ్తానని.

ఎదురు చూడసాగాను చీకటి ...రాత్రి....అర్ధరాత్రి...తెల్లవారిపోయింది.

ఆయన రాలేదు. ఏమయ్యారు! ఎక్కడికి వెళ్లారు?

కంగారుగా ఆయన పనిచేసే కంపెనీకి వెళ్ళాను.

"మీవారు ఉద్యోగం వదిలేశారు. కంపెనీనుంచి రావలసిన చివరి పైసా కూడా తీసుకుని వెళ్ళిపోయారు."

"ఎక్కడికి?" నా నెత్తిమీద పిడుగు పడినట్లయింది. కళ్ళు బైర్లు కమ్మాయి.

"కట్టుకున్నదానివి - నీకు తెలియకపోతే, కంపెనీకి తెలుస్తుందా?"

వెర్రిమొహం వేసుకుని బయటకు వచ్చాను. నా కేడుపొస్తూంది. ఆయన ఎక్కడికి వెళ్ళిపోయారు? డబ్బంతా తీసుకుని.... మాటమాత్రంగా అయినా నాకు చెప్పకుండా ఎక్కడికి వెళ్ళిపోయారు? ఎప్పుడు వస్తారు?

ఇప్పుడు నేనేం చేయాలి?

పోలీస్ రిపోర్టిద్దామంటే అనవసరమౌతుందేమో. నా అనేవారెవరూ లేరే! ఆడదాన్ని...ఒంటరిదాన్ని పోలీసులతో పడగలనా? నేనేం చేయాలి? ఆయన వస్తారని ఎదురుచూడాలా? ఏడుస్తూ కూర్చున్నా నంతకంటె ఏమీ తోచక.

మర్నాడు ఆయన రాలేదు. కాని సాయంత్రం ఉత్తరం వచ్చింది నా పేర. ఆశ్చర్యంగా.. ఆత్రంగా అందుకున్నాను. నాకు ఉత్తరం రావడం జీవితంలో అదే మొదటిసారి.

"లతా!

జీవితంతో నాకు విసుగెత్తింది. ప్రతిదానికీ తడుముకుంటూ అన్నిటికీ లోటుపడుతూ...చావలేక బతుకుతున్నట్లు ఏమిటిది? ఎన్నాళ్ళిలా? అందుకే నేనొకటి నిశ్చయించుకున్నాను. కాకిలా కలకాలం బతకడంకంటె హంసలా ఆరునెలలు బ్రతికితే చాలని. ఇన్నాళ్ళూ కాకిలాగే బ్రతికాం మనం. హంసలా బతికే అవకాశం ఉందో లేదో. అటో యిటో తేల్చుకుందామని చిట్టచివరిసారిగా నా అదృష్టాన్ని పరీక్షించదలచుకున్నాను. అందుకే ఉద్యోగం వొదిలేసి...రావలసిన డబ్బంతా తీసుకుని లాటరీ టికెట్లు కొనేశాను. కనీసం లక్షయినా వచ్చిందా నేను తిరిగి వస్తాను. లేదా...ఇంతే సంగతులు, ఈ నెల ఇరవై తొమ్మిదిన నేను రాకపోతే నువ్వూ పిల్లలూ నామీద ఆశ వదిలేసుకోవచ్చు. హాయిగా కాక మరోలా బ్రతకడం అనవసరమని నా ఉద్దేశం...అందుకే యీ నిర్ణయం.

ఇరవై తొమ్మిదిన రాకపోతే నన్ను మరచిపోండి...."

నా కళ్ళని నేనే నమ్మలేకపోయాను. ఈ ఉత్తరం నిజమేనా? అసలు ఇటువంటి మనుషులుంటారా? తిండికీ బట్టకీ లోటు లేకుండా బతుకుతున్నా - జీవితం విసుగెత్తిందా! భార్య పిల్లల పట్ల విషయం ఏమీ చేయకుండా .. తన దారి తను చూసుకునేందుకు—



మగవాడయితే మాత్రం అతనికా అధికారం ఎక్కడిది? కనీసం నైతిక బాధ్యతయినా లేదా? అతనినే నమ్ముకున్నామే! అతనిమీద ఆధారపడినవాళ్ళమే! మాకొక మార్గం చూపకుండా - తన యిష్టం వచ్చినట్లు చేయడాని కతనికెలా మనసొప్పింది? మానవత్వమేనా అడ్డు పడలేదా అతనలా నిర్ణయం తీసుకొందుకు? ఎవరి జీవితం వారిదేనా? ఆయన — ఎలా ఇంత పని చేయగలిగారు? భార్యాబిడ్డల పట్ల జాలి .. దయ . ఆలోచన లేకుండా ... తాను ఒక్కడే అన్నట్లు అంతా తన ఇష్టమే అన్నట్లు.... మమతానుబంధాలను కూడా మరచి ఎలా చేయగలిగారిలా! మగవారయిన ఆయనకే జీవితం విసుగెత్తితే ఆడదయిన తన విషయమేమిటి? తనూ ఆయనలాగే...ఊహుఁ.... ఆయనలా పారిపోవడంకాక ఏకంగా జీవితంనుంచే పారిపోయి ఆత్మహత్య చేసుకుంటే?

మనసు ఒప్పింది కాదు. ఒక్కసారి కళ్ళముందు యిద్దరు పిల్లలూ మెదిలారు. "అమ్మా! నువ్వు కూడా వెళ్ళిపోతే మాకు దిక్కెవరమ్మా? మమ్మల్నెవరు చూస్తారమ్మా?" అంటూ ఏడ్చినట్లయింది.

పిల్లలని దగ్గరకు తీసుకుని కన్నీటితో "మగవాడయిన ఆయన బాధ్యతను మరచి పిరికివాడిలా ప్రవర్తించారు కానీ - నేనలా చేయను. మీకోసం...నాకోసం...పరిస్థితులతో పోరాడుతాను శాయశక్తులా. . జీవితాన్ని గెలుచుకుందుకు చిట్టచివరి రక్తపు బొట్టువరకూ పోరాడుతాను." అనుకుంది మనసులో,

ఐతే అతిత్వరలోనే జీవనపోరాటం ఎంత కష్టమో ఆమెకు తెలిసివచ్చింది.

చేతిలో ఉన్నవి రెండే రెండు వందల రూపాయలు.

ఇంటద్దె...పాలు...వెచ్చాలపాపు . చాకలి... చిల్లర ఖర్చులు పిల్లల స్కూలు జీతాలు....ఏవి చెల్లించాలి? ఏవి మానెయ్యాలి ... వాయిదా వెయ్యాలి?

"వారు వస్తారు. ఊరినుంచి రాగానే మీ బాకీ చెల్లిస్తాను."

తన మాటలలో తనకే నమ్మకం లేదు. నిజంగా వారు వస్తారా? వారు రావాలంటే కొంత పెద్ద మొత్తం బహుమతి రావాలి. ఏ లక్షో వస్తే ఉన్నదంతా ఊడ్చిపెట్టి ఉద్యోగం వదిలేసి అంతా లాటరీ టికెట్లమీద మదుపు పెట్టేసి అదృష్టాన్ని పరీక్షకు వదిలిన ఆ వింతమనిషి నిజంగా పెద్ద బహుమతే వస్తే - తాము వారికి జ్ఞాపకముంటారా? కొత్త జీవితం.....దానికి కొత్త భార్య అనుకుంటారేమో? ఆ మనిషి ఏం చేస్తే ఆశ్చర్య పడడానికుంది?

దినమొక యుగమై పోయింది - ఆయన లేకకాదు, డబ్బు లేక! అందుకే ప్రతి నిముషమూ వారి గురించే ఆలోచన! ఎదురు చూపు. అవసరాలకి చేతిలో డబ్బుంటే నిజంగా యింత ఆరాటముండేది కాదేమో మనిషి కోసం అని ఆమెకే అనిపించేది.

రోజు గడిస్తే ఒక పక్క వొద్దున పడినట్లుండేది కొంత. మరోపక్క భయం వేసేది. ఇరవై తొమ్మిదో తారీకు దగ్గర పడిపోతూందంటే. తన అదృష్టమూ పిల్లల అదృష్టమూ శాశ్వతంగా తేల్చివేసే రోజది. ఏం తీర్పు చెబుతుందో? తలుచుకుంటూంటే భయంతో వణుకు పట్టూంది.

"నాన్న ఏరీ?" అనే పిల్లలకి,

ఆయనెప్పుడొచ్చి మా అప్పులు తీరుస్తారమ్మా?" అనే బాకీలవాళ్ళకి జవాబులు చెప్పలేకపోతున్నాది. ఎలాగై తేనేం ఇరవైతొమ్మిది రానే వచ్చింది. తెల్లవారడమేమిటి - తలుపు దగ్గరే కూర్చుంది ఆయన రాకకోసం ఎదురుచూస్తూ.

తనకి భర్తగా కంటె...పిల్లలకి తండ్రిగాకంటె...ఈ ఇంటి యజమానిగా డబ్బు సంపాదించేవాడిగానే ఆయన అవసరం ఎక్కువేమో! చేదుగా అనిపించినా అదే నిజమంది ఆమె యిన్నిరోజుల అనుభవమూ. రెండువందలతో జీవితం గడవదని కచ్చితంగానే తేలిపోయింది.

మధ్యాహ్నం...సాయంత్రం అవుతూంది.

ఆమె ఆత్రతా ఆరాటమూ అధికమౌతున్నాయి.

లాటరీ టికెట్‌కి బహుమతి ... పెద్ద బహుమతి రావడం—ఎక్కువ ఆశపడకూడనిది. అంటే...ఆయన రావడం... తిరిగి రావడం కూడా అంతేనా?

ఆమె గుండె జలదరించింది. వారు తిరిగి రాకపోతే బతకడం ఎలా? ఎవరూ లేని తను...ఒంటరిగా....యిద్దరు పిల్లల్ని వేసుకుని ఎలా బతకాలి? భగవంతుడా! కరుణించు. వారిని రప్పించు. నన్ను రక్షించు.

చీకటి...రాత్రి .. అర్ధరాత్రి....

ఆయన రాలేదు. ఆమెకు కళ్ళనిండా ఏడుపూ... గుండెల నిండా దుఃఖమూ, మనసునిండా దిగులూ మాత్రమే వచ్చాయి. ఏడుస్తూనే కూర్చుంది రాత్రంతా, వీధి గడప దగ్గర.

ఆమెకు 'రేపు' అనేది బహు భయంకరంగా తోస్తూంది కత్తుల కొరడా పట్టుకుని - క్షణక్షణమూ మీదికి వస్తూంది జడిపిస్తూ. ఎందరికో ఆశను కల్పించే 'రేపు' ఆమెను తెగ భయపెడుతోంది.

రేపేమౌతుంది?

ఆయన రారని తేలిపోయింది. ఆయనకి బహుమతి రాలేదు. లాటరీ టిక్కెట్ల మీద పెట్టిన మదుపు .. జీవితం...వృధా. ఆయనకి అదృష్టం లేదు. ఎక్కడున్నారు వారు? ఎలా ఉన్నారు?

తెల్లవారింది.

ఆమె జీవితమూ తెల్లవారింది.

* * *

[ఇంకా ఉంది]

డా. ఎ. విజయదత్తాత్రేయశర్మ

# ఆంధ్రప్రాంతంలో బౌద్ధమత సూచక గ్రామ నామములు -ఒక పరిశీలన

అశోకునికి పూర్వకాలముననే ( క్రీ. పూ. 3 శ. ) ఆంధ్రదేశమున అడుగిడిన బౌద్ధమతము సుమారు వెయ్యేళ్ళ కాలము వృద్ధి, క్షయముల నొంది నది. ఆ పరిణామ ప్రభావము ఆంధ్రప్రాంత ( శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల్లో గ్రామ నామములపై ఏర్పడిన వైనమును తల స్పర్శిగా పరామర్శించుట ఆ సక్తిదాయకంగా ఉంటుంది.

## బుద్ధనామ ప్రభావం

### సిద్ధాంతం (శ్రీకాకుళం జిల్లా, శ్రీకాకుళం తాలూకా)

తూర్పుగాంగ ప్రభువు రెండవ ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనం (క్రీ. శ. 585)లో పేర్కొనబడిన "సిద్ధార్థక" గ్రామమే నేడు "సిద్ధాంతం"గా మారినదనీ గుర్తింపబడినది.[1] బుద్ధుడు తొలుత సిద్ధార్థుడు గదా!

కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకాలోను, పశ్చిమగోదావరిజిల్లా తణుకు [2] తాలూకాలోను గల "సిద్ధాంతం" గ్రామములు కూడా పై వివరణకు అను కూలమైనవిగా భావించ వచ్చును.

### బుద్ధాం (గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా)

"ఈ గ్రామమునకు మొదట బుద్ధ గ్రామమని పేరుండి అది క్రమముగ బుద్ధగామము, బుద్ధగాం, బుద్ధాంగా మారియుండును. ఈ గ్రామం మొత్తం మీద బౌద్ధశిధిలములేని ఇల్లు ఒక్కటి యైనను లేదు."[3] బుద్ధాం (శ్రీకాకుళం జి. పాలకొండ తా. ) ఈ కోవలోనిదిగా పరిగణించుటకు వీలున్నది.

### బుదవాడ (నెల్లూరు జిల్లా, ఉదయగిరి తాలూకా)

బుద < సం. బుద్ధ.

పై సూత్ర ప్రకారం బుదనాం ( నెల్లూరు జి. గుడూరు తా. ) బొద్దాం ( శృంగవరపు కోట తా. విజయనగరం జి. నరసన్నపేట తా. శ్రీకాకుళం జి. ) బొద్దనపల్లి ( కృష్ణా జి. నూజివీడు తా. ) మొ॥ బౌద్ధనామ ప్రభావ సంజనితములుగా భావింపవచ్చును.

### బుద్ధవరం (కృష్ణా జిల్లా. గన్నవరం తాలూకా)

ఒకవేళ పాలకవ్యక్తి నామపరంగా వెలసినప్పటికీ ఆ వ్యక్తి నామంపై గల ప్రభావమేదో స్పష్టంగానే ఉన్నది.

### బుద్ధపాడు (నెల్లూరు జిల్లా, ఆత్మకూరు తాలూకా)

మహిమలూరుకు దక్షిణంగా గల బుధపాడు అనే పురాతన గ్రామస్థలం ఒకప్పుడీ ప్రాంతాన ఉండిన బౌద్ధమత ప్రభావ సూచితమని అభిప్రాయం.[4]

'పాడు' నామాంత్యమున గల గ్రామములు ఒకప్పుడు బౌద్ధ జైనములు ఉనికి పట్ల వైదిక మత పునర్విజృంభణా ఫలితముగా పాడుపెట్ట బడినవిగా తలంపబడుచున్నవి. ఆ లెక్కన ఒక్క శ్రీకాకుళం జిల్లాలోనే అయిదు బొద్దపాడులున్నవి (పాతపట్నం, టెక్కలి, సోంపేట, నరసన్నపేట, శ్రీకాకుళం తా.).[5]

### బొజ్జనపల్లి (నెల్లూరు జిల్లా, రాపూరు తాలూకా)

"బొజ్జ" — "బుద్ధ"కు తద్భవ రూపమని టర్నర్.

అయితే, బొజ్జన్నకొండ (అనకాపల్లి తా. విశాఖపట్నం జి.) బుద్ధన్న కొండకు వికృతి.[6]

## బౌద్ధాచార్య ప్రభావం

గుంటూరు జిల్లాలోని నాగార్జునకొండ విఖ్యాత బౌద్ధాచార్యుడైన నాగార్జునుని పేరు వ్యవహరింపబడుతున్నది. కాగా గుంటూరు తాలూకాలోని "లాము"నకాపేరు బుద్ధలామాను బట్టి వచ్చి యుండవచ్చునని ఒక ఊహ.[7]

## బౌద్ధమత సంబంధిత నిర్మాణాల ప్రభావం

బుద్ధుని మహాపరి నిర్వాణమునకు సంకేతముగ రూపెత్తిన శారీరక, పారిభోగిక, ఉద్దేశికలేక నిర్దేశిక స్తూపములు, బౌద్ధభిక్షకీ భిక్షుల కావాసము లైన విహారాదులను బట్టి కొన్ని ఊర్ల పేర్లు, స్థలనామములు ఏర్పడినవి. అందులకుదాహరణములుగా ఈ క్రింది వానిని పేర్కొనవచ్చును.

### మందసా ( శ్రీకాకుళం జిల్లా, సోంపేట తాలూకా )

"నేటి మందసా పట్టణము నాటి బుద్ధ దంతము గల మంజూష యొకటి స్థాపితమైన పట్టణము కానోపుననియు, "మంజూషా" శబ్దమే వికృతిని బొంది "మందసా"గా జనుల వాడుకలో నిలిచి యున్నదనియు కొందరభి ప్రాయము".[8]

### దంతపురం

బుద్ధుని నిర్వాణానంతరము ఆయన దంతమును తెచ్చి ఒక స్థూపమున దాని నుంచి ఆ పురమున భద్రపరచుటచే ఆ పురమునకు దంతపురమని గ్రామము ఏర్పడినట్లు ముఖలింగ శాసనమున గలదు. శ్రీకాకుళము జిల్లాలోని, శ్రీకాకుళము వద్ద నున్న దంతవక్త్రుని కోటయే పూర్వపు దంతపురమని కొందరి అభిప్రాయము."[9] శ్రీకాకుళం జిల్లా టెక్కలి తాలూకాలో "దంత" అను గ్రామమున్నది.

### శాలిహుండాం (శ్రీకాకుళం జిల్లా, తాలూకా)

లభ్యమైన శాసనములను బట్టి శాలి హుండామునకు పూర్వము "శాతి పేటిక" అను నామమున్నట్లు తెలియుచున్నది.[10] శల్యపేటిక అనునది శాలిపాటక మయిన దనియు, బహుశాబుద్ధుని శల్యమొకటి భద్రపరచబడిన పేటికపై నిర్మింపబడిన స్థూపము కలిగినది కాబట్టి ఆ పేరు వచ్చియుండు

నని యు ఒక అభిప్రాయం. 11 "విద్వజ్జన వేదాధ్యయన శ్రోత్రియబ్రాహ్మణుల గ్రామాల, అగ్రహారాల పేరు చివర వల్లు వుండుట సాధారణము. కళింగ అనంతవర్మ చోడ గంగరాజు కొర్ని శాసనంలో గార ( గ్రామం ) వద్ద నున్న సాలిహుండామునే ముణ్ణ వల్లు అన్నారు. అందే బౌద్ధ సన్యాసులతావు. బోధిగుండు సందర్భం. గీర్వాణంలో ముణ్ణ, ముణ్ణి, ముణ్ణిత శబ్దాలకు వచ్చిన తివ్రులు. ముణ్ణ శబ్దం తల అర్ధంతోనూ వాడేరు" 12 అని శాలిహుండానికి పూర్వముండిన వేరొక నామమునకు వివరణ.

## రామతీర్థం ( విజయనగరం జిల్లా, తాలూకా )

రామతీర్ధమునకు ఆ ఘామతీర్ధమను వ్యవహారముండినదని అచట బౌద్ధ జైన మతావశేషములు కలిగి యుండి ప్రస్తుతం బోడికొండ అని వ్యవహరింప బడుచున్నది. బోదికొండకు వికృతి యని గుర్తింప బడినది. 13 అట్లే, నేడు శంకరం ( అనకాపల్లి తా. విశాఖపట్నం జి. ) అని పిలువబడుతున్న గ్రామం బౌద్ధభిక్షువులకు స్థానమైన సంఘారామమునకు వికృతి రూపంగా భావింపబడు తోంది. 14 ఈ విధమున, బొద్దవర (విజయనగరం జి. శృంగవరపుకోట తా.) గ్రామములు ఒకప్పుడు బౌద్ధ విహారము లేమోయని పించును.

## దీపాలదిన్నె (గుంటూరు జిల్లా, తాలూకా)

అమరావతి స్థూపముండిన ప్రదేశమును "ప్రజలు 'దీపాల దిన్నె' దీపాల తిన్నె, దీపాలదివ్వె. దీపాలదిబ్బ, దీపాలకొండ, యను స్థానిక నామములతో పిలుచుచున్నారు.... చైత్యమును దాతుగర్భమని యందురు. దాతుగర్భము నకే "దాగోబా" అని బౌద్ధమత పరిభాషలో అందురు. దాగోబా పదము 'దిబ్బ' యని రూపము పొందినదనియు ఎచ్చట ధరణికోట మహాచైత్యము దీపాలం కారయుతమై ప్రకాశమానమై యుండెనో, ఆ దాగోబాదిబ్బయే, దీపాలదిన్నె" యని పేరు పొందినదనియు అభిప్రాయపడుచున్నారు."15

## దీపాలదిన్నెపాలెం (గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకా)

"వణిదం గ్రామమునకు పశ్చిమభాగమున, అత్తలూరుకు ఉత్తరమునను, 60 అడుగుల వ్యాసము, 8 అడుగుల ఎత్తునుకల దీపాలదిన్నె అను ఒక వృత్తాకారము గల మట్టి దిబ్బ కలదు. దానిపై దీపాల దిన్నెపాలెం అను గ్రామమున్నది." 16

## భోగందాని మిద్దె — నరుకుళ్ళపాడు (గుంటూరు జిల్లా)

"గుంటూరుకు [illegible] కి. మీ. ఉత్తరంగా అమరావతికి 10 కి. మీ. దక్షిణంగా 500 మీ. ఎత్తైన ఎంద్రాయ కొండపై బౌద్ధస్థూపం ఉన్నది. దాని సమతలంపై బౌద్ధ అవశేషాలున్న ప్రదేశాన్ని భోగందాని మిద్దె లేక మేడ అని పిలుస్తున్నారు. సిద్ధాంతభేదాలతో పరస్పరం చర్చలకు దిగి, మాటల్లో ఓడి, కొట్లాటలకు దిగి ఒక ప్రదేశంలో నరుక్కొని చనిపోయారని అది ఎంద్రాయకొండకు ఎంతో దూరంలో లేని నరుకుళ్ళ పాడేనని ఆ ప్రాంతంలోని ప్రజలు తెలుపుతున్నారు17"




## ధరణికోట (గుంటూరు జిల్లా, తాలూకా.)

గౌతమబుద్ధుడే స్వయంగా ధాన్యకటకం దగ్గిర కాలచక్రతంత్రం ప్రవర్తింపజేసినాడని "ధారణుల" నాళరు విశేషం చేసినాడు కాబట్టి దా (ధ)రణికోట అయిందనే గాథలూ, .... విశ్వాసయోగ్యాలుకావు18" అని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

## పిఠాపురం (తూర్పుగోదావరి జిల్లా, పిఠాపురం తాలూకా)

తొలినామం "పిట్టపురం" ఇచ్చట కుక్కుటేశ్వర మహాదేవుని అలయ మున్నది. స్థలమహాత్యం ప్రకారం ఈ అలయానికి కుక్కుటము (కోడి) నకు సంబంధమున్నది. లభ్యమవుతున్న రెండు కుక్కుట జాతక కథలున్నవి. ఈ సామ్యములలో చారిత్రకత పరిశీలనార్హంగా ఉంది19.

## ఘంటసాల (కృష్ణా జిల్లా, దివి తాలూకా)

క్రీస్తుశకం తొలి శతాబ్దంలో కంటకసేల అనే పేరుకలిగి ఉండేది. "గ్రామానికి ఒకటి రెండు మైళ్ళ దూరంలో కొన్ని ఎకరాల ప్రాంతం విస్తరించుకుని ఉన్న బయలు ప్రదేశాన్ని గ్రామస్తులు 'ఘోటక' మనవ్యవహరిస్తూ ఉంటారు. కంటకశైలమునకు 'ఘోటక'మునకు కొంత సంబంధం ఊహించ డానికి వీలున్నది. ఘోటక మనగా గుఱ్ఱము. సిద్దార్ధుని అశ్వము పేరు కంటకము ఈ సామ్యములను బట్టి ఇచ్చట ఉండిన ప్రాచీన బౌద్ధక్షేత్రము సిద్ధార్ధుని అశ్వమైన కంటకము పేర వెలసియుండునని ప్రస్తుతం ఘోటక మని వ్యవహరింపబడుతున్న తావుననే బౌద్ధ విహారముండి యుండ వచ్చునని సుప్రసిద్ధ చరిత్రకారుల అభిప్రాయం20.

"ఈ గ్రామమునకు ఈశాన్య భాగమున లంజదిబ్బలు అని పేరు గల దిబ్బలే ఒక కాలపు బౌద్ధస్తూపములు21. క్షీణదశకు రాక పూర్వమే బౌద్ధ విహారాలకు ఇట్టి దూషణ, అవమాన పూర్వకమైన పేర్లు శాసనాల్లో తటస్థమైన సందర్భాలు కాన వస్తాయి. తూర్పు చాళుక్య దానార్ణవున మాంగల్లు (కృష్ణా జి. నందిగామ తా. తామ్ర శాసనం 10 శ. మధ్యకాలం )లో దాన గ్రామమైన మాంగల్లుకు దక్షిణ, తూర్పు సరిహద్దులుగా లంజవాడ, వివయ కుంట పేర్కొనబడ్డాయి. ఆ పేర్లు బహుశా బౌద్ధ ప్రదేశములను సూచించేవే కావొచ్చునని భావింప బడుతున్నది22.

పై సంగ్రహ పరిశీలన ఆంధ్రదేశ గ్రామస్థల నామములు బౌద్ధ మతం యొక్క ఎదుగుబొడుగులకు ఒక విధమైన సాక్ష్యతార్కాణాలుగా నిలిచిఉండ టాన్ని స్పష్ట పరుస్తున్నది. ఈ విషయమై సూక్ష్మతార్కిక శాస్త్రీయ పరిశోధనా విశ్లేషణా వశ్యకత ఎంతైనా ఉన్నది.

## అధోజ్ఞాపికలు

1. భావరాజు వెంకటకృష్ణారావు, ఎర్లీడైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ (మద్రాసు 1942), పు 612.
2. జి. ఆర్. వర్మ, గుడి—గుంపా, (తాడేపల్లిగూడెం, 1974), పు 57.
3. సాతవాహన సంచిక, పు. 274.

4. ఎమ్. వి. రాజగోపాల్ (సం), ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిక్ట్ గజిటార్స్ నెల్లూరు, (హైదరాబాద్, 1977), పు. 16.

5. ఆర్. ఎల్. టర్నర్, "ఎ కంపారెటివ్ డిక్షనరి ఆఫ్ ది ఇండో - ఆర్యన్ లాంగ్వేజస్, (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్, లండన్, 1966) పు 9276 పోల్చిచూ. కేతు విశ్వనాథరెడ్డి, కడప ఊర్ల పేర్లు (తిరుపతి, 1976), పు 400 ; డి. సి. రెడ్డి, గ్రామనామాలు భాషా సామాజిక పరిశీలన (చిత్తూరు జిల్లా) (తిరుపతి, 1983) పు 106.

6. కె. ఆర్. సుబ్రహ్మణ్యన్, బుద్దిస్ట్ రిమైన్స్ ఇన్ ఆంధ్ర (మద్రాస్, 1932), పు. 12.

7. ఎమ్. వి. రాజగోపాల్ (సం), ఆంధ్రప్రదేశ్ డిస్టిక్ గజిటీర్స్ గుంటూరు, (హైదరాబాద్, 1977), పు. 387.

8. లక్ష్మీనారాయణ హరిచందన్ జగదాబ్, ది వట్టేశ్వర ఇన్స్క్రిప్షన్ జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చి సొసైటి, 6. పు. 51. డా. తూమాటి దొణప్ప, ఆంధ్ర సంస్థానములు సాహిత్య పోషణము (వాల్తేరు, 1969), పు. 579.

9. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము మొదటి సంపుటము. (హైదరాబాద్, 1971), పు. 171.

10. సంగ్రహ ఆంధ్రవిజ్ఞాన కోశము, ఎనిమిదవ సంపుటము (హైదరాబాద్, 1971), పు. 485.

11. జర్నల్ ఆఫ్ ఆంధ్రహిస్టారికల్ రీసెర్చి సొసైటి, 30, పు. 24, బి. యస్. ఎల్. హనుమంతరావు, రెలిజియన్ ఇన్ ఆంధ్ర (గుంటూరు, 1973), పు. 59.

12. గుడి — గుంపా, పు. 103.

13. బుద్దిస్ట్ రిమైన్స్ ఇన్ ఆంధ్ర. పు. 12.

14. రాళ్ళబండి సుబ్బారావు, కళింగదేశ చరిత్ర, పు. 103. బి. యస్. ఎల్. హనుమంతరావు, ఆంధ్రుల చరిత్ర, (గుంటూరు, 1983), పు. 90. "అనకాపల్లి చెంతనేటి 'సంఘరం' అనే గ్రామం "సంఘారామం" మాటకు భ్రష్టరూపమే"..

15. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, నాల్గవ సంపుటము, పు. 679 ; 681.

16. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము, మొదటి సంపుటము, పు. 152.

17. ఆంధ్రపత్రిక (దినపత్రిక, విజయవాడ) 12-12-1984, పు. 5.

18. బి. యస్. యల్. హనుమంతరావు, ఆంధ్రుల చరిత్ర, పు. 38 ; 39

19. ఎర్లి డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్ర, పు. 334, అధస్సూచిక,

20. ఎపిగ్రాఫియా ఆంధ్రికా వాల్యూం 2 (హైదరాబాద్, 1974), పు. 182.

21. తెలుగు సంస్కృతి, మొదటి సంపుటము (పునస్సం శోధితము, హైదరాబాద్, 1983) పు. 37

22 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, వాల్యూం 1 (హైదరాబాద్, 1969), పు 60861 (1986 ఫిబ్రవరి నెలలో ఘోరక్‌పూర్ యూనివర్సిటీలో జరిగిన భారతీయ స్థల నామ సంఘం 8 వ సాంవత్సరిక సమావేశమున సమర్పించబడిన వ్యాసానికి తెలుగు భాషాంతరము)

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

# సెప్టెంబరు 1986

**1.** మేషం:- (అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

అశ్వినివారికి గత నెలనుండి ప్రారంభమైన అనుకూల గ్రహస్థితి, ఈనెలలోకూడ కొనసాగుటయేకాక గతంకంటె మంచి ఫలితమునిచ్చును. ప్రారంభించిన ఉద్యోగప్రయత్నములు లేక శుభకార్య, గృహనిర్మాణాది ప్రయత్నాలు, చిన్నచిన్న ఆటంకములు కలిగినా ఫలించును. ఆర్థికపు చిక్కులు తొలగి, అక్టోబరునాటికి ధనలాభం చేకూరుటకు ఈనెలఅంతా చేసిన ప్రయత్నాలు అనుకూలించును. ఉద్యోగులకు, విద్యార్థులకు అనుకూలంగా ఉండును. భరణివారికి 18వ తే. వరకు ఆశలు, ప్రయత్నాలు, ప్రాకులాటలు, ఉత్సాహంతో జరిగినా 18వ తే. తరువాత కొంత కొంతగా ఫలితం చేకూరుతుంది, అయితే శారీరకంగా మానసికంగా శ్రమ తప్పదు. విద్యార్థులకు, ఉద్యోగులకు బాగానేఉండును. కాని వ్యయం హెచ్చు. కార్మిక, కర్షకులకు ఆశాభంగం తప్పదు. వర్తకులకు మంచి లాభంతో దాన్ని మించిన వ్యయంకూడ జరుగును. కృత్తిక 1పా. వారికి 18వ తే. వరకు కొంత మేలు. ఇంకా శరీరశ్రమ, మనఃఖేదము, ఆర్థికంగా తొట్రుపాటూ, బంధుమిత్రాదులతో విరోధభావము కలుగును. 18వ తే. దాటినదగ్గరనుండి కొంతవరకు చిక్కులుతగ్గి అనుకొన్న పనులు నెరవేరుతాయి. కాని ఫలితం తక్కువగానే ఉండును. ధనం బాగుగా లభించినను అంతకుమించిన వ్యయం జరుగును.

**2.** వృషభం:- (కృత్తిక 2,3,4 పా. రోహిణి. మృగశిర 1,2 పా.)

కృత్తిక 2.3,4 పా. వారికి ఆర్థికంగా తొట్రుపాటూ, మానసికంగా ఖేదమూ తప్పదు. తలకుమించిన పనులు తలపెట్టుటవలన లేనిపోని ఆడంబరములకు దిగుటవలన ధనవ్యయమేజరిగి ఫలితం తగ్గి శ్రమపడవలసివచ్చును. పెట్టుబడికీ, శ్రమకు ఫలితం "ఇదిగో అదిగో" అని ఇంకా అనిపించుచునే ఉండును. అందువలన ఇకనైనా ఇతరుల మాటలు నమ్మి మోసపోకుండా, తగిన జాగ్రత్తలో ఉండుటమేలు. ఆర్థికపు ఒడుదుడుకులు తప్పవు. 18వ తే. నుండి మనోవ్యాకులత్వంకూడ ఉండును. ఈ నక్షత్రం అన్నిరంగాలవారికి ఇట్లే ఉండును. రోహిణివారికి 18వ తే. నుండి మానసికంగా ఆందోళన కొంతవరకు తగ్గును. కాని ఈనెలకూడ అకారణంగా పిరికితనం, మనోవైకల్యం ఎదుటివారి వలన ఏమి మాటలు పడవలసివచ్చునేమో అనిపించును. చాలవరకు మౌనంగా, మితంగా ప్రవర్తించుట మంచిది. బంధువుల రాకపోకలవలన పండుగలూ, పబ్బాలూ, విందులు, వినోదాలు మొదలగువానివలన కొంత ధనవ్యయంజరుగును. ఋణంకూడ చేయవలసివచ్చును. మృగశిర 1,2 పా. వారికి ఈనెల 18వతే.తో చిక్కుల ఉద్ధృతం తగ్గిపోవును. జ్వరం విడిచినతర్వాత తిరిగి బలం పుంజుకొడానికి కొంతకాలం పట్టినట్లే. చెడురోజులు పోయినా. యోగం కలసిరావడానికి ఇంకాకొన్నాళ్ళు పట్టును. బాధలు, వత్తిడిలు, అపవాదులు, ధనవ్యయం, మనోవైకల్యం, శరీరంలో నలత ఇత్యాదులు క్రమక్రమంగా తగ్గుముఖంపట్టును.

**3.** మిధునము:- (మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా)

మృగశిర 3,4 పా. వారికి ఈ నెల 18వ తే. వరకు విపరీతమైన బడలిక, ఒడలినొప్పులు ఉష్ణాధిక్యం శ్రమకలుగును. 18వ తే. తరువాత ఉద్యోగులకు ప్రయోజనంకలుగును. అంతవరకు విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం ఇంకా లభించనివారికి నెలాఖరునాటికి అవకాశం లభించును. వ్యవసాయదారులకు 18 తే. వరకు నీటికి కటకటలనిపించినా తరువాత అనుకూలవర్షంతో బాగుగానుండును. ఆర్ద్రా నక్షత్రంవారికి శ్రమఅనిపించినా ఫలితం అనుకూలంగా ఉండును. 18 తే. దాటినతరువాత కాళ్లకు నలతచేయును. నెల అంతాయోగంగా ఉన్నను 18 తే. ప్రాంతములో ధనలాభంకలిగి, దానిమూలకంగానే కుటుంబంలో కలత నలతలు జరుగడానికి అవకాశంకలుగును. ఉద్యోగ-వృత్తిరంగాలలో ఉన్న వారికి, విద్యార్థులకు మంచి మేలుకలుగును. ఇదివరకెన్నడు ఊహించనివిధంగా అధికారులూ, రాజకీయనాయకులూ మొదలగువారి పరిచయం లేక బంధుత్వం ఏర్పడిన ధలాభం కలుగును. పునర్వసు 1,2,3 పా. వారికి అన్నివిధాల శుభప్రదమైన కాలం. ధనలాభం, కార్యసిద్ధి, సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. ధనలాభంకూడ బాగుగాఉండును. సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు కలుగును. నోములు, వ్రతములు, పుణ్యకార్యములు, ఉత్సవాలు, పండుగలు మొదలగువానిలో పాల్గొనుట జరుగును. బంధుమిత్ర సమాగమం సంతానానికి అన్నివిధముల విద్యాభివృద్ధి కలుగును.

**4.** కర్కాటుకం:- (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4 పా. వారికి అన్నివిధముల బాగుగానే ఉన్నను శరీరశ్రమ హెచ్చు. సంతానమునకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. ధనము ఉద్యోగ, వ్యాపార, వ్యవసాయరంగాలలో బాగుగా కలసివచ్చును. శుభకార్యప్రయత్నములు నెరవేరును. వ్యయంకూడ ఆదాయమునకు మించిఉండును. పుష్యమివారికికూడ శరీరశ్రమ హెచ్చుగాఉన్నను. ధనసిద్ధి, కార్యసిద్ధి, విద్యార్థులకు ఉన్నతవిద్యావకాశం, ఉద్యోగులకు తాత్కాలికంగా ప్రమోషనుకలుగును. అయితే 11-16 తే. మధ్య మాతృవర్గపీడ, జ్యేష్ఠసోదర స్థానమూలకంగా ధనవ్యయంకలుగును. ఉన్నతాధికారుల పరిచయమూలకంగా ఇంతవరకు పరిష్కారంకాని నిరాశచేసు కొన్న పూర్వ వ్యవహారములు అనుకోకుండా కొంత రాజీమార్గంగా పరిష్కారమగును. అయితే శరీరశ్రమ, బడలికకలిగి అనారోగ్యం లేకపోయినా ఏదో స్వల్పమైన నలతచేత బాధపడుచుండుట జరుగును. ఆశ్లేషవారికి ఇంకా వ్యవహారపు చిక్కులు మిగిలిఉండును. చేజేతులా తెచ్చిపెట్టుకొన్నవి కొన్ని ఆత్మీయులు చేసిన ద్రోహంచేత కొన్ని, చిక్కులు పరిష్కారదశలోనే ఉంది. ఎటూతేలక వాయిదాపడుచుండును. ఏపనిచేసినా అధిక ధనవ్యయానికీ, శారీరక, మానసిక శ్రమకీ దారితీయును. వ్యవసాయదార్లకు, వర్తకులకు గతంకంటె కొంచెం మేలుగాఉండును. అయితే భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుంది.

**5.** సింహం:- (మఘ, పుబ్బ, ఉత్తర 1పా.)

మఘానక్షత్రంవారికి ఈనెల శరీరశ్రమతోనే గడచును. భార్య ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. పరిష్కారంకావలసిన వ్యవహారములో ప్రతిష్టంభన తిరిగి ఏర్పడును. శుభకార్య వ్యవహారములలోకూడ ప్రతిష్టంభన ఏర్పడును. మొదటి 10రోజులు సమస్యలతో సతమతమగుట జరుగును. పుబ్బ వారికి ఇంకాకొంత శరీరశ్రమా, త్రిప్పటా జరిగినా శుభమూ, లాభమూ, విద్యార్థులకు విద్యాభివృద్ధి, శ్రమకుతగిన ఫలితం, వృత్తి వ్యాపారాదులలో మంచి ప్రోత్సాహం, సంఘంలో మంచి పేరుప్రతిష్టలు కలుగును. కుటుంబంలో అందరికి

సుఖసంతోషాలు, అన్నివిషయాలలో మంచి అనుకూలత, కార్యసిద్ధి, విజయం కలుగును. ఉత్తర 1పా. వారికి అష్టమరాహువువలన లగ్నదీర్ఘర్చులు, ఆడంబరాలతోకూడిన జీవనము, అధికవ్యయానికి దారితీసినా, కుటుంబంలోమాత్రము అందరికీ సుఖసంతోషాలు, ఆరోగ్యం బాగాఉండును. సంతానమునకు అనుకోకుండా హఠాత్తుగా ఉద్యోగరంగంలోగాని, సాంకేతిక విద్యారంగంలోగానీ అవకాశం కలుగును. అన్నివిషయాలలో అనుకూలంగా ఉండును. వర్తకులకు మంచిలాభం కార్యసిద్ధి అగును. వ్యవసాయదారులకు మేలుకలుగును.

**6.** కన్య:- (ఉత్తర 2,3,4 పా. హస్త, చిత్ర 1,2పా)

ఉత్తర 2,3,4 పా. వారికి బంధువులతో అకారణకలహం; విద్యార్థులకు తాత్కాలిక విద్యా విఘ్నం; శుభకార్యములకు ఆటంకంకలుగును. ఉద్యోగాభివృద్ధి బాగుగా ఉండును. ఇతరులకు మొగమాటంవలన ఇచ్చిన సొమ్ము తిరిగి రాబట్టుకొనుటలో కొన్ని బాధల నెదుర్కొనవలసివచ్చును. హస్తవారికి ఈనెల నుండి ఒడుదుడుకులు పూర్తిగా తగ్గినట్లే. అనుకొన్న పనులుకూడ సక్రమంగా సకాలంలో నెరవేరుతాయి. ఉద్యోగులు, వర్తకులు, వ్యవసాయదారులు మొదలగు అన్నిరంగములవారికి మంచి ఉత్సాహం, ధైర్యం, కార్యసిద్ధి, ధనలాభం, అన్నిరంగాలలో అభివృద్ధికలుగును. శ్రమకుతగిన ఫలితంకలుగును. కొన్ని ఆటంకములు కలిగినను, శుభకార్యప్రయత్నములు కొంచెం దారికివచ్చును. చిత్ర 1,2 పా. వారికి ఈనెల 15వ తే. వరకు శ్రమ హెచ్చుగాఉండును. ఆర్థికంగా తొట్రుపాటుకలుగును. మనస్సునకు ఆందోళనకలుగును. ఈ నక్షత్రము అన్నివృత్తిరంగాలవారికి 18వ తే. దాటినతరువాత కార్యసిద్ధి; ధనలాభం, వ్యవహార విజయం, శుభకార్యాలలో అనుకూలత కలుగును. ధనవ్యయంజరిగినా కొన్ని ఒడుదుడుకులు తటస్థించినా నెలాఖరునాటికి అన్ని శుభపరిణామానికి అనుకూలంగానే వీలును కలిగించును.

**7.** తుల:- (చిత్ర 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా)

చిత్ర 3,4 పా. వారికికూడ 18వ తే. వరకు కొన్ని చిక్కులు, వ్యవహారాలలో ఆటంకాలు, ఉద్యోగంలో ఒడుదుడుకులు, వ్యాపారంలో పెట్టుబడికి తొట్రుపాటూ మొదలయినవి జరుగును. 18వ తే. దాటినతర్వాత అన్నిపనులు వ్యవహారాలు వాటంతటవే అనుకూలంగా పరిష్కారం కాగలవు. శుభకార్యములలో మంచి ప్రోత్సాహం, అధికారులతో మైత్రికలుగును. స్వాతివారికి ఈనెల 15వ తే. వరకు మంచి అనుకూలంగాఉండును. ఆ తర్వాత సోదరవర్గంతో విభేదములువచ్చును. వ్యవహారములలో ప్రతిష్టంభన ఏర్పడును. 18వ తే. తర్వాత అనుకొనని చిక్కులుకలుగును. ఈలోగానే వ్యవసాయదారులకు, ఉద్యోగులకు, విద్యార్థులకు అన్నిప్రయత్నాలు అనుకూలంగాఉండును విశాఖ1,2,3పా. వారికి అన్నిరంగాలలో మంచి అనుకూలస్థితి కలుగును. వివాహాది శుభకార్యములు చేయుట జరుగును. గతమాసంవలెనే ఈమాసంకూడ శుభఫలానుకూలంగా ఉండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు, కార్మికులకు, ఇతర వృత్తులలోఉన్నవారికికూడ కొంతశ్రమ ఉన్నా; మంచి ఉత్సాహం, ధనలాభం ఆయా వృత్తులననుసరించిన కార్యసిద్ధి; శుభఫలము కలుగును.

8. వృశ్చికం:- (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికికూడ గత మాసంలో ప్రారంభమైన శుభఫలితం కొనసాగును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును. గృహస్థులకు ధనలాభం, సువర్ణ వస్త్రాభరణప్రాప్తి, నూతన వస్తుసంపాదనము కలుగును. వర్తకులకు క్రయంలోను, విక్రయంలోను మంచిలాభంకలుగును. రాజకీయాలలో ఉన్నవారికి అధికార అనధికార పదవులు లభించును. అనూరాధవారికి ఇంకా చిక్కులు వదలలేదు. కొన్నాళ్ళు ఇంకా ఇలాగే కొనసాగును. 10-20 తే. మధ్య స్త్రీమూలక ధనవ్యయం, భార్యకు నలతచేయును. అయితే ఈనెల చిక్కుల యొక్క ఉద్ధృతి తగ్గుముఖంపట్టును. గత మాసంవలెనే మానసిక శ్రమ వ్యయం ఆందోళన, స్వల్పంగా అనారోగ్యం, విపరీతమైన ధనవ్యయం కొనసాగును. ఆదాయమునకు మించిన ఖర్చులు పెరుగును. అయితే సంఘంలోమాత్రం గౌరవం బాగుండును.- విద్యార్థులకు విద్యారంగంలో బాగుండును. జ్యేష్ఠవారికి కొంత మేలుగాఉండును, ఆదాయం పెరిగి, స్థిరాస్తి సంపాదనజరుగును. ప్రయత్నాలు చిన్నవైనా దైవబలంవలన పనులు నెరవేరిపోవుచుండును. గృహలాభం కలుగును. మాతృవర్గంవారికి శుభం కలుగును. శరీరశ్రమ హెచ్చుగాఉన్నా తనకు తెలియకుండానే ఆటంకాలు తొలగిపోయి, విజయం లభిస్తుంది.

**9,** ధనుస్సు:- (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా)

మూలనక్షత్రం వారికి మంచి అనుకూలంగానే ఉంటుంది. గురుని వక్రగతివలన ఎంత ప్రయత్నంచేసినా, శుభకార్యప్రయత్నాలు, ఉద్యోగప్రయత్నాలు గృహనిర్మాణప్రయత్నాలు అనిశ్చితంగానే ఉంటాయి. ధనలోపం లేకపోయినా అనుకూలంగా పనులు జరగడం తక్కువ. ఆరోగ్యంకూడ అప్పుడప్పుడు భంగకంగా ఉంటుంది. వ్యవసాయదార్లకు, వర్తక-ఉద్యోగ విద్యారంగాలలో వారికి బాగుగా కలిసివస్తుంది. పూర్వాషాఢవారికి ఈనెల 18వ తే. వరకు శరీర శ్రమ; ఐదలిక; స్వల్ప అనారోగ్యం: ఆందోళనలు హెచ్చుకావడం, శుభకార్య ప్రయత్నాలకు ఆటంకాలుజరుగును. 18వ తే తరువాత వ్యవహారాదులలో ప్రతిష్టంభన తొలగిపోయి క్రమంగా అనుకూలపరిస్థితులేర్పడును. కానిశారీరక మానసిక శ్రమ కొనసాగును. ఉత్తరాషాఢ 1వ పా. వారికి 18వ తే. వరకు సామాన్యంగా గడచిపోవును. 18వ తే. నుండి ఆర్థికంగా చిక్కుల నెదుర్కో-






## మనిషి

ఇక్కడున్న
వింతల్నీ, విడ్డూరాల్నీ
ఒక్కక్షణం ఆగి, చూసి
మరలిపోయే బాటసారి
మరలిరాని తీపిగుర్తు.

**శ్రీ కమల్ పాల్వంచ**

## గ్రంథ సమీక్ష

సూర్యుడి
వెలుతురు కావ్యాన్ని
సర్వబిందువులు
ఆకాశం పత్రికలో
విశ్లేషించి వ్రాసిన
విమర్శనా వ్యాసం
ఇంద్ర చాపం.

**సృజన్**

---

వలసివచ్చును. ఈ ఆర్థికపు తొట్రుపాటు ఉద్యోగులకు, పత్రికలకు, వ్యవసాయదార్లకు కూడ ఉండును. విద్యార్థులకుమాత్రమే మేలుగావుండును. సంతానంవలన దుబారాఖర్చులు పెరుగును.

**10. మకరం:-** (ఉత్తరాషాఢ 2,3,4పా. శ్రవణం, ధనిష్ఠ 1,2పా)

ఉత్తరాషాఢ 2,3,4 పా వారికికూడ 18వ తే నుండి చిన్నచిన్న ఒడుదుడుకులు, చిక్కులు ప్రారంభమగును. శరీరశ్రమ హెచ్చుగావుండును. అయితే ఆర్థికంగా మంచి లాభంకలుగును. ప్రతి పనిలోను విజయం, ధనలాభం కలిగి, సంఘంలో మాటవిలువ బడి, బంధువులలో గౌరవం, ప్రజలలో పేరు ప్రతిష్ఠలు వృద్ధియగును. గతంకంటె అన్నివర్గాలవారికి బాగుగావుండును. శ్రవణం వారికి గత నెలనుండి ప్రారంభమైన శుభఫలితం ఇంకా కొనసాగును. వ్యవహారాలలో విజయం, బంధుమిత్రులతో అనుకూలతకలుగును. పుష్కలంగా ధనలాభంకలిగినా, శుభకార్యాలనిమిత్తం ధనవ్యయం హెచ్చుగావుండును. సంఘంలో మాటగౌరవం, కార్యసిద్ధి, అన్నివిషయాలలో అభివృద్ధి కలుగును. విద్యార్థులకు, పత్రికలకు, ఉద్యోగులకు మొత్తం అన్నిరంగాలవారికి మంచి ప్రోత్సాహంగా ఉండును. ధనిష్ఠ 1,2పా. వారికి ఇంకా చెడురోజులు పూర్తిగా తొలగిపోలేదు. ఒడుదుడుకులు ఇంకా కొనసాగును. 18వ తే. నుండి చిక్కులు క్రమంగా తగ్గి, నెలాఖరువకు సమస్యల విషవలయంనుండి బయటపడటం జరుగును. తీరికే ఊహలను ఆశలని పెంచుకోవడంకంటె ఏదో కొంతప్రయత్నం చేయడం మేలు.

**11. కుంభం:-** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3పా)

ధనిష్ఠ 3,4పా. వారికి 18వ తే. వరకు చిన్నచిన్న ఒడుదుడుకులున్నా, గతంకంటె శుభఫలం బాగుగావుండును. అధికవ్యయం జరుగుతున్నా కొంతవరకు ఆదాయంకూడ పెరుగును. ఉద్యోగులకు, వ్యవసాయదారులకు మంచి అనుకూలమైనకాలం. విద్యార్థులకు శ్రమతో కార్యసిద్ధి. 18వ తే. దాటిన నుండి ఆరోగ్యవృద్ధి యగును. అయితే 17-30 తే మధ్య శారీరకంగా శ్రమహెచ్చును. శతభిషం వారికి 18వ తే. దాటినతర్వాతనుండి కొత్తచిక్కులేర్పడును. అసలు ఈనెల అంతా చిన్నచిన్న ఒడుదుడుకులతోనే ప్రారంభమగును. ప్రతిపనీ పేచీలకు, తగాదాలకు దారితీయును. అయితే కొంత దైవబలం కలసిరావడంతో పెద్దగా శ్రమపడవలసిన పనిఉండదు. వచ్చిన చిక్కులు ఎప్పటికప్పుడు తొలగిపోయినట్లే అనిపించును. కాని కొన్నిచిక్కులు, మరికొన్ని చిక్కులకు దారితీస్తూ ఉంటాయి. అయితే ధనము మాత్రం బాగుగా కలసివచ్చును. పూర్వాభాద్ర 1,2,3పా. వారికి నెల మధ్యలో శరీరం నలతచేయును. ధనలాభం బాగానే ఉండును. సంతానంవలన కొంచెం వ్యథకలుగును. సంఘంలో కొన్ని ప్రతిఘటనలు ఎదుర్కొనవలసివచ్చును. ఉద్యోగులకు అధికారులతో మాటపట్టింపులు వచ్చును. ఈ నక్షత్రంగల ప్రతివారికి తనకుసంబంధించిన పెద్దవారితో అకారణమైన పేచీలు, మనస్పర్థలు ఏర్పడుతాయి. ఇవి నెలాఖరునకు బాగా పెరుగును.

**12. మీనం:-** (పూర్వాభాద్ర 4పా. ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి ఈనెలఅంతా మేలుగానే ఉండును. సుఖశాంతులు కలుగును. అన్నివ్యవహారములు బాగుగా కలసివచ్చును. ఇదివరకు శత్రువులుగా ఉన్నవారుకూడ ఈ నక్షత్రంవారితో స్నేహాన్ని పాటిస్తారు. అధికారుల మన్ననకలుగును. వర్తకులకు మంచి లాభం కలసివచ్చును. ఉత్తరాభాద్రవారికి శరీరశ్రమా, ఒడుదుడుకులు, మనోవైకల్యం, శరీరంలో నలతా, ఇంకా కొన్నాళ్ళపాటు కొనసాగును. భార్యకు ఆరోగ్యభంగం, ధనవ్యయం, జరుగును. అయితే హెచ్చుభాగం ఆడంబరం, దర్జా, హోదా, తాహతుకుమించిన పనులకు దిగుటవలన కొన్ని చిక్కుల నెదుర్కొనవలసివచ్చును. రేవతివారికి కొంచెం శరీరశ్రమ కలుగును. కాని ప్రతివిషయంలోను ఆడంబరంగా దర్జా, హోదాపెరుగును. స్త్రీలగురించి, భార్య అనారోగ్యంగురించి వ్యయంజరుగును. మనస్సుతో అప్పుడప్పుడు పిరికితనం కలుగుచుండును. మాటలుచెప్పినంతగా చేతలు ఉండకపోవుటవలన, సంఘంలో చాలమంది జనులలో వ్యక్తిగతంగా విలువ తగ్గిపోవును. అయినా మాట నేర్పరితనంవల్లనే అన్నిపనులు సాధించుకొనుట జరుగును.

**సిద్ధాంతి: నిష్ఠల వేంకట సత్య సుబ్రహ్మణ్యం**

సీరియల్

# మరో రాజశేఖర చరిత్ర

బలివాడ కాంతారావు

(గత సంచిక తరువాయి)

## 7

రైలులో కాస్త రద్దీగావున్నా తండ్రీ కొడుకులకు కూర్చోటానికి జాగా దొరికింది. మళ్ళీ రైలెక్కుతున్నానన్న సరదా రాజుకు వున్నా ముందురోజులా వుత్సాహంలేదు. తల దువ్వుకోలేదు. ముందు రోజు కట్టుకున్న బట్టలు ఒక్కరోజుకే మాసిపోయినట్లు కనిపిస్తున్నాయ్. రైలు కదులుతుంటే నిద్దరొస్తుంది. మూగబోయినట్లు తండ్రి మాటాడలేదు. ఎటుచూసినా ఏదీ కొత్తగా కనపడలేదు.

మూ.నో స్టేషనులో బండి ఆగగానే పొలోమని యెందరో యెక్కేసారు ఆ పెట్టెలో. రైలు కదుల్తున్నా మనుషులింకా తోసుకుంటూ వస్తున్నారు. కాస్సేపయ్యాక రెండుసీట్లకు మధ్యనున్న మనుషుల్లో ఒక ముసలాయన రాజువేపు చూస్తున్నాడు. అలా చూస్తుంటె కన్నబాబు అతనివేపు చూసాడు. తన తండ్రి వయసు వుంటుంది కానీ యితనిది తెల్లని శరీరం. పండిన గెడ్డం, నెరసిన జుత్తు. ముఖంలో వర్చస్సు వుట్టిపడ్తోంది. కన్నబాబు రాజును సర్దుకోమంటే వాడు లేచే ఆ ముసలాయనను కూర్చోమని తన జాగా చూపించాడు. తన తాతయ్యకు చోటిచ్చినట్లనిపించింది. అతను కూర్చుంటూ యిద్దరిమధ్యలో రాజును యిరికించాడు.

"ఏవూరునాయనా మీది?" అని అడిగాడు ముసలాయన కూర్చున్నాక.

"పద్మనాభపురం బాబూ"

"ఓహో-పద్మనాభపురమా?"

"తమరెప్పుడైనా దయచేసారా?"

"రవెన్యూ యిన్స్పెక్టరుగా ఆ ఫిర్కాకి అజ్మాయిషీకి వచ్చేవాడిని కరణం కుటీలరావు కులాసాగావున్నాడా?"

"ఈమధ్య కొడుకు పెళ్ళికూడా చేసాడు"

"వీడు మీ అబ్బాయా?"

"అవునండి. జేష్ఠుడు"

"అబ్బాయ్-నీ పేరేమిటి?" కుర్రాడ్ని తాకుతూ అడిగాడు.

"రాజశేఖరం"

"రాజశేఖరుడవా? ఏదీ చూద్దాం నీ తెలివితేటలో చెప్పు వీశెడు దూదిబరువా? వీశెడు యినుము బరువా?"

"రెండు వీశె బరువేకదా! ఒక్కటే బరువు"

"శెభాష్.... బాగా చదివి పెద్దవాడివౌతావులే"

కన్నబాబు పెద్ద నిట్టూర్చి

"బాబూ తెలివితేటలైతే వున్నాయిగానీ అంత పెద్దచదువులు చదివించడానికి తాహతువుండాలికదా!"

"అవునుగానీ.... అసలుసంగతి అడగటం మరచిపోయాను. పద్మనాభపురంలో గోపాలంగారు బాగున్నారా?"

"ఆయనే మా తండ్రిగారు"

"నువ్వు గోపాలం కొడుకువా బాబూ?"

"నేను కొడుకును. వీడు మనుమడు"

"మహానుభావుడు"

"మీకు మా నాన్నగారితో పరిచయంవుందా?"

"పరిచయమేకాదు. ముందు మూడుతరాలు గాలిస్తే దూరపు చుట్టరికం మనకు కలుస్తుంది. ఆరోజుల్లో బీదలకు వేలకొ అన్న సంతర్పణ చెయ్యించగలిగే మహానుభావుడు తనే! ఈరోజున ఆవూర్లో కలిమితోవున్నవాళ్ళంతా యాయనవేసిన పునాదితో బయటకు వచ్చినవాళ్ళే. నువ్వు చిన్నవాడివి పెళ్ళం గతిస్తే అంత పవిత్రంగా ఆ చిన్నవయసులో బ్రతికిన మనిషేడీ?"

"ఆ ఆస్తిపాస్తులంతా సరిబాబూ! నాది బడిపంతుల కొలువు, ఎలాగో యీదుకొస్తుంటే యీ కొడుకు ఒక సమస్య తెచ్చిపెట్టాడు."

"ఏమిటో ఆ సమస్య?"

"ఈరోజుల్లో యింగ్లీషుచదువు లేకపోతే బ్రతుకుబాటులేదు కదా! చుట్టుపట్ల పదిమైళ్ళలోపల హైస్కూలులేదు. పట్నంలో బస పెట్టడానికి స్తోమతలేదు. అందుకని మా దూరపు బావమరిది ఇంటికి విద్యాదానం నాబిడ్డకు చెయ్యమని దేహీఅని వెళ్ళాను. ససేమిరా వీలులేదంటే నెత్తిమీద గుడ్డవేసుకుని తిరుగ వెళ్ళిపోతున్నాను."

ఆ ముసలాయన రాజు తల ఒకసారి నిమిరాడు.

"కుర్రాడు రత్నంలాంటివాడు. వీడికి చదువుచెప్పించే పూచీ నాది"

కన్నబాబు కళ్ళలో నీరు పేరుతున్నాయ్.

"ఎంతవరకు చదవగలిగితే అంతవరకు" అన్నాడు ముసలాయన.

"మా కుటుంబం అంతా మీకు ఋణపడి ఉంటుందిబాబూ"

"ఏజన్మలోనో, యేనాడో గోపాలం నాకు ఋణపడివుంటాడు, అది యిలా తీర్చుకుంటున్నాను."

కాస్సేపు యిద్దరూ మాటాడలేదు. కన్నబాబుకు తప్పున గుర్తుకొచ్చి "తమపేరే అడగటం మరచిపోయాను."

''జోగయ్యా. నాకొడుకు రమణయ్య విశాఖపట్నంలో ప్లీడరు- అక్కడికే వెళ్తున్నాను. నావెంట యిద్దరూ వచ్చేయండి.''

కన్నబాబు సంశయిస్తుంటే

''ఐహుళః డబ్బు భోటాబొటిగా వుండివుంటుంది. విశాఖ పట్నానికి టికెట్ నేను మారుస్తాను. తిరిగి పద్మనాభపురం రాడానికి యేర్పాటుచేస్తాను. అప్పుడే స్కూల్లు తెరిచారు. నేను అక్కడ వుండగా రాజశేఖరాన్ని హైస్కూల్లో చేర్పిస్తే మంచిది.''

''తమరు తిరిగి వచ్చేస్తారా?''

''మదనాపురంలో పదెకరాలు పొలంవుంది. రిటరయ్యాక అది నేను చూసుకుంటున్నాను. రమణయ్య ఒక్కడే సంతానం. అప్పుడప్పుడు వెళ్ళి చూస్తూవస్తుంటాను.''

రాత్రిసరికి విశాఖపట్నం చేరుకున్నారు. ఇంటికివెళ్ళగానే కొడుకుతో ''మనవాళ్ళే. పద్మనాభపురం. అన్నియేర్పాట్లుచెయ్యి'' అన్నాడు. అతనిమాటకు యెంత విలువవుందో కన్నబాబుకు ఆ రాత్రే తెలిసింది. కిక్కురుమనకుండా కోడలు యెన్నెన్నో వంటకాలు చేసింది. కొడుకు తండ్రియెదరగా భృత్యుసలా నిల్చుంటున్నాడు. ఒక ప్రత్యేకమైన గదిలో మూడుమంచాలు వాటిపై పరుపులు. ఇల్లు మేడయిల్లు. క్రింద అంగటి రెండుగదుల్లో వకీలు ఆఫీసు. ఆపెరట గదుల్లో వంట భోజనం. రెండు పడగ్గదులున్నాయ్. మేడమీద పెద్దగదిలో యీ మూడు మంచాలు వేసున్నారు. ఈయిల్లుస్వంతంది ఇంకా అప్పటికి యెలక్ట్రిక్ దీపాలు పడలేదు. ఒక సందులోవున్నా వూరి మధ్యలోనే వుంది.

భోజనాలయ్యాక జోగయ్య మేడమీదకువెళ్తే కన్నబాబు రాజు వెంట వెళ్ళారు. రాజుకు నిద్దరొస్తోంది. వేగంగా తిని వేగంగా నిద్దరపోవటం అలవాటుకదా. దీపంపెట్టాక యింగ్లీషుముక్కలు చదువుకున్నప్పుడూ ఆపలింతలుతీసేవాడు. మంచం పరుపూ కన బడగానే మరీ నిద్దరొచ్చింది. పడుకోగానే యెంత హాయిగావుందో? ఇక రోజూ దీనిమీదపడుకుంటే కండలు కాస్త పెరుగుతాయని పిస్తోంది. రమణయ్య అలా నిండుగా కండలతోవున్నాడంటే యిలాంటి పరుపులమీద పడుకోవటంనించే ననుకున్నాడు. ఎవరి మంచంమీద వాళ్ళు కూర్చుంటే ముందు కొడుకువచ్చాడు. వెనువెంట రెండుగ్లాసులతో పాలుపట్టుకుని కోడలు రమాదేవి వచ్చింది. ఆ పాలు అలా టేబిలుమీద పెట్టమని యిద్దరినీ కూర్చోమన్నాడు. జోగయ్య. వాళ్ళు కూర్చున్నాక తన నిర్ణయాన్ని యిలా చెప్పాడు.

''ఒక తులసిమొక్కను నాతోతెచ్చాను. సంరక్షణచెయ్యి. ఫలితం అనుభవిస్తావు''

ఎన్నోమాటలతో చెప్పలేదుగానీ యిద్దరికీ అర్థమైపోయింది. అతనిని ప్రశ్నించేధైర్యం యిద్దరికిలేదు. ఆ మరుచటిరోజు తనూ కన్నబాబు కలసి హైస్కూలుకు యెడ్మిషనుకు తీసుకవెళ్ళారు. రాజును. పరీక్షపెడ్తే రాజు ఫస్టుఫారంకు పాసైయ్యాడు. కానీ పునాది దిట్టంగా వుండడానికి జోగయ్య రాజును ఆ హైస్కూల్లోనే థైడోక్లాసులో చేర్పించాడు. పుస్తకాలు అన్నీ తనేకొన్నాడు ఏడాది జీతం ఒక్కసారే కట్టేసాడు.

రెండురోజులు రోడ్డు పక్కనించి నడిచి స్కూలుకు వెళ్ళి నట్లు, కాస్త యీ వాతావరణానికి కొడుకు అలవాటుకాగానే యింక కన్నబాబు శలవుతీసుకున్నాడు. వెళ్ళేముందు యింటి యిల్లాలితో-

''అమ్మా! మీ పిల్లల్లో ఒకడు, వాడి ప్రవర్తన బాగులేక పోతే ఒక చెంప పెట్టిపెట్టి మరీ సత్ప్రవర్తనకు త్రిప్పే హక్కు- మీకుంది. ఈ విద్యాదానందేసి ఒక పేదకుటుంబాన్ని నిలుపు తున్నారు.''

మాటలతోనే పుట్టి మాటల్లోనే పెరిగిన రమాదేవి మామగా రింకా యింట్లోవున్నారనికామోసు మౌనంగా ఫరవాలేదని చెప్పింది.

జోగయ్య స్టేషనువరకూ వచ్చాడు. రైలుటికెట్ తనే తీసాడు. రైలెక్కుతూ కన్నబాబు జోగయ్యపాదాలను తాకి మొక్కితే చప్పున జోగయ్య కన్నబాబును లేవనెత్తుతూ-

''ఇందులో నేనుచేసిందేమీలేదు. అంతా ఆ పరమేశ్వరుడే చెయ్యిస్తున్నాడు'' అని అన్నారు

రైలు కదిలింది.



జోగయ్యవున్న వారంరోజులూ రాజు అతని ప్రక్కమంచం మీద హాయిగా దూదిపరుపుమీద పడుకున్నాడు. స్కూల్లో చదువు యింట్లో యిదివరకు యెప్పుడూయెరుగని రుచులతో యీ వారం రోజుల్లోనే తను బరువెక్కాననని అనుకున్నాడు. ఇలా యిక్కడుంటే బడిలో తన తోటివాళ్ళతో సరితూగుతాననుకున్నాడు.

జోగయ్య వెళ్ళిపోగానే ఆ మంచాలు ఎత్తేసారు అపరుపులూ లేవు. మేడమీదకు వెళ్ళడానికి వీలులేదు. క్రిందనే లోన వరండాలో చాపమీద తలగడలేకండానే రాజు పడక. ఈ ఒక్కమార్పేకాదు. ఇన్నిరోజులూ కిక్కురుమనకండా వున్న రమాదేవి అదేపనిగా రోజ స్తమానం వాగుతోంది. గాలిని మూటకట్టగలంగానీ ఆమెనోటిని కట్టలేం అనిపిస్తుంది. కొండంత మదపుటేనుగులాంటి రమణయ్య కొండంలేకపోవటంమూలానకామోసు తిన్నప్పుడైనా చప్పుడు చెయ్యడు. మరి కోర్టులో యెలా వాదిస్తాడో యేమో? కంటికిరెప్ప అసరాలా ఆ తండ్రి అసరాలేకిపోతే యింత దర్జాగా బ్రతికే దారిది యేదీ? లా పాయింట్లు అతనికి యెంత తెలుసునోగానీ రమాదేవి 'లా' అంతా కంఠస్థంచేసినట్లు క్లయింట్లతో మాటాడేస్తుంది.

ఇంట్లో యిద్దరు పిల్లలున్నారు. పెద్దది కూతురు జ్యోతి. ఏడేళ్ళది. చంటిపిల్లవాడు రవి. వీడ్ని తనచంకనించి కూతురు చంక నించి దించి రాజుచంకనెక్కించింది. సహజంగా తమ్ముడ్ని, చెల్లెళ్ళను అవసరమైతే యెత్తుకొని ఆడించటం రాజుకు తెలుసు. క్రిందకు దించకండా మొయ్యమనడంతో రాజుకు కష్టమనిపించినా యేమీ అనలేదు. ఈ యెత్తుకోవటం అలవాటుపడ్డ కొడుకు అర్థరాత్రిమీద లేచినా యీ అలవాటు తప్పించుకోలేదు. గదిలో వాడు ఉయ్యాల

మంచంలో యేడిస్తే వాణ్ణి వరండాలోనికి తీసుకవచ్చి గాఢనిద్రలో నున్న రాజును లేపి మరీ చంకనెక్కించేది. నిద్రముఖంతోనే యెలాగో ఓదార్చేవాడు. వాడింకా యేడిస్తే రమాదేవి చిరాకుపడి ఛర్రుమని పిల్లణ్ణి లాక్కునేది ఒకనాడు "తప్పించుకోడానికి పిల్లవాణ్ణి గిల్లుతున్నావా?" అని అడిగింది రాజు నివ్వెరపోయాడు. నోటమాటరాలేదు. ఈ మౌనాన్ని ఆమె నిజంగా తీసుకొని

"ఇలా గిల్లితే సరిగ్గా తిండిపెట్టను జాగ్రర్త" అంటే

"నేను గిల్లలేదు-అత్తయ్యా" అన్నాడు.

"అత్తయ్యా! అత్తయ్యా అని యెవరు పిలమన్నారు?"

"జోగయ్యతాతగారు"

"అయితే అలాగేపిలు" అంటూ అప్పటికి వూరుకున్న కొడుకును తీసుకవెళ్ళి ప్రక్కనవేసుకోలేదు. మళ్ళీ ఉయ్యాల మంచం మీద వేసింది.

రానురాను రమాదేవి ఒక్కొక్కపనీ పప్పచెప్తోంది. ఈ యింట్లో పట్టుమని పదిరోజులు యే కుర్రాడు పనిచెయ్యటంలేదు. బజారుకుపంపిస్తే డబ్బులు మిగిలించుకునేవాడు. వాళ్ళు వీధికుక్కలనుకునేది. రాజు యిప్పుడు యింట్లోనివి పెరుగుతున్నాడు. వీటికి విశ్వాసం యింటిమీదే వుందనుకుంది.

"లైట్లుతుడవటం వచ్చా?"

"ఎప్పుడూ తుడవలేదు"

"రా నేర్పిస్తాను" అంటూ హరికెన్‌లాంతర్లో నూనెపొయ్యటం' అ గ్లాసుడోములుతీసి ముగ్గుపిండితో తోమడం శగ్గిరా నేర్పింది.



పాత్రికేయుడు

బాబు







రెండురోజులు సాయంత్రం తన పర్యవేక్షణలోనే జరిగింది. మూడో రోజు ఒక దోమతీసి ముగ్గుపిండిలో తుడుస్తుండే యెవరో యింటికి పేరంటానికి పిలవడానికివచ్చారు. రాజుకు అసలే సిగ్గు. అందులో ఆడవాళ్ళు చూస్తుండగా యీపని. కాస్త తడబడి చేతిలో దూము క్రింద జారి పగిలింది. ఆ శబ్దంవిని వాళ్ళయెదరగానే విరుచుక పడింది.

రమాదేవి అంత సన్నంగావున్నా ఆ కళ్ళెంత తీవ్రంగా చూస్తాయి. ఆ చెవులెంత నిక్కబొడిచి వింటాయ్. ఆ గొంతుక యెంతగట్టిగా అరుస్తుంది. నాలుగుకళ్ళున్నా రమణయ్యకు యేదీ కనపడనట్లే వుంటాడు. గొంతుకలో వెలక్కాయపడినట్లు మాట్లాడిన నాలుగుమాటలైనా కష్టంమీదవస్తాయి. ఇటుదటు అయిపోతే నిత్యం యింట్లోవున్న రమాదేవితో యే గొడవా వుండేదికాదు. ఇలా చెయ్యమని దేవునికి మనసులో రాజు మొక్కుకుంటే ఆ రాత్రి తిండిదగ్గర తనయెదరగానే

"వీడికి తిండియెక్కువై పోయిందండీ. బలం హెచ్చవడంచేత ఆ బలాన్ని గాజుడోములమీద చూపించి విరుస్తున్నారు."

"చెయ్యి జారివుంటుంది"

"అలా వాడ్ని వెంటవేసుకునివస్తే నెత్తివెక్కుతాడు"

"చిన్నపిల్లడు వాడలగొట్టకండా పనిచెయ్యండూ"

"మీరింత వాదలిపోతున్నారు. ఇంక నాహెదలుతువారొక్కడే మిగిలాడు"

"అబ్బా! ఊరుకుందూ"

"నేను ఊరుకుంటే యీ సంసారం ఒక యించీ కదలదు" రమణయ్య వూరుకొనిలేచి వందయించీలుపైగా కదలిపోయాడు తన గదిలోనికి. అంత బరువైన మనిషి కదలగానే యింత తేలికైన రాజూ కదలిపోతుంటే

"ఎత్తు... ఆ గిన్నెలెవరెత్తుతారనుకున్నావ్"

గిన్నెలన్ని నూతిదగ్గర పెట్టాడు. పనిమనిషి ఉదయంవచ్చి తోముతుంది. సాధారణంగా చాపమీద పడగానే నిద్ర ముంచుకొచ్చేది. ఈవేళ యీచీకటిలో వరండామీద నిద్రపట్టలేదు. పైనున్న జాలీలనించి ఆకాశం కనిపిస్తోంది. అక్కడక్కడా చుక్కలు మెరుస్తున్నాయ్. తాతయ్య చుక్కలగురించి చెప్పడం గుర్తుకొచ్చింది. అది చెప్పేటప్పుడు మనసు ఆకాశం అంతవిశాలంగా వుండి హాయిగా వుండేది. ఇక్కడనించి చుక్కలు చూస్తుంటే అదేంటో కుదించుకపోయినట్లుంది. రాజు ముడిచిన కాళ్ళు చేతులూ కడుపులోదాచుకుని మరింత ముడుచుకపోయాడు. ఏరు, ఎరుకల వాళ్ళు, కొంగలు, సాతానిజియ్యరు, అమ్మానాన్న, చెల్లెలు, తమ్ముడు అంతా మనసులో తిరగడంవలన నిద్దర రాలేదు. ఎందుకో ఆవూరే బాగుందనిపించింది. మళ్ళీ ఆవూరే వెళ్ళిపోవాలని మనస్సు వువ్విళ్ళూరింది. అక్కడ హైస్కూలులేదు. వెళ్తే మళ్ళీ మామ్మూరే. అమ్మచెప్పిన బుద్ధులు జ్ఞాపకానికొచ్చాయి. ఇప్పుడు కష్టపడితే ముందుకు [illegible] నిద్రపోయేసరికి కళ్ళల్లో నీళ్ళు చప్పుడు చెయ్యకుండా చాపమీదకు జారిపోయాయి.

మళ్ళీ ఉదయం మామ్మూలే. స్కూలుకెళ్ళేవరకు యేదో ఒక పని. ఇప్పుడు పనిచెయ్యడం తనకు అలవాటైపోయింది. స్కూలు పరిసరాలు, యింటి పరిసరాలు బాగా పరిచయమైపోయాయ్. ఇవే కాదు స్కూల్లో తన తోటివాళ్ళు కొందరు వాళ్ళయిళ్ళకు తీసుకవెళ్ళారు. మోహన్‌దాస్ తండ్రి తహశీల్దార్. స్కూలుకు జట్కామీద వస్తాడు. వాడి యిల్లు యెంత బాగుందో! వాడికి వేరేగది. గదిలో పుస్తకాలుంచుకోవడానికి అద్దాలతో అలమారు. వేరే మంచం పరుపు. గదిలో బొమ్మలు. వెంకటేశ్వరావుకైతే కారులోనే వస్తాడు. తనకొకసారి కారెక్కించాడు. నేరు కాంతరావుకు సైకిలు మీద వాళ్ళనాన్న స్కూలుకుదిగబెట్టాడు. బాలరాజుకు కారున్నా స్కూలుకుదగ్గిరే వాళ్ళిల్లు. నడిచివస్తాడు.

తనతోకలిపి యీ ఖైదుగదికి యెంతపొత్తు. వాళ్ళ సలుగురూ

బిళ్ళలూ, పళ్ళూ యింకేవేవో తెచ్చి తింటుంటారు. తనకూ యిస్తారు. ఎప్పుడూ పుచ్చుకోవడమే యివ్వడానికి తనకేం లేవు. పుచ్చుకో డానికి సిగ్గువేసి వద్దంటే వాళ్ళే బలవంతం చేసేవాళ్ళు.

ఎప్పుడోగానీ బజారుకుపంపనిది యిప్పుడు యించుమించు రోజూ బజారుకు పంపుతోంది రమాదేవి. ఒకసారి వీశెడు పంచదార తెమ్మని పురమాయించింది. వెళ్ళి పంచదార తెచ్చాడు. ఆమె తూలిచి తక్కువవుంది మళ్ళీ ఆ పొట్లాం తీసుకవెళ్ళి తక్కువయిచ్చింది వెయ్యించుకరా అంది. వాడి తూకపు అది సరిగ్గానేవుంది. ఈవిడ వాడిలా తూయటానికి యింట్లో త్రాసు గుళ్ళూ లేవుకదా. ఈవిడ కొలతలు యీవిడకున్నట్టున్నాయ్. పావుడబ్బాతో కొలిచి నసేమిర తక్కువవుంది తీసుకరా అని తోసింది. రాజు విధిలేక వెళ్ళాడు. వాడు మళ్ళీ తూచి సరిపోయింది పో అనేశాడు. బతిమాలినా పిడికెడు అందులో వెయ్యలేదు. తిరిగివచ్చి జరిగింది చెప్పాడు.

"నీవు తోవలో తిన్నావేమో? వెళ్ళు వాడిపీకమీదకూర్చుంటే వాడేయిస్తాడు."

ఈ హుకుం కాదంటే యింట్లోనించి పొమ్మంటుంది. బయటకు వెళ్ళి కాస్సేపు యిటూ అటూ అయ్యాడు. ఏమీ తోచలేదు. గుండె వడిగా కొట్టుకుంటోంది. ఏ స్నేహితుని యిల్లూ దగ్గర్లోలేదు. కాస్త వాళ్ళను పంచదార అడిగి యిందులో వెయ్యడానికి. కొనడానికి తన దగ్గర దమ్మిడీలేదు. అంతలో అంగటకు జ్యోతి వచ్చింది.

"ఇంద" అంటూ తనను చూడగానే చెయ్యిచూపిస్తోంది. గబగబ వెళ్ళాడు. చేతిలో అణా పెట్టింది. బజారుకువెళ్ళి అణా పంచదారకొని అందులోకలిపేసాడు. హమ్మయ్య గుండె దడ తగ్గింది. పీడనిలా యింటికొచ్చాడు.

"ఇచ్చాడా?" అంది రమాదేవి.

ఇచ్చినట్టు తలూపాడు.

"ఎవడికోసం యివ్వడూ?"

ఇచ్చినపొట్లం అందుకొని వూరుకోలేదు. మళ్ళీ కొలుస్తోంది. అణా పంచదార కలిపితే యెందుకింకా తక్కువని కొలుస్తోందో అని రాజు నివ్వెరపోయి చూస్తున్నాడు. ఈసారి తక్కువంటే యెక్కడి నించి తేను?

"నిజంచెప్పు-చెప్తావాలేదా?" అంది బుగ్గపోటు పొడ్డానికి వచ్చినట్టు.

"ఇచ్చాడు-ఇచ్చాడు" అన్నాడు వెనక్కు తప్పుకుంటూ.

"వాడు బతుకెరగడా? అంత హెచ్చు యెలాయిస్తాడు? చెప్పు దబ్బులెక్కడివి?"

రాజు కళ్ళల్లో నీరుతిరిగిపోయాయి. జ్యోతి పేరుచెప్పటం యిష్టంలేదు. జ్యోతి అంత దూరంనించే యేదో సైగచేస్తోంది.

"నిజంచెప్తావా లేదా?" అని అంత పల్చనిమనిషికి అంత భయంకరంగా గుడ్లెర్రగాచేసి బుగ్గపోటుపొడవగానే

"జ్యోతి అణాయిచ్చింది"

"ఇప్పటినించి తంత్రాలునేర్చుకో, బాగుపడ్తావు! ఆ ముసలాయన తిని వుండలేక మాకీబరువు పీకకి చుట్టాడు." అంటూ కూతురి వేపు వచ్చి చెవిపట్టుకుని

"ఈవేళనించి ఒక్క కానీ అడుగు చెమ్డాయూడదీస్తాను"

"అమ్మా అమ్మానొప్పే-" అని అరుస్తున్నా ఆ చెవి కాస్సేపు విడిచిపెట్టలేదు.

రాజుకు బుగ్గపోట్లుతినడం అలవాటే. కానీ తనమూలాన జ్యోతి చెవి రగిడిపోవడంతో ఆ పిల్లవేపుచూడ్డానికి సిగ్గువేసింది. ఆ రాత్రి భోజనందగ్గర రమణయ్య ఒకటికాదు రెండుప్రశ్నలు వేసాడు భార్యతో.

'జ్యోతి చెవ్వెందుకు నులిపావ్?"

ఇంకా జవాబుకు ఆగకండా "మానాన్ననెందుకు ఆడిపోసావ్?"

ఈ ప్రశ్నలేస్తుంటే రాజుకెక్కడలేని ఆనందంవేసింది.

"నేనలా చేసానని, అన్నానని మీకెవరు చెప్పారు?"

"ఆదంతా యెందుకు? ఇది అబద్ధంకాదుగదా?"

"జడ్జిపదవి వచ్చినట్టు ప్రశ్నిస్తున్నారు? శిక్షవేస్తారా?"అంది.

"అది అసలే అర్భకురాలు. నీ నోటిదురుసుతోనే చిక్కిపోతోంది."

"మీకేం? రేపొద్దున్న అత్తవారింటికి వెళ్తే దీని బుద్ధులు చూసి నన్నాడిపోస్తారుగానీ మీకసరుకదా?"

రమణయ్య అంతటితో ఆగిపోయాడు. పరిస్థితులు విషమించకండా అలా చటుక్కున మధ్యలో ఆపేయడం అతనికి అలవాటు. ఇటునించికాక అటునించి యీ పరిస్థితిని అదుపులోకేవడానికి కూతురికి ద్రాక్షపళ్ళు తెచ్చియిచ్చాడు. అందులోనివి కొన్ని దాచి మాటాడకండా రాజును మాటాడనివ్వకండా చాటుగా వాడిచేతిలో పెట్టింది.

ఈ ద్రాక్షపళ్ళరుచితో రాజు బుగ్గపోటువలన కలిగిన నొప్పిని మరిచిపోయాడు.

ఈ స్కూలు రాజుకు బాగానచ్చింది. వాళ్ళవూరుబడిలోలా క్లాసుకు ఒక్క మేష్టరుకాదు. అక్కడ మేస్టరు నాన్న ఒక్కడు కావడంవలన యేదైనా అడగడానికి భయంవేసేది. ఇక్కడ ఆ భయం లేదు. వేరువేరు పుస్తకాలు. వేరువేరు మాష్టర్లు. అందరి మాష్టర్లకీ కోపంలేదు. ఒక పీరియడ్ కోపంమాష్టరువస్తే తరువాత అన్ని పీరియడ్లలోనూ కోపంలేని మాష్టర్లు. తెలియకపోతే అడిగితే మళ్ళీ చెప్తున్నారు. ఒకసారి కోపద్ద మాష్టారు యింకోరోజు నవ్వుతున్నాడు.

ఈ స్కూలు పెద్దది. ఆడుకోడానికి యెంత పెద్ద జాగా వుంది. ఇక్కడ బంతి ఆట ఆడుకోవచ్చు. డ్రిల్లుకూడా చెయ్యిస్తున్నారు ఎందరో పిల్లలు. ఇందరు పిల్లలున్నా అందరితో అట్టే కలిసిపోలేదు. కలసి ఒక జట్టుగావున్నవాళ్ళు తనక్లాసులో తనతో యైదుగురు. మరి కనకారావున్నాడంటే అంత యెత్తుగా లావుగా




వున్నాడు. ఎన్నిసార్లు ఫెయిలయి యీక్లాసుకొచ్చాడో! అదరిమీద దాబు చలాయిస్తాడు తమకన్నా బాగా పరుగెత్తుతాడు, ఆడతాడు గానీ తమలా చదవలేడే. బెంచీ రోజూ యేదో ఒకక్లాసులో యెక్కుతాడు. "నివ్వు పోలీసులోనికిపోరా" అని తెలుగుమేష్టారుగారే అంటుంటారు. అంతంయిద్ది ఉద్యోగం సంపాదించడానికి వాడినాన్నకేం వుందని! వేరా పరక సరుకుషాపుంది. అదీ రోడ్డువారే పెట్టుకుంటాడు.

ఇక యీ విశాఖపట్నం పేరుకు పట్నమేగానీ రోడ్డుదీపా లైనా సరిగ్గా వెలగవు. ఇక్కడ కార్లెందరికున్నాయని! ఇంపీరియల్ బ్యాంకు యేజెంటుకుంది. ఓడరేవు పెద్దకుంది. శెక్షుపెట్టగలిగే కార్లే వున్నాయ్. అందుకు వూర్లో ఒకే పెట్రోలు బంకుంది. బర్మాషెల్ వాళ్ళది. మెయిన్‌రోడ్డు మధ్యనించి నడిచినా పూచీలేదు. పక్కనించి పెద్దయిండ్లు మనుమలతోపాటు నడుస్తాయిగానీ జట్కాల్లా పరుగెత్తవు. ఆ జట్కాగుర్రాలు బోగీమల్‌షావుకారి బగ్గీగుర్రాలదగ్గిర గాడిదపిల్లల్లా కనిపిస్తాయ్. మనుషులనుచూసి మనుషులు లాగిన రిక్షాలు తప్పుకుంటాయి. సైకిలు బెల్ వాగినా ప్రక్కకు జరగాలన్న నియమంలేదు. చిన్న వర్షానికి కాలువనిండిపోయి కుళ్ళంతా రోడ్డును కప్పేస్తుంది. అందులో కింగుజార్జి ఆసుపత్రి యిసక్కొండ వర్షాలికి యిసుకను కాలవల్లోనికి పంపుచేస్తుంటుంది.

రాజు ఊర్లో పిల్లోయిాదేవాడు. ఇక్కడ మిత్రులతో పుప్పుచేరులో యీదుతున్నాడు అక్కడ చెట్లెక్కి కోతిపిన్నలక్క్ర ఆట ఆడినట్లే యిక్కడ స్కూలు ఆటస్థలం చివర్లో యిసుకపర్రమీద పచ్చని చెట్లమీద ఆ ఆటే ఆడుతుంటున్నారు. తనవూర్లోలేని కొండ వుంది. బోటుమీద హార్బరు కాలవదాటి ఆ కొండెక్కితే ఓహోహో సముద్రం-హోరుమనే సముద్రం-రాజు ఇదివరకుచూసిన అన్నిటికీ మించిన గొప్పదృశ్యం ఈ సముద్రం!

వర్షపు ఝల్లులతో రధాయాత్రవచ్చింది. రమణయ్య డబ్బులిస్తే కొనుక్కుని తినకండా చెల్లెలికోసమని మంచిబొమ్మలు కొన్నాడు. రంగులతోవున్న కృష్ణునిబొమ్మ. రెండు గోడకు పెట్టుకునే చిలుకలు. అవిచూసి రమాదేవి తిండిదగ్గర అంది

"వాడికి డబ్బిచ్చావు, ఏం చేసాడో చూడండి. చెల్లెలు కోసమని బొమ్మలు కొన్నాడు. ఇంతవాడు లేడుగానీ యెంత ఆపేక్ష!"

ఎదరగా రాజుకూడా తింటున్నాడు.

"అభిమానం వుండటం మంచిదే..." అన్నాడాయన.

"స్వంతంగా గడించుకున్నాడు...ఈ అభిమానాలుండవులెండి"

"అందరూ అన్నయ్యలాంటి వాళ్ళవుతారని యెందుకనుకుంటావ్?"

రమణయ్య ఒకోసారి కరెక్ట్ లా పాయింట్ మెల్లగా తెచ్చి రమాదేవి నోట మాటరాకండా చేస్తుంటాడు. రాజు బొమ్మలుకొన్న రధాయాత్రలో చూసినవన్నీ నచ్చలేదు. ఎంతోమంది గుడికి యిటూ అటూ అడుక్కున్నవాళ్ళున్నారో. విరిగిన కాళ్ళుచేతులతోనూ, గుడ్డివాళ్ళు, గూనివాళ్ళు. వాళ్ళవూర్లో వూరకే అడుక్కోవడానికి వచ్చేవారుకాదు. సాధారణంగా అడుక్కోడానికివచ్చినవాళ్ళు యేదో ఆట. పాట. మాట అనగలిగేవాళ్ళే. పనిచేసే చేతులున్నా పనిలేక అడుక్కునేవాళ్ళలా వుండేవారు. ఇక్కడ వీళ్ళను చూడ్డానికే బాధగావుంది. కుష్ఠురోగులవేపు చూస్తుంటే రోతకలిగేది.

ఇలా యింట్లో అన్ని సేవలు చేస్తూ, స్కూల్లో టీచర్లు చెప్పేటప్పుడు శ్రద్ధగా వింటూ, దీపాలు ముట్టించాక చదువుకుంటూ యిలా ఆఫ్‌యియర్లీ పరీక్షల్లో క్లాసుకు ఫస్టువచ్చాడు. కనకారావు క్రాఫ్ కొట్టినా లాస్టేవచ్చాడు. ఈ ఫస్టురావడంకాదుగానీ రాజు విలువ పెరిగింది. క్లాసులో టీచర్లు యెవరూచెప్పలేని ప్రశ్నలు రాజుకే వేస్తున్నారు. రాజు చెప్పగానే మిగతావాళ్ళకు రాజుదగ్గర నేర్చుకోండి-అంటున్నారు. వెంకటేశ్వరరావు కారులో తనింటికి తీసుకవెళ్ళాడు. ఎంత పెద్దయిల్లో. ముందుకు పూలతోట: వెనుకకు తోట. చుట్టూ తోటే. బుద్ధవరపువారి తోట అట అది. అంత డబ్బున్నా వాళ్ళమ్మకు గర్వమేలేదు. వాళ్ళింట్లో యెన్ని దీపాలూ, సోఫాలూ, తివాసీ లున్నాయ్. రేడియోకూడా వుంది. అయినా వాళ్ళమ్మ రమాదేవి, అత్తయ్యలా కాకండా యెంత నెమ్మదిగా మాటాడుతోందో. ఇద్దర్నీ డైనింగుటేబిలుముందు కుర్చీలమీద కూర్చోబెట్టి వెండికంచాల్లో యెన్నెన్ని తినడానికి పెట్టింది. ముందు తీపితీపి జిలేబీలు తరువాత యింకేండేంటో ఆ పేర్లేవీ రాజుకు తెలియవు. అలా తింటుంటే

"రాజశేఖరం! నివ్వు క్లాసుకు ఫస్టువచ్చావటగా" ఆమె అలా అడుగుతుంటే యెంత గర్వం వచ్చిందో.

"వచ్చాడమ్మా-" అని వెంకటేశ్వర్రావు అంటే

"మాబాబుకు తెలియనివి స్కూల్లో చెప్తూవుండు"

"అలాగేనండి"

మీవూర్లో యెవరెవరున్నారు?"

"మా అమ్మా నాన్నా, తాతయ్యా, సావిత్రి, భాగ్యలక్ష్మి, చినబాబు"

"వాళ్ళు మీ చెల్లెళ్ళూ, తమ్ముడా?"

"అవును. మావూర్లో ఏరుంది. మాతాతయ్య బాగాపాడతాడు. మక్కువగురించి చెప్తాడు. మా తాతయ్య నాన్నా నాటకాల్లో వేషాలేస్తారు"

"కళాకారుల కుటుంబంనించి వచ్చావా! అందుకే అంత తెలివైనవాడవయ్యావు"

రమాదేవి అత్తయ్య అనకపోయినా వెంకటేశ్వర్రావు అమ్మ తెలివైనవాడివి అని అన్నది. తాతయ్యను నాన్నను పొగిడిందామె' ఎంతో గొప్పవాడివైపోయినట్లు ఆరాత్రి రాజుకు యెంతసేపటి వరకో నిద్రపట్టలేదు.

స్కూల్లో క్లాసుపిల్లలందరినీ సింహాచలం వినోదయాత్రకు తీసుకవెళ్ళారు. తను చిన్నప్పుడు యిక్కడికేవచ్చినట్లు అమ్మ చెప్పింది. ఏదీ జ్ఞాపకంలేదు. ఆ మెట్లెక్కుతుంటే యిటూ అటూ అందం పచ్చనిచెట్లు, నీటిధారలుకన్నా అశేషంగానున్న అడుక్కున్న వాళ్ళవేపే తనదృష్టి. కాళ్ళకు కట్లు, తలకుకూడా కట్టుకున్నారు. ఎక్కడా దెబ్బలే. రోగాలే. పీటూ తిరాసుకున్న సాధువు అంతా బాధ. వీళ్ళతోపోలిస్తే తన వూర్లోవాళ్ళు అడుక్కున్నవాళ్ళలా అనిపించలేదు.

ఒకనాడు మోహన్‌దాసు రాజును టౌనుహాలుదగ్గర బీచిలో ఒక మీటింగుకు తీసుకవెళ్ళాడు. కాంగ్రెసుజండా ఎగురుతున్నాయ్. ఎందరో ప్రజ యిసుకలోకూర్చున్నారు. ఆ ఉపన్యాసకుడు

"మనకు యీ బానిసత్వం పోతేగాని పేదరికంపోదు. బ్రిటిష్‌వాళ్ళు మూటాముల్లె కట్టుకునిపోతేగానీ మనకు యీ బాధలు పోవు. స్వరాజ్యం మన జన్మహక్కు"

ఇది విన్నాక రాజులో యీ పేదరికం దొరలనించి వచ్చిందని బుర్రలో నాటుకుంది. ఈ దొరలు వెళ్ళిపోగానే యీ పేదవాళ్ళంతా డబ్బున్నవాళ్ళయిపోతారు అనుకున్నాడు. అందుకే నలుగురూ అరుస్తుంటే తనూ "వందేమాతరం మనదే రాజ్యం" అని అరిచాడు,

ఇంటి అరుగుమీద కొత్తగా ఒక దర్జీ మిషన్ పెట్టుకున్నాడు. నెలకు రెండురూపాయలు అద్దె. రాత్రుళ్ళు కుట్టుమిషను ఆఫీసుగదిలో పెట్టుకునేవాడు. ఈ దర్జీ రాములుదగ్గర కాజాలూ అవి కుట్టడానికి ఒక కుర్రవాడు వుండేవాడు. వాడిపేరు అప్పారావు. ఈ అప్పారావు కప్పలదొంగ అని కొందరు వేళాకోళంచేసేవారు. వాడి వయసువాళ్ళు. అలా అంటే వాడు వాళ్ళపై పులిలా వురగ్గావే పరుగెత్తేవాడు. ఈ అప్పారావు రాజుకన్నా ఒకయేడాది పెద్ద వుంటాడు. చదువులేదుగానీ దర్జావుంది. వాడికి రాజు పల్లెటూరి నించి వచ్చాడని తను పట్నంమనిషని కోతలుకోసేవాడు. వాడు చెప్పేవన్నీ నమ్మదగ్గవిగావుండేవి. వాడికి సినిమాలంటే యిష్టం. సైలంటు ఫిల్ములు టాకీలొచ్చినా అప్పుడప్పుడూ ఆడుతుండేవి. ఆ ఫిల్ములో కథ యాక్షనుచేస్తూ చెప్తూవుండేవాడు. రాజు పిల్లల్ని ఆడిస్తూ వాడు చెప్తుంటే వినేవాడు. అప్పారావంటే అసలైన సిసలైన మోజు యెప్పుడొచ్చిందంటే వాడి పులివేషం చూసాక. తురకల పీర్లపండగకు పులివేషంవేసి ఆడుకుంటూ వచ్చారు. పిల్లపులైనా పెద్దపులులకు దీటున్నట్లు ఆడాడు. పులిబుర్ర, పంజాలూ బాగా ఆడించాడు. రాజునుచూడగానే మరీవిజృంభించి ఆడాడు.

అలాంటి అప్పారావు పులివేషంవేసిన మూడోరోజు మళ్ళీ కాజాలుకుట్టుకోడానికి వచ్చాడు. మామ్ములుగావచ్చినా కొత్తగా వున్నాడు. ఎడమచేతికి రిష్టువాచీవుంది. ఆ వాచీకి ముళ్ళున్నాయ్. తిప్పితే తిరుగుతున్నాయ్.

"ప్రైజువచ్చిందా? కొన్నావా?" అన్నాడు.

"బాగుందా?"

"ఓ మా బేష్‌గావుంది."

"ఇది బేడాపరక సరుకు"

ఏమైనా యిది తను పొరుగువూర్లో యాత్రలోచూసిన సరుకు కన్నా మంచిది. ఆ వాచీ ముళ్ళుతిరగవు. ఈ ముళ్ళు తిరుగుతున్నాయ్, కొనడానికి తనదగ్గర డబ్బుల్లేవు.

"కావాలా?" అన్నాడు అప్పారావు.

కావాల-కావాల అనబోయి

"నాకెలా వస్తాది?"

"నేను కొనలేదు. ఏముంది? నేనుచేసినట్లు చెయ్. నీచేతిలో వాచీలేకపోతే సింహాదిరప్పన్నమీద ఒట్టు."

అవి సంక్రాంతి ముందురోజులు టైలరు నైటువర్కు చేసేవాడు. మరి అప్పారావులేకపోతే కాజాలెవడుకుట్టాడు. భోజనాలైపోయాయ్. పిల్లలు పడుకున్నారు. ఎత్తుకునే అవసరంలేదు. అంగట అరుగుమీదకు వచ్చాడు. టైలరు రాములు భోజనానికి వెళ్ళాడు. అప్పారావు ఒక్కడే వున్నాడు. చేతిలో వాచీ సరిగ్గా టైంచూపిస్తోంది. అప్పుడే వాచీ ముల్లుతిప్పాడుకదా! కాస్త ఫాస్టుపెట్టినట్లుంది. ఆఫీసు గదిలో గోడగడియారం తొమ్మిదికొట్టోంది.







"అప్పారావ్-వాచీ...."

"రా చెప్తానని..." సందుమొదట్లోకి తీసుకవెళ్ళి మెయిన్ రోడ్డుమీద కాలవ ప్రక్కన ఒక షాపు చూపించాడు. హరికెన్ లాంతరు వెలుగులోవుందాషాపు.

"వెళ్ళు. ఇలాంటి వాచీలున్నాయ్. ఎంతని అడుగు. బేరు పరక అనిచెప్తాడు. చూడ్డానికి ఒకటి తియ్యకు. రెండు తియ్యి. ఇద్దరు ముగ్గురు కొనేవాళ్ళున్నప్పుడు బేడిస్తానని బేరమాడు. ఇష్టపడంటాడు వద్దని ఒకటి అక్కడపారేసి.... మెల్లగా నడిచివచ్చి... "

"పట్టుకోరా...."

"అబ్బే- మనం యిక్కడినించి చూస్తుంటాం. నేను పులిని- అడిపికమీద పంజాతోయెయ్యనూ" అటూ ముందుకుతోసాడు.

అప్పారావు యెలాచెప్పాడో రాజు అలాగేచేసాడు. షాపువాడి కొడుకు కనకారావు వెనక చీకట్లో కూర్చున్నట్లు పోల్చుకోలేదు. తిరిగివస్తుంటే వెంట "వాచీకాట్" అన్న అరుపు వినగానే రాజు పరుగెత్తాడు. సందుగొందుల్లుచేసి చప్పున యింట్లో దూరిపోయాడు. వాడివెంటనే కనకారావు ప్లైలరుదగ్గర నిల్చున్నాడు. అప్పటికి ప్లైలరు రాములుకూడా వచ్చాడు.

"ఏంటబ్బాయ్. ఇక్కడెవరూ దొంగలు లేరు"

"మా నాయన షాపులో వాచీ దొంగతనంచేసి రాజశేఖరం తెచ్చాడు"

"నీకేం మతిపోయిందా? ఆ బాబు దొంగతనంచేసేకర్మేంటి?"

"చేసాడూ-చేసాడు- ఆ వాచీ యివ్వకపోతే అంటూ ఆగక గబగబ తలుపుబాదుతూ

"వాచీకాట్ వాచీకాట్...." అనగానే యిటూ అటూ అంతా లేచిపోయారు. రమాదేవీ రమణయ్య యిద్దరూ గబగబ బయటికి వచ్చేసారు.

"రాజశేఖరం మా నాన్నషాపులో వాచీకొట్టేసాడు"

"ఏంషాపు? ఏం వాచీ? నీకేం మతిపోయిందా? అని రమాదేవి వీధంతా వినబడేటట్లు ధీమాగా అంటే

"బేడాపరక వాచీ...."

"హమ్మయ్య! బేడపరక వాచీయేగా! బంగారంవాచీలా అరుస్తున్నావ్" అని రమయణయ్య అంటే

"ఉండండి.... నేను అడుగుతాను" అంటూ రమాదేవి లోపలికివెళ్ళి ఒకమూల నక్కిపోయివున్న రాజుతో

"నిజమేనా?"

మాటాడకండా తలెత్తకండా వాచీ అందిచ్చేసాడు.

రమాదేవి గబగబ బయటకువెళ్ళి "ఇంద తీసుకపో" అంటూ కనకారావుకు అందిచ్చేసింది.

అప్పారావు యేమీయెరగనట్లు మాటాడకండా కాజాలు కుట్టుకుంటున్నాడు. తిరిగివెళ్ళిన రమాదేవి

"ఈ వేషంవుందని నాకు తెలీదుబాబో! నా నగలు యిక్కడికక్కడ వదిలేస్తుంటాను. ఈ అగ్గిని నేను యింట్లోపెట్టుకుంటే యెప్పుడు రాజుకుంటుందో.... రాసేయండి రేపే ఉత్తరం. వాళ్ళ నాన్నను వచ్చి తీసుకపొమ్మని"

రమణయ్య యేం మాటాడకపోతే "ఉన్నది ముద్దు. తిన్నది ముద్దుగాని వీడిని యింట్లోపెట్టుకుంటే యిక యెదుగుతున్నాడు- దొంగకు తాళమిచ్చినట్లే లెక్క"

కళ్ళునిండిన నీరు, కడుపునిండిన దుఃఖం ఒళ్ళంతా అల్లుకున్న అవమానం రాజును కిక్కురుమనకండా శవంలా చాపమీద కూలదోసాయ్. అప్పారావు అసలైన సిసలైన పులిలానే తనమీదపడి రక్తంపీల్చినట్లు కనకారావు తెలుగుమేస్టారు సరదాకి పోలీసుచేసినా వాడు నిజంగా పోలీసైనట్లు ఎన్నెన్నో అనుకుని చివరకు వెక్కివెక్కి యేడ్చుకున్నాడు.

[ఇంకా ఉంది]

## శ్రీ ఆర్.ఎస్. సుదర్శనం

# సోమరాజు కవితాప్రస్థానం

ఇటీవల షష్టిపూర్తి చేసుకున్న శ్రీ రంధి సోమరాజు నలభై ఏళ్లక్రితం "యాంగ్రీ యంగ్‌మాన్" గా కవితా ప్రస్థానం ప్రారంభించాడు. 1946 లో "ప్రజామిత్ర" పత్రికలో గుమాస్తా అవస్థ" అనే సోమరాజు కవిత అందర్నీ ఆకర్షించింది. 1946-56 దశాబ్దం ఎన్జీవో దశాబ్దం. శ్రీశ్రీ కొనేటిరావు, రా.వి. శాస్త్రి, అల్పజీవి సుబ్బయ్య, ఆత్రేయ "ఎన్జీవో" సాహిత్యంలో గుమాస్తాకు పట్టంగట్టిన దశాబ్దం అది. "కూడు లేకపోయినా బ్రతుకు వాడు గుమాస్తా, కోటులేకపోతే మాత్రం చెప్పలేం అతడి అవస్థ... అన్నిటికి తల వొగ్గి దాకిరిచేసే అదది పతివ్రత, ఏమన్నా పడిఊరుకొనే గుమాస్తా ప్రభువ్రత". ఇది ఆనాటి ఎన్జీవో మూర్తి. బ్రిటిషు వారి హయాంలో రూపొందినమూర్తి. నలభైఏళ్ల తర్వాత చూస్తే, ఎన్జీవో ఏకు మేకై నేటి ప్రభుత్వ యంత్రాంగంలో కీలకపాత్ర నిర్వహిస్తూ, ఎలా "కాలరెత్తుకు" తిరుగుతున్నాడో, మంత్రులకూ, అధికారులకూ అంతుచిక్కకుండా సమస్య అయికూచున్నాడో, చిత్రమని పిస్తుంది: తర్వాత ఇరవై ఏళ్లకు, అంటే 1966 లో సోమరాజు "విరిగిన కల్చర్" కవితా సంపుటి ప్రచురించాడు. ఇందులో "గుమస్తా అవస్థ" ఒకటి తప్ప తక్కినవన్నీ 1960 దశాబ్దిలో వ్రాయబడినవే. "సరిహద్దు గోడలదగ్గర చైనా పందికొక్కు కమ్యూనిజానికి వెలుగు లేకుండా చేసింది" (జనవరి 1963) "సామ్యవాదం డప్పు కంఠాన మోగిస్తూ స్లోగన్ల రాపాడించే రాక్షసత్వం పళ్ల రాలగొడతాను" (మార్చి 1964) ఇజాలమీద నమ్మకం అలా హరించి పోయినా, మానవ సౌజన్యంమీద నమ్మకం పెంచుకుంటూ వచ్చాడు సోమరాజు. నెహ్రూ నిర్యాణం సందర్భంలో - నెహ్రూ నుద్దేశించి - "ఆకసం మీది నీవు అంటించిన సౌజన్యం వాల్ పోష్టరు ఇంకా చిరుగలేదు" అన్నాడు (మే 65). "పెద్దరికాల బండరాళ్లను తొలగించుకొని సలహాల విషవలయాల ఛేదించుకొని, పాలిటిక్స్ మృగాల దుర్భర బాధల తప్పించుకొని, నిర్మలోదకంలా, నిండు కిరణంలా బ్రతుకుదాం" (జనవరి 66) అన్నాడు. కాని మన జాతి సంస్కృతిలో మూల స్తంభమైన కుటుంబవ్యవస్థ యొక్క శైథిల్యం దాని నగ్నస్వరూపం చిత్రించిన సోమరాజు "విరిగిన కల్చరల్" కవితలో వ్రాసిన చివరి పంక్తులు. "ఎండిపోయిన చెరువులోని చేపల కన్నీటి తెరలు, నింగి కెగసి క్షణమైన నిలువలేని కెరటాల జాలి బ్రతుకులు, ఇహ ఏమి చెప్పను: ఏమి చూపను!" అంటూ నిస్పృహను, నిరాశను వ్యక్తంచేశాయి. సౌజన్యంతో నిర్మలంగా బ్రతకటం అంటే సంస్కృతి ఆధారంగా సౌష్ఠవంగా రూపొందిన వ్యవస్థలోనే అది సాధ్యం కాని, 'విరిగిన కల్చర్' అయోమయంలో ఎలా సాధ్యం? 1970 దాకా ఈ ప్రశ్న ఆయన్ని వేధించింది.

1940 ప్రాంతాల నుంచీ నవకవులందరికీ శ్రీశ్రీ గురుతుల్యుడు. 1970 లో శ్రీ శ్రీ షష్టిపూర్తికి సోమరాజు వ్రాసిన కవిత పెద్ద సంచలనమే కలిగించింది. పాలిటిక్స్‌లోని 'ట్రిక్స్' ను అసహ్యించుకునే సోమరాజుకు శ్రీశ్రీ వేసిన పల్టీలు నచ్చలేదు: "అభ్యుదయం" కాదని "విప్లవం" మతం పుచ్చు కున్నాడు శ్రీశ్రీ. "నీకో రోడ్డునేదు కాని, మాకో రోడ్డు సూపించదాని కొచ్చావ్ దర్మపెబువ్వి.... నీ రోడ్డు రెండు సెక్కలై కాల్లకుక్కలయ్యింది ... నీకంతా కుక్కల్లాఅనతారు, ముందు నీదికాని రోడ్డు సరిసేసుకోని మా పేటకు రా.... అనక సెప్తూకాని పెద్దపెద్ద కబుర్లు" అన్నాడు సోమరాజు. "పెద్ద పెద్ద కబుర్లు" అనే యీ కవితో (2-2-1970), "ఎదగండి" అనే కవితా దళితవర్గాన్నీ, శ్రామికవర్గాన్నీ ఉద్దేశించి వ్రాయబడటమే కాదు, వారి దృష్టి నుంచీ, వారి "యాస" లోనే వ్రాయబడ్డాయి: మన జాతి ఎదుగుతోందో లేదో కాని ఈ కొత్త కావ్యంతో కవిగా మీరు నిస్సందేహంగా కొన్ని అంగుళాలు ఎదిగారు" అన్నారు నార్ల వెంకటేశ్వరరావు. ఈ కావ్యంలో సోమరాజు తన సొంత గొంతుకతో పలికి, కవిగా మొదటిసారి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సాధించుకొన్నాడు. ఇందులో చిత్రించిన "దరిద్రుడు" నిండైన మనిషి: వాడికి వెటకారమూ వెక్కిరింపూ చేతనవును. చదువుకున్నవాడి మోసాలు బాగా అర్థం చేసుకోగలడు. వాడికి ధర్మం న్యాయం అంటే ఏమిటో తెలుసు. గొప్ప కబుర్లకి మోసపోడు. అన్నింటినీ మించి వాడికి దయాదాక్షిణ్యమూ ఉన్నాయి. వాడు కడుపుకు చెడ్డా మానవత్వానికి చెడలేదు. సోమరాజు తను మెచ్చిన మానవత్వపు విలువలకు, ఇజాలతో రాజకీయాలతో సంబంధ లేదని గ్రహించి ఈ కవిత్వంలో మూర్తి మత్వం కలిగించగలిగాడు పదునైన శ్రామికవర్గం భాషలో.

"ఎదగండి" సంపుటిలోనే 1968 దాకా వ్రాసిన కవితలు, శిష్టవ్యవహారికంలో వ్రాసినవి, సామాజిక వ్యవస్థను విమర్శించేవీ, నిరాశనూ నిస్పృహనూ వ్యక్తం చేసేవీ తొమ్మిది రచనలున్నాయి. వాని 1970 లో "పెద్దపెద్ద కబుర్లు" రచనతో సోమరాజు కవితా ప్రస్థానంలో ఒక పెద్దమలుపు తిరిగాడు. శ్రామికవర్గంతో తాదాత్మ్యాన్ని మనసా, వాచా సాధించాడు. ఆయన కవిత్వం పరిణతికివచ్చి అది ప్రత్యేకమైన గళంగా అభివ్యక్తి పొందింది. శ్రీశ్రీని ఎద్దేవచేస్తూ, ఆయన ప్రభావంనుంచీ విడివడటమే కాకుండా, తనదైన ధోరణి ఏర్పడ్డాక సోమరాజు సమాజంలో స్త్రీ ఉనికినికూడా ప్రత్యేకంగా గుర్తించాడు తన కవితల్లో. శ్రీశ్రీ కవిత్వంలో స్త్రీకి ప్రత్యేకస్థానం ఎక్కడా కనిపించదు: సోమరాజు "దిసమొల సోగ్గత్తె" (14-4-70) - కెబారె డాన్సర్ - శ్రామికవర్గ చైతన్యం దృష్టిలో రూపుకట్టిన ధనికవాద సంస్కృతి తాలూకు మొదటి విపరీతదృశ్యం. కవి సృజనాత్మకంగా, శ్రామికవర్గ చైతన్యంతో తాదాత్మ్యం సాధించినప్పుడు వెలువడే అభివ్యక్తి, సామాజిక విమర్శ ఎలా ఉంటుందో ఈ రచన మనకు తెలియజేస్తుంది. [శ్రామికవర్గ ప్రతినిధిని అని చెప్పుకునే కవి నిజంగా సాధించవలసిన ఫలితం యిదేనని గ్రహించిన శ్రీశ్రీ వెంటనే "జట్కావాలా" అనే కవిత 1970 లో సోమరాజు తర్వాత వ్రాశాడు. జట్కావాలా భాషలో, జట్కావాలాలో పరకాయ ప్రవేశం చేసినంత ప్రయత్నంతో. "మరో ప్రస్థానం" సంపుటిలో "నిన్నటి జట్కావాలా", (12-9-70) గా చేర్చబడిన ఈ రచన ఒక్కగా ఒక్కటే శ్రామిక భాషలో వ్రాయబడిన శ్రీశ్రీ రచన కావడం గమనార్హం. శ్రీశ్రీ తనని విమర్శించిన సోమరాజుని అనుకరించి, పరోక్షంగా అభినందించాడనే చెప్పాలి:]

"దిసమొల సోగ్గత్తె" తర్వాతవచ్చిన రెండు కథా కావ్యాలు : "బూర్జువా పెళ్లికూతురు" (ఏప్రిల్ 1972); "సిన్నమ్మ వొచ్చింది" (జనవరి 1973) మొదటిదాన్లో బూర్జువా పెళ్లికూతురైన "అయిమాతమ్మ" నాయిక; హరిజన యువకుడు "పెహదం" నాయకుడు. మధ్యతరగతివాళ్ల మనస్తత్వాల్నీ, వామపక్ష రాజకీయాల్లో నాయకత్వం వహించే బూర్జువాల తీరునూ చక్కగా విశ్లేషించి చూపిన ఈ కథాకావ్యం సోమరాజు సామాజిక, రాజకీయ పరిశీలనకు, అవగాహనకూ అద్దం పడుతుంది. అయిమాతమ్మ పాత్ర చిత్రణంలో సోమరాజు కవిగాపొందిన పరిణతి కనిపిస్తుంది. "పుస్తకం సేతిలో ఎట్టుకొని కిటికీలోంచి అయిమాతమ్మ ఈదేపు అదే పనిగ సూత్త ది.... సూత్తదంటే ఏటి

సూత్తది ? కుంటోల్ని సూత్తదా ? గుడ్డోల్ని సూత్తదా ?.... సీసీ.... అలాంటి బాడుకాపని సెయ్యనే సెయ్యదు.... వొచ్చిపోయే సద్యుకున్న కుర్రోలేపు కల్లా గ్గీసి సూత్తది.... సూసిసూసి ఆలకి దిట్టిపిడతకి బొట్టెట్టినట్టు పేర్లెదద్ది.... అందమైన కుర్రోల్ని సూత్తే అయిమాతమ్మ కదేటో ▮శేయం మింగినట్టు ఆసేయం ఎగటు....". "పాపం కొందరు కొంటెకుర్రోలు, ఈవుదత మొగానికి వొల్లున్నా బాగున్నే హే.... అంటారు. ఆలా నవ్వుల్నిసూసి ఆల్ని కాలరాసెయ్యాలనుకుంటాద.... ఏ కొండల్లోకో పారిపోవాలనుకుంది. ఆడ ఓ కోయోడ్ని పెల్లి సేసీసుకుంటే, బొలెడంత సంగసేవ సేద్దుననుకుంటాది, ఏటిసెయ్యనేక పోతున్నానని సీకాకుపడిపోద్ది...." అలా కలల్లా తేలిపోయి, తన నిస్సహాయ స్తితికి తనకే జాలివేసి, ఏం చేస్తుందీ ? "సల్లంగ తాపాల గదిలోకెల్లి మొగం రుద్దుకొని సిర మార్చేత్తాది.... బొట్టు సోగ్గాపెట్టుకుంటది...." కాపరానికి గుంట తయారుగావుందనిసెప్పడం బొట్టంటూ అని ఎవడో రాసింది గుర్తువచ్చి, "బుల్లికి కల్లు ఎరుపెక్కిపోనాయి, అద్దం ఎర్రగ అయిపోనాది, బొట్టు సెరిపేసుకోని సిర సింపేసుకొని ఈదిలోకెల్లాలనుకుంది.... వొల్లుంటే అంతపనీ సేసేది.... సప్పున అద్దం నవ్వింది, బొట్టూనవ్వింది, సిరకూడనవ్వింది.... ఆటిమీద యిర్సుకపడ్డట్టు ఇసిరబోయింది అద్దం.... తల్లొచ్చి 'పిచ్చెక్కిందేటే' అని అద్దాన్ని సేతిలోంచి పూడనాక్కుంది. అంతే...." ఇది గొప్పచిత్రణ. మనస్తత్వపు లోతులు తరచి చేసిన రచన. అయిమాతమ్మ అన్నగారు నారాయణబాబు, వామపక్ష రాజకీయవాదీ, సంస్కర్త. మేడిపండులాంటి అతని రాజకీయాన్ని విశ్లేషించిన తీరు సోమరాజు సాధించిన మరో విజయం ఈ కావ్యంలో.

'సిన్నమ్మ వొచ్చింది' కావ్యంలో నాయిక అమరావతి. ఆమె మూర్తి కట్టిన 'ఉజ్జ్వల భావలంంగాల నిజాయితీ ! ధనికవర్గానికి చెందినా 'డీ-క్లాస్' కావడానికి ప్రయత్నించి, 'అట్టడుగు మానవుల నాక్కుటిగా చేయడమే కావలసింది' అనే దీక్షతో కార్యసాధనకు పూనుకుంటుంది. "కులాల కడిగి సంద్రాన పోసింది, కలవపూలల్లె అందర్ని దిద్దింది." చివరకు తన ప్రాణాల్ని బలి పెట్టింది. విప్లవమంటే హింసా విద్వేషాలు కావు. క్షమ, ప్రేమ అంటే మానసికమైన స్తబ్దత, చేతగాని తనంకావు. నిజమైన సామాజిక చైతన్యం ప్రేమ ప్రాతిపదికగా సృజనకూ సమాజ నిర్మాణానికి పూనుకొంటుంది. ఈ సందేశాన్ని నవలవంటి 'సిన్నమ్మ వొచ్చింది' కావ్యంద్వారా ప్రతిభావంతంగా చెప్పాడు సోమరాజు. కథాకథనంలో దిట్ట అని నిరూపించుకొన్నాడు. సందేశం వాచ్యం కావడం వల్లనైతేనేమి, కావ్యం ప్రబోధాత్మకంగా, కాల్పనికావేశంతో రూపొందడంవల్లనైతేనేమి, 'బూర్జువా పెళ్లికూతురు' కావ్యంలో ఉన్న పదను 'సిన్నమ్మ వొచ్చింది' రచనలో కనిపించదు ; అయితే పై రెండు కదా కావ్యాలద్వారా సామాజిక విప్లవాన్నిగూర్చి, మానవత్వపు విలువల్నిగూర్చి సోమరాజు కవిగా తన విస్పష్టవైఖరికి చక్కని అభివ్యక్తి చేకూర్చగలిగాడు.

1972 జూన్‌లో ప్రచురింపబడిన 'పొద్దు', మూడు ఋతువుల వర్ణన; సోమరాజు కవితా శక్తికి, ఆయన మౌలికతకు గీటురాయి. "మళ్లీ ఋతువుల పైనే రాసి సోమరాజుగారు సొంత గొంతు వినిపించారు. సొంతశక్తి చూపించారు. చెప్పే తీరులో, వాడే భాషచేసే వర్ణనలో, కట్టేమాట బొమ్మలో సరికొత్తదనం నిరూపించారు" (దాశరథి). "అన్నీ అన్ని సజీవ చిత్రాలు. జీవిత సముద్రాంతరంలోంచి చిలికితీసినవీ, అనుభవామృత స్పర్శచేత శాశ్వతమైనవీను. ఎన్ని వేసంగుల్లోనూ, ఎన్ని వానాకాలాల్లోనూ ఎన్ని శీతకట్టులోనూ, యివి మాయవు. కరిగిపోవు. ముడుచుకుపోవు. ఈయన ప్రతిభ మంత్రగత్తె". (మల్లంపల్లి శరభేశ్వరశర్మ) "పొద్దులో కవితలు మాటల-మణిదీపాలు. మనస్తాత్విక రూపాలు. వాస్తవిక నవజీవన బింబాలు!" (సంజీవదేవ్) "సిన్నోడుకాడి సోమరాజు. పెద్దకైతాల్లోడు (కవిత్వాలవాడు) అందరికీ ఎరుకున్నదే మాముద్దుగ జెప్పతడు. ఒకపారి యెన్నపూస తీర్గ ఇట్లనే యిడదీసి సూపుతడు. ఇంకోసారి యెండికొండంత యెదిగి అందకుండ పోతడు. ఏదిజెప్పినా ఎంతగొప్ప గుంటదని.... ఈయన కండ్లల్ల లచ్చ యెలుగులున్నాయి.... సోమరాజా నికింక సావులేదుపో" (సి. నారాయణరెడ్డి). ప్రసిద్ధులైన సమకాలికులు యిలా మెచ్చిన 'పొద్దు' కావ్యం తెలుగు సరస్వతికి శాశ్వతాలంకారము ; 'పొద్దు' కావ్యంలో వ్యక్తమయ్యే స్నిగ్ధ హృదయం, దాని తాలూకు అమృతత్వం సాధనతో లభించవు. దాన్ని ప్రతిభ అనడానికి వీల్లేదు. సృష్టిలో, జీవితంలో సర్వత్ర ఆనందానుభూతి పొందగల దర్శనాశక్తి అది ఒక వరం బాల్యంలో స్వర్గం చేరువగా ఉంటుంది, తర్వాత అది దూరమౌతుంది అని చెప్పిన వర్డ్సువర్తు కవీంద్రునికి ఆ రహస్యం తెలుసు. "వానలో నానినాని, బాతులు రెక్కలార్చుకుంటూ 'వానవొగ్గేసి మేంరాం 'అన్నట్టు తోక లద్దంగ ఆడిత్తాయి' అని చెప్పగలిగిన సోమరాజు, బాల్యంలాటి అద్భుత దర్శనాశక్తినీ, మౌగ్ధ్యాన్నీ 'పొద్దు' కావ్యంలో వ్యక్తంచేసి అందరినీ మురిపించినాడు.

"అబ్బ ! రుసితీర్గ (ఋషివలె) జెప్పిండు. ముక్కూ సెవులూ మూసుకొని కాదు. రుసి (రుచి) పుట్టేట్టు జెప్పిండు" అన్నారు సి. నారాయణరెడ్డి 'పొద్దు' కవితల్ని మెచ్చుకుంటూ "సోమరాజ రాజర్షి" అన్నారు పాలగుమ్మి పద్మరాజు 'రోజీ' కావ్యానికి 'ప్రిఫేస్' వ్రాస్తూ. స్రా సృషిః కురుతే కావ్యం. సృష్టిలో జీవితంలో సర్వత్ర ఆనందానుభూతి పొందగల దర్శనాశక్తిగల వాడే ఋషి. అతడు సమదర్శి. 'రోజ్' కావ్యాన్ని చదివిన పద్మరాజు తన అనుభూతినిలా వర్ణించాడు: "అర్ధరాత్రివేళ ... నిరంతరంగా వానహోరు జాగృతిని జోకొడుతున్నప్పుడు ... పడుకుని చదివాను. మరునాడు కుర్చీలో కూర్చొని మళ్లీ చదువుతుంటే, అవతల ఎండకాస్తున్నా, చీకటి వానల అద్వైతానుభూతి నన్ను ఆవరించింది. వానలాగ, చీకటివానలా నింగినీనేలనూ ఏకానుభవం చేయగల లక్షణం ఏదోవుంది ఈ 'రోజీ' లో 1946 లో 'అంగ్రియంగ్






# ప్రసాదించవా !

నీమేని సింగారాల్లో ఉదయించే
వర్ణజాలాన్ని పొలజూచి
అరుణ కాంతులు వన్నెలు దిద్దుకుంటున్నాయి!

నీ నడకల పొంకంలో పొర్లించె
కులుకుల్ని పరిశోధించి
తెలివాకల తరగలు ఒయ్యారాల్ని నేర్చుకుంటున్నాయి!

నీ వలుకుల సొంపుల్లో తొనకు చుండే
మాధురీ మహిమ నాలకించి
షడృతువులలోని వక్షు తీపుల్ని
కూడబెట్టు కుంటున్నాయి!

నీ ఉన్నత హృదయంలో పేరుకొనే
సుకుమారాన్ని ఆలక్షించి
మంచుకొండ తన యాకృతినే
సరిదిద్దు కొంటున్నది!

మనోహరీ!
ఈ ప్రకృతి సర్వం
నీ అంద చందాలలోని
ఉచ్ఛిష్టాన్నే గ్రహించి
శోభనాన్ని
నైర్మల్యాన్ని సేకరించు కుంటున్నది

నన్ను అలాగే
నీ అనురాగ గంగలోని
తుంపర్లనే గ్రహించి
సుందరేశ్వరుని గానూ
ఉచిర్యాతుని గానూ
ప్రసిద్ధి కెక్క నీయవా?
ఈ సూక్ష్మానుకూలాన్ని
నాకు ప్రసాదించవా !!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

మాన్' కవితగా ప్రారంభమైన ముళ్ళమొక్క ఎదిగి 1976 నాటికి 'రోజీ' అనే గులాబీని ప్రసవించింది. "ముళ్లపువ్వు లైనట్టుగావుంది" అన్నారు సి. నారాయణరెడ్డి.

'రోజీ' కావ్యంగా రసగుళిక. తాత్త్వికంగా పరిపుష్టమైన రచన. "వ్యక్తిగా బుల్లెమ్మ (రోజీ) పంకంలో పుట్టింది. వికసించిన కొద్దీ రంగులు తొడిగింది. వానలతో లోకాన్ని ముంచెత్తింది. అప్పుడుకూడా పంకిలం ఆమెను వదిలిపెట్టలేదు. సినీ జీవితపు మెరుగుతెరల వెనుక మేకప్‌మాన్ కుళ్లిన లవ్ సొగసుల ఎంగిలి, అసిస్టెంట్‌ల కక్కుర్తి చేష్టల అబ చూపులు, తప్పదన్నప్పుడు ప్రొడ్యూసర్‌గారికి తీర్చిన అప్పు - అన్నీ ఆమె జీవితంలో అల్లుకుపోయిన కశ్మలాలు. అయితే కవికి గాని, రోజీకిగాని వాటిమీద జుగుప్సలేదు. అది జీవితం. దాన్ని ఏవగించుకోవడం అవివేకం. ఈ జీవిత యంత్రంలోపడి నలిగిపోతున్నప్పుడు కూడా రోజీ బాధపడలేదు. మరో బాధ-మానవ జీవితాన్నంతనీ ఆవరించిన ప్రాథమికమైన, మౌలికమైన బాధ ఆమెను కార్చిచ్చులా దహించింది. ఆ మథనలోనుంచి పరిశుద్ధమైన స్వచ్ఛమైన శక్తిగా సర్వాంతర్యామి అయిపోయింది రోజీ—ఇదీ రోజీ కథ." (పద్మరాజు)

సోమరాజు జీవితాన్ని రోజీద్వారా దర్శించాడు. సినీతార సౌందర్యాన్ని వెర్రివ్యామోహంలో ఆరాధించే యువతరం యొక్క అభిమానమే ఆ తార మనుగడకి ఆధారం. ఆ వ్యామోహానికి రోజీ చేసిన వ్యాఖ్యానం "నా ఆకలి కన్నులలోని అనంతమైన లాలస, జివ్వుమనిపించీసి గుండె లోతుల గుంజీసిన తీవ్రత, గర్భాన్ని మోస్తూ తన బిడ్డదైన చిరునవ్వుకోసం, ఆరటపడిపోయే మదర్లీ ఎఫెక్షన్‌లా, నను మోస్తూ కదలిన యువతరం, ఏమి చూసింది నాలో, నా ప్రాణం కడతేరకుండ, సను కాపాడుకున్న ఆ లక్షణం, కామం కాదు, వెలుగును వెలుగు చుంబించడం, వెలుగు వెలుగుగా అనంతమై పోవడం.... ఎక్కడ అగ్ని వున్నదో, అక్కడ నేను, నిను జ్వాలాశిఖర చలత్ చలిత లీలాకీల స్నిగ్ధకిరణ్మయిని...." సోమరాజు దృష్టి యజ్ఞకీల. ఇత్తడిని బంగారం చేసే పరుసవేది. "ఈ పెదవి యీ పెదవి హత్తుకు పోయినసోట, యేమున్నదో వోరు సెప్పలేరు. యీ తనువు యీ తనువు వొక్కటయ్యే సోట, యేమున్నదో వోరూ సెప్పలేరు, అందుకే అందుకె యిది, అనురాగం ఆకసం వొక్కటైన గెలాక్సీ పరిష్వంగాల సెక్సీవలయమోరి యిది...." అంటుంది 'సెక్స్'నుగురించి రోజీ. చలంగారు 'పురూరవ' నాటకంలోనూ, కృష్ణశాస్త్రిగారు 'ఊర్వశి' కావ్యంలోనూ పొందిన దర్శనం యిదే! శరీరం - ఆత్మ, అపవిత్రం-పవిత్రం అనే ద్వంద్వాల సధిగమించిన రసాద్వైతాన్ని సోమరాజు 'రోజీ' పాత్రలో మూర్తి కట్టించాడు. ప్రపంచంలోని ఆర్తిని తన ఆర్తిగా స్వీకరించి కవిని తన శారసుణ్ణి చేస్తుంది రోజీ. అద్వైతసిద్ధికి గీటురాయి 'ఆత్మవత్ సర్వభూతాని' అనే అనుభవం. కరుణ, అనుకంప. శృంగారం - కరుణ రసాల తాత్త్విక సమ్మిశ్రం 'రోజీ' కావ్యం. "ప్లవరంత వెయిటుతో ప్రారంభమైన కావ్యం ప్రాణదీపంగా పర్యవసించింది. ఓహ్!" (సి. నారాయణరెడ్డి)

జీవితంతో సత్యాన్వేషణాసాహిత్య వ్యవసాయం ఒక్కటిగా మేళవించిన కవే నిజమైన కవి. అరవై వసంతాల సోమరాజు కవికి అభినందనలు. ☀

# స్వాగతం

ఆకుండి నారాయణమూర్తి

నాన్ స్టాప్ బస్‌లో ప్రయాణం చేస్తున్న గుర్నాధం మాష్టారి దృష్టి, డ్రైవర్ మీద పడింది. ముందుకు తప్పితే మరెటూ చూడలేదా డ్రైవర్ !

డ్రైవర్సు ముందుచూపు గలవాళ్ళయితే పరవాలేదు !

కాని,

వాళ్ళు మంద చూపుగల వాళ్ళయితే ?....

"అమ్మబాబోయ్ !.... గొప్ప డేంజర్ !" అని అనుకున్నారు గుర్నాధం మష్టారు! గుర్నాధం మాష్టారు దూరదృష్టి గలవారు ! కనుకనే సుమారు ఒక మీటరు ముందున్న న్యూస్ పేపరుపై అతని దృష్టి పడింది. ఆ న్యూస్ పేపర్ని చదువుతున్న వ్యక్తి తన వెనుక సీట్లో కూర్చున్న వాళ్ళు చదువు కొనేటందుకు వీలుగా ఉంటుందనే సత్సంకల్పంతో అట్లా న్యూస్ పేపర్ని పట్టుకోలేదు !.... అట్లా పట్టుకొని చదవకపోతే అక్షరాలతనికి సరిగ్గా కనిపించవు. అతని దృష్టి అట్లాంటిది !

ఆ న్యూస్ పేపరులోని ఓ వార్త గుర్నాధం మాష్టారి దృక్పథంలో పడింది !....

"ఘోరమైన బస్సు ప్రమాదం. అక్కడికక్కడే పాతికమంది మృతి. ముప్పైమందికి పైగా గాయాలు. కొందరి పరిస్థితి ప్రమాదకరంగావుంది !...." ఇదీ ఆ వార్త యొక్క సారాంశం.

తామప్పుడు ప్రయాణం చేస్తున్న బస్సుకూడా అట్లానే ఘోరమైన ప్రమాదానికి లోనైతే ?.... గుర్నాధం మాష్టారు ఆలోచించ సాగేరు

వార్తా పత్రికలన్నీ ఆ వార్తను ప్రముఖంగా ప్రచురిస్తాయి !

ఆకాశవాణి ఆ విషాద వార్తను ప్రసారం చేస్తుంది.

ప్రముఖులు ప్రమాద స్థలాన్ని సందర్శిస్తారు. ప్రమాద కారణాన్ని అన్వేషించేటందుకై దర్యాప్తు కమిటీని నియమిస్తారు.

చనిపోయిన వాళ్ళ కుటుంబీకులకు, తీవ్రంగా గాయపడ్డ వాళ్ళకు, స్వల్పంగా గాయపడ్డవాళ్ళకు తమ ప్రగాఢ సానుభూతిని తెలియజేసి-ప్రభుత్వ నిబంధనల మేరకు ఎవరికి ఎంత సొమ్ము ముట్ట చెప్పాలో అంతముట్టచెప్పి, బాధ్యతా విముక్తులవుతారు ప్రభుత్వాధికారులు !

తనప్పుడు ప్రయాణం చేస్తున్న బస్సు తీవ్రాతి తీవ్రమైన ప్రమాదానికి లోనై, తను అక్కడికక్కడే మరణిస్తే-తన కుటుంబీకులు పొందే ప్రయోజనాల గురించి ఆలోచించసాగేరు గుర్నాధం మాష్టారు !....

చావుకి స్వాగతం పల్కడం సామాన్యమైన విషయంకాదు ! బ్రతుకుపై రోత జనించిన వాళ్ళు, బ్రతకడానికి భయపడే వాళ్ళు, ఆత్మ విశ్వాసాన్ని పోగొట్టుకున్న పిరికి పందలు, ఎట్టా బ్రతకడమో తెలియనివాళ్ళు - సాధారణంగా చావుకి స్వాగతం పల్కుతూంటారని గుర్నాధం మాష్టారికి తెల్సు !....

తను ఉద్యోగంలో వుంటూండగానే చస్తే - తన పెద్ద కొడుక్కి ఏలినవారు ఉద్యోగమిచ్చి తీరతారు!.... అయితే తనచావు, సహజసిద్ధమయినట్టిదిగా ప్రూవ్ కావాలి. ఆత్మహత్య కాకూడదు !

ఏదైనా ప్రమాదంలో చస్తే మరీ మంచిది ?... ఏలినవారు రూల్సు ప్రకారం ఎక్స్‌గ్రేషియో మంజూరు చేస్తారు ! అంతేకాదు !....



అధికారుల సానుభూతి,
ప్రజా ప్రతినిధుల సానుభూతి,
మంత్రుల సానుభూతి,
ముఖ్యమంత్రి సానుభూతి,
గవర్నరు సానుభూతి,
ప్రమాదం మరీ దారుణమైనదైతే,
ప్రధానమంత్రి సానుభూతి,
రాష్ట్రపతి సానుభూతి—

ఓహ్!.... బోల్డు మంది ప్రముఖుల సానుభూతి లభిస్తుంది మరణించిన వారి కుటుంబీకులకు!

శవాల ఫొటోలు, ఆ శవాల ప్రక్క రోదిస్తున్న వారి ఫొటోలు, వారి నోదారుస్తున్న ప్రజా ప్రతినిధుల ఫొటోలు - చాలా న్యూస్ పేపర్లలో చాలా ప్రముఖంగా ప్రచురించబడతాయి!.... ఘోరమైన ప్రమాదాలలో చచ్చేవారి చావుకు గొప్ప ప్రాముఖ్యం లభిస్తుంది.

తానప్పుడు ప్రయాణం చేస్తున్న బస్సు, తీవ్రమైన ప్రమాదానికి లోనై- తాను చావుబాధ అనుభవించకుండా టపీమనిచస్తే; తనవాళ్ళు సుఖపడతారు!.... తన పెద్ద కొడుక్కి వెంటనే ఉద్యోగ మొస్తుంది! తన భార్యకు పెన్షన్ లభిస్తుంది. ఇన్స్యూరెన్సు పాలసీయొక్క ప్రయోజనం సిద్ధిస్తుంది!.... అయితే ఆ వచ్చే చావేదో, అది కాస్తా సుఖవంతమయిన దవాలనేదే తన కసీన కోరిక!

ఆ మధ్య మరో రెండు మాసాలకు రిటైరవుతారనగా, సుందరావు మాష్టారు అంతిమశ్వాస వదిలేశారు!.... అప్పుడు అతని పెద్ద కూతుర్ని తమవూరి హైస్కూలులో రికార్డు అసిస్టెంటుగా అపాయింట్ చేశారు; సమితి అధ్యక్షులవారి కరుణా కటాక్షవీక్షణాలు ఆమెపై అపారంగా వర్షించడంవల్ల!!

అయితే సుందరావు మాష్టారు సుఖంగా చావలేదు!.... తను చావడానికి ముందు, యింట్లో వాళ్ళందర్నీ సుమారు ఏడాదిపాటు చంపుకుతిన్నారు!.... అతని కొచ్చిన జబ్బేమిటో తేలేసరికి సుమారు ఆరుమాసాలు పట్టింది. కేన్సర్ వ్యాధట!.... ఆ వ్యాధికి చికిత్స చేయించగలిగేపాటి ఆర్థిక స్తోమత అతని ఆత్మీయులెవ్వరికీ లేదు! అయినా వూరుకోలేదు. అప్పుచేసి విశాఖపట్నం, ఆ తరువాత రాయవెల్లూరు తీసుకెళ్ళి చికిత్స చేయించేరు!

ఇల్లు గుల్లయింది. అతని ఒళ్ళు గుల్లయింది. అప్పటికిగాని అతనికి చావు రాలేదు!

రిటైరవకముందతను చనిపోతే; అతని కుటుంబీకులు సుఖపడతారని అతని కొలీగ్సేకాక- అతని ఆత్మీయులు కూడా అనుకొనేవారు!.... అతని చావు పొడిగింపబడుతున్న కొద్దీ, 'ఇతను రిటైరవకుండా చావడేమోనని' చాలా మంది భయపడ్డారు!....

అతని ఆత్మీయుల అదృష్టం బాగుండడంవల్ల, ఎట్లా అయితేనేం ఇంకో రెండు మాసాలకు రిటైరవుతారనగా సుందరావు మాష్టారు చనిపోయేరు!....

ఏది ఏమైనా తనకు మాత్రం సుందరావు మాష్టారి కొచ్చిన చావు లాంటిది మాత్రం రాకూడదనుకున్నారు గుర్నాధం మాష్టారు!.... అయితే ఒకటి!.... ఉద్యోగ విరమణ తేదీకి ముందుగానే తనకు సునాయాస మరణం వస్తే - ముప్పై ఏళ్ళు నిండిన తన పెద్దకొడుక్కి, ఏదో ఓ ఉద్యోగాన్ని ఏలిన వారిస్తారు! తన భార్యకు పెన్షన్ యిస్తారు. గ్ర్యాట్యుయిటీ, ఇన్స్యూరెన్సు పాలసీలవల్ల వచ్చే సొమ్ముతో కనీసం తన పెద్దకూతురికైనా తన భార్య పెళ్ళి చేసేస్తుంది!.... తను మరో ఆరు మాసాలలో రిటైరయిపోతాడు. ఈ ఆరు మాసాలు తను బ్రతికుండడంవల్ల తన కుటుంబీకులు పొందే ప్రయోజనం కంటే; తను చావడంవల్లే తన కుటుంబీకులు అధిక ప్రయోజనం పొందగలరనుకున్నారు గుర్నాధం మాష్టారు.

లంచగొండి తనంలో తను ఆరితేరినవాడై - లంచాలు గుంజేటందుకవకాశాలు అధికంగాగల ఏ డిపార్టుమెంటులోనైనా తను పనిచేస్తున్నట్లయితే; ఉద్యోగ విరమణకుముందే తనిట్లా చావుకి స్వాగతం చెప్పండేవాడుకాడేమో! కాస్త జ్ఞానం వచ్చినప్పటినుండి తన బ్రతుకంతా కష్టాల కడలిలోనే ఈగిన లాడుతోంది. విశ్రాంతి లేని బ్రతుకయిపోయింది. శ్రమకు అంతమే విశ్రాంతా?— ఉద్యోగ విరమణకు ముందే తనకు చావు వస్తే; అదీ అతి సునాయాసంగా, వృధా ఖర్చుని తన ఆత్మీయులకు తగల్చకుండా వస్తే; అదే తనకు నిజమైన విశ్రాంతి!... కాని తనకంతటి అదృష్టమా?

చాలాకాలం కితం శ్రీ గోపీచంద్‌గారు వ్రాసిన 'అసమర్థుని జీవయాత్ర' అను నవల్ని చదివేరు తాను!.... అయితే శ్రీ గోపీచంద్‌గారి 'అసమర్థుని జీవయాత్ర'లోని కథానాయకుడయిన సీతారామారావుకి, తనకు అన్ని విషయాలలోను పోలికలు లేకపోయినా, నాటి సమాజపు దృష్టిలో సీతారామారావు ఎంతటి అసమర్థుడో తనూ నేటి సమాజం దృష్టిలో అంతటి అసమర్థుడే!— నేటి లౌకిక సమాజంలో సమర్థతకుగాని, అసమర్థతకుగాని- వృత్తి, ఉద్యోగం, ఆదాయం, అధికారం, పలుకుబడి, హోదా ఇట్లాంటివన్నీ కొలబద్దలు!.... మానవత్వం, ప్రేమ, ఔదార్యం, దయ, దాక్షిణ్యం, త్యాగం యిట్లాంటివన్నీ వ్యక్తియొక్క అసమర్థతకు, చేతకాని తనానికి చిహ్నాలు! నేటి సమాజం దృష్టిలో తనొక అసమర్థుడు! ఎందుకంటే; ఈ లోకంలో తనకెక్కడా స్వంత యిల్లు లేదు - పెద్ద కూతురికైనా యింకా పెళ్ళిచెయ్యలేదు. పెద్ద కొడుక్కి ఉద్యోగం సంపాదించ లేదు. బ్యాంక్ అకౌంట్ లేదు!.... ఇట్లా పేర్కొంటూ పోతే తన అసమర్థతకు బోలెడన్ని ఉదాహరణల్ని ఉటంకించ వచ్చు!.... లోకుల దృష్టిలోనే కాక, తన ఆత్మీయుల దృష్టిలో కూడా తను వట్టి అసమర్థుడు; అప్రయోజకుడు!....

ఇకపోతే శ్రీ రా. వి. శాస్త్రిగారు వ్రాసిన 'అల్పజీవి' నవలలోని కథానాయకుడైన సుబ్బయ్యకు, తనకు అన్ని విషయాలలోనూ కాకపోయినా కొన్ని విషయాలలో మాత్రం పోలికలున్నాయి!.... అయితే అవి పిరికివాడైన సుబ్బయ్యను, హీరోగా చేసిన 'మనోరమ'వంటి వనిత, తన జీవితంలోకి ప్రవేశించలేదు!.... అందుకనే తను అల్పజీవిగానే కాక, అప్రయోజకుడిగా కూడా ఈ లోకంలో మిగిలిపోయేడు!

అంతేకాక కొన్ని గుణాలలో; శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారు వ్రాసిన, 'వ్యక్తిత్వంలేని మనిషి' అనే నవలలోని కథానాయకుడు, మృత్యుంజయరావుతో కూడా తనను పోల్చవచ్చు!.... ఇంతకీ చెప్పొచ్చే దేమిటీ అంటే; తను అసమర్థుడు, అప్రయోజకుడు, వ్యక్తిత్వం లేని మనిషని!....

గత స్మృతులెన్నో గుర్నాధం మాష్టారి మస్తిష్కంలో మెదలేయి! ఆత్మన్యూనతాభావం ఆవహించి అతడిని ఎంతగానో అవహేళన చేసింది. తన క్లాస్‌మేట్సు ఎందరో ఈనాడెంతో హాయిగా వున్నారు. ప్రయోజకులయేరు. తను మాత్రం?.... ఛీ ఛీ!.... తల్చుకొనేటందుకు తనకే సిగ్గుగా వుంది!



తన భార్య దృష్టిలో....,
తన ఆత్మీయుల దృష్టిలో....
తన నెరిగిన లోకుల దృష్టిలో....

తనో అసమర్థుడు. అప్రయోజకుడు. అల్పజీవి. వ్యక్తిత్వం లేని మనిషి !....

తన జన్మకొక ప్రయోజనం, పరమార్థం, సార్థకత ఏర్పడాలంటే ? తను చావాలి !

ఘోరమైన ప్రమాదానికి లోనై సునాయాసంగా చావాలి !
తన చావువల్ల పెద్దకొడుక్కి ఉద్యోగం,
పెళ్ళానికి పెన్షన్,
పెద్ద కూతురికి పెళ్ళి,
తనకు శాశ్వతమైన విశ్రాంతి !.... శాంతి !
అబ్బో !.... చాలా ప్రయోజనాలు !

అన్నట్టు ఆవాళ తన పెద్ద కొడుకు, ప్రయివేటు కంపెనీవారు పెట్టిన ఇంటర్వ్యూకి వెళ్ళేడు. సెలక్టయేదో లేదో ?

నేడు జరుగుతున్న ఇంటర్వ్యూలు చాలావరకు వట్టి ఫార్సులుగా ముగుస్తున్నాయి. ఎవరికి ఉద్యోగాలివ్వదమో ముందుగానే నిర్ణయించేసుకొని, లోకాన్ని వంచించేటందుకుగాను ఇంటర్వ్యూ అనే తతంగాన్ని నిర్వహిస్తున్నారు !.... అన్నట్లు కాల్సు పంపడంలో ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజ్‌వారు ఎంత నిజాయితీగా వ్యవహరిస్తున్నదీ ఈ లోకం కోడై కూస్తోంది !.... నక్కలు కోడి కూతలకు భయపడతాయా ?.... భయపడవు ! ..

నేటి సామాజిక వ్యవస్థలో తనబోటి వాళ్ళు సుఖంగా బ్రతకలేరు. చావే తనబోటివారికి సుఖాన్నియిస్తుంది. అంచేత తను చావును స్వాగతించక తప్పదు !.... తనబోటివారి బాధల్ని, కష్టాల్ని, క్లిష్ట సమస్యల్ని మృత్యువు మాత్రమే పరిష్కరించగలదు. కనుక తనప్పుడు ప్రయాణం చేస్తున్న బస్సు ఘోరమైన ప్రమాదానికి లోనై తీరాలి. తను తక్షణమే సునాయాసంగా చావాలి !

డ్రైవర్ బస్సుని స్పీడుగానే డ్రైవ్ చేస్తున్నాడు !.... యాక్సిడెంటవ డానికవకాశాలు లేకపోలేదు!.... "మందు"కొట్టేడో లేదో ?.... బహుశా "మందు" కొట్టే వుంటాడనుకున్నారు గుర్నాధం మాష్టారు. డోసుకి మించి మందు కొట్టుంటేనే అతగాడి కళ్ళు బైర్లు కమ్ముతాయి ! అతగాడి కళ్ళు బైర్లుకమ్మి, చెయ్యి పట్టు తప్పితేనేగాని ఘోరమైన ప్రమాదం జరగదు. బస్సు ఏ లోయలోకో తిరగబడదమో, ఎదురుగా వస్తున్న ఏ లారీనో గ్రుద్దివేయదమో.




ఇట్లాంటిదేదో జరిగితేనేగాని తనకు చావు రాదు !.... ఒక వేళ ఆ బస్సు ఏదైనా యాక్సిడెంటుకి గురైనప్పటికీ తను చావకపోతేనో ?.... కాళ్ళో, చేతులో తెగి అంగవైకల్యం ఏర్పడితే ?.... అమ్మో !.... అంతకుమించిన నరకం వేరొకటుండదు !....

ఇంతకీ తన చావుకోసం, తను ప్రయాణం చేస్తున్న బస్సు యాక్సిడెంటుకి లోనవాలని కోరుకోడంలో ఏమైనా ఔచిత్యం వుందా ?.... ఒక్క తను తప్ప, ఆ బస్సులోగల మిగతా ప్రయాణీకులంతా బ్రతుకుపై ఆశగలవాళ్ళే నేమో !— వాళ్ళంతా తమ భవిష్యత్తు గురించి మధురాతి మధురమైన ఆశలు పెంచుకుంటున్నారేమో !....

గుర్నాధం మాష్టారు, ఆ బస్సులోగల ప్రయాణీకులందరికేసీ ఓసారి పరిశీలనగా చూసేరు !....

క్రొత్తగా పెళ్ళయి హనీమూన్‌కి బయలుదేరిన యువ దంపతులు,
అత్తవారింటికి బయలుదేరిన నవ వధువులు,
పుట్టింటికి పురిటికని వచ్చే చూలాళ్ళు,
పెళ్ళాల్ని చూసేటందుకు మామగారిండ్లకు బయలుదేరిన అల్లుళ్ళు,
కూతుళ్ళకి పెళ్ళి సంబంధాల్ని చూసేటందుకు బయలుదేరిన తండ్రులు,
క్రొత్త ఉద్యోగాలలో జాయనయేటందుకు ఎంతో సంతోషంగా బయలుదేరిన యువతీ యువకులు,
పెద్దాసుపత్రిలో జాయనయేటందుకు బయలుదేరిన రోగులు,
క్రొత్త సినిమాల్ని చూసేటందుకని నగరానికి బయలుదేరిన సరదా రాయుళ్ళు,
కాలేజీల్లో చదువుకొనేటందుకై బయలుదేరిన విద్యార్థులు,
వర్తక వ్యాపారాల నిమిత్తం బయలు దేరిన వాళ్ళు,
నగరంలో జల్సా చేసేటందుకై బయలుదేరిన వాళ్ళు.... ఇట్లా అనేక మంది ఉండవచ్చు !....

ఒక్క తన చావుకోసం ఎంతోమంది దారుణంగా మరణించేటందుకు, తీవ్రంగా గాయపడేటందుకు, శాశ్వతంగా అంగవైకల్యం గలవారయేటందుకు వీలు కల్పించే బస్సు ప్రమాదాన్ని తను వాంఛించడం అమానుషమనుకున్నారు గుర్నాధం మాష్టారు ! అందుకని ఇతరులకు ఎవ్విధమైన కష్టనష్టాలు కలుగని రీతో తను చావుని స్వాగతించడం సబవుగావుంటుందనుకున్నారు గుర్నాధం మాష్టారు.

ఎట్లాంటి చావుని తను స్వాగతించడమా అని గుర్నాధం మాష్టారు ఆలోచిస్తుండగానే బస్సు ఆర్. టి. సి. కాంప్లెక్సులో ఆగింది.

అందరితోపాటు గుర్నాధం మాష్టారుకూడా బస్సులోంచి క్రిందకు దిగుతున్నప్పుడు, అతని దృక్పథంలో పడ్డాడు పెద్ద కొడుకు. తండ్రికి గౌరవ పురస్సరంగా స్వాగతం పల్కి, "ఇవాళ్టి ఇంటర్వ్యూలో నేను సెలక్టయేను నాన్నగారూ !.... రేపే డ్యూటీలో జాయనవమన్నారు మేనేజరుగారు !" అనే శుభవార్తను చెప్పేడు.

ఆ ప్రక్కనే నిలబడివున్న అతని పెద్దకూతురు, "రవిబాబుగారు నన్ను వివాహము చేసుకొనేటందుకు కంగీకరించేరు నాన్నగారు !"అని సిగ్గుపడుతూ చెప్పింది.

అంతవరకు చావుకి స్వాగతం పలికిన గుర్నాధం మాష్టారికి, చావంటే భయం పట్టుకుంది !

బస్సు దిగేసరికి తన పెద్దకొడుకు, పెద్ద కూతురు తనకు శుభవార్తలతో స్వాగతం పలుకుతారనుకోలేదు గుర్నాధం మాష్టారు !

# నవ్వుల సందడి

(నాటకం)

రావినూతల సువర్ణాకన్నన్

—: ఇందలి పాత్రలు :—

| | | |
|---|---|---|
| జగన్నాధం | :— | ఇంటి యజమాని |
| సూరమ్మ | :— | జగన్నాధం తల్లి |
| దుర్గ | :— | ,, భార్య |
| సుబ్బులు | :— | ,, కూతురు |
| కమల | :— | ,, చెల్లెలు |
| గోపి | :— | ,, మేనల్లుడు |
| చంద్రి | :— | ,, పనిపిల్ల |
| కాంతమ్మ | :— | సూరమ్మ స్నేహితురాలు (పక్కింటామె) |



( మొదటి రంగం )

(సామాన్య అలంకరణ. సూరమ్మగారు కంగారుగా పచార్లు చేస్తూ మధ్య మధ్య పైకిచూస్తూ దేవుణ్ణి తల్చుకుంటూ ఒక్కసారి లోనికెళ్ళే ద్వారం కేసి చూస్తూ.... అక్కడున్న కుర్చీలో కూలబడుతుంది.)

చంద్రి :— (ప్రవేశిస్తూ) పెద్దమ్మగోరూ ! పెద్దమ్మగోరూ ! (కంగారుగా)

సూరమ్మ :— (చివాల్న లేచి) ఏవిఁటే ! ...

చంద్రి :— గోరం జరిగిపోనాదమ్మా ....

సూరమ్మ :— ఏం జరిగిందే.... కొంపతీసి సావిత్రి....

చంద్రి :— ఆ !.... అయిపోయింది ! (చెవిలో దిగులుగా చెప్తుంది.)

సూరమ్మ :— (బుడిబుడి దీర్ఘాలు తీస్తూ) అయిపోయిందీ !.... అయ్యో !— ఇంత పనౌతుందని కల్లో కూడా అనుకోలేదే.

చంద్రి :— పూజకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు అన్నారు.... ఇంతకీ నా కొడుగ్గతిలా ఏడ్చింది.... ఎవర్నసి ఏం ప్రయోజనం ! ... కర్మని తప్పించడం ఎవరితరం !

కాంతమ్మ :— (ప్రవేశిస్తూ) ఏవిఁటి సూరమ్మొదినోయ్ ? ఎవరికీ కర్మ సిద్ధాంతం బోధిస్తున్నావ్ ?

సూరమ్మ :— (కళ్ళు తుడుచుకుంటూ) నువ్వా కాంతమ్మొదినా ! రామ్మా రా !.... ఏవిఁటో... బిడ్డల్ని కంటాం గానీ వాళ్ళ రాతల్ని కన్లేం కదా !.... ఊఁ? కూర్చోమ్మా !.

కాంతమ్మ :— (కూర్చుని) ఏవిఁటి హడావిడి పడుతున్నారు. కోడలికి నెప్పులొస్తున్నాయా ఏవిఁటి ?..

సూరమ్మ :— (దుఃఖంతో) ఆఁ ! ఆఁ ! నెప్పులు రావడమూ అయింది. కనడమూ అయింది. ఆ భగవంతుడు మా ఆశల్ని నట్టేట ముంచడమూ అయింది.

కాంతమ్మ :— అయ్యో ! ఏ వైందొదినా ? తల్లీ బిడ్డా కులాసాయే కదా ?

సూరమ్మ :— అదెందుకడుగుతావ్‌లే ఒదినా ! ఇంతకీ నట్టింట పసివాడు దోగాడే రాత నా మొఖానలేదు !

కాంతమ్మ :— (బాధగా) రామ ! రామ ! ఎంతపనైందొదినా ! నిన్నటి దాకా సావిత్రి చెంగుచెంగున తిరుగుతుంటే అందరికళ్ళూ ఆ పిల్లమీదే ! ఏదిష్టో కొట్టుంటుంది!.... అది సరే.... నెలలు నిండలేదుగా,

సూరమ్మ :— నిండకేమే నా తల్లి !.... రేపు దశమికి పదినెల్లు కూడా నిండుతాయి !

కాంతమ్మ :— (ఓదార్పుగా).... అయితే ఎందుకిలా జరిగింది.... పోన్లె సూరమ్మొదినా ! భగవన్నిర్ణయం తప్పించడానికి మన మెంతటివాళ్ళం ! అంతా వాడి లీల! నువ్వేం దిగులు పడకు ! వచ్చే ఏడీరోజులకల్లా గుమ్మడిపండులాంటి మనవడు నీ ఒళ్ళో వుంటాడు ఒదినా !

సూరమ్మ :— (విరక్తిగా కళ్ళు తుడుచుకుంటూ) అవున్లే !.... అంతా అయ్యాక ఇప్పుడు దిగులుపడి మాత్రం ప్రయోజనం ఏం వుంటుంది గనక !

కాంతమ్మ :— (చనువుగా) అదిగో ! మళ్ళీ మొదలెట్టావ్ ! పెద్ద దానివి నువ్వే ఇలా అయిపోతే ఇంక పచ్చి బాలింతరాలు ఆ సావిత్రేమై పోతుంది చెప్పు !

సూరమ్మ :— (విసుగుగా) ఆఁ ! ఆఁ !.... ఏవీఁఅవదు !.... ఆవిడకేఁ దిగులా చింతా !.... దిగులంతా నాకే ! అయినా నా పెద్దరికం అడుక్కు తిన్నట్టేవుంది ! (చీదేస్తుంది.)

కాంతమ్మ :— అబ్బబ్బ ! వూరుకో సూరమ్మొదినా ! ఈ సారి అచ్చు మా అన్నయ్య పోలికతో మనవడు పుట్టకపోతే నా పేరు మారుపేరు పెట్టు, ఊ!! లే ! ముందు లేచి కళ్ళు తుడుచుకో!.

సూరమ్మ :— (ఇంకా ఏడుస్తూనే వుంటుంది.)

చంద్రి :— (దిక్కు మొహంతో) ఇదిగో పెద్దమ్మగోరూ అలా ఏడవ మాకండి. నాకూ ఏడుపొస్తాంది !



సూరమ్మ :— (స్వరంపెంచి) ఏడవకేం చెయ్యనే చంద్రీ ! నెల తప్పిం దగ్గర్నించి ఎన్ని కలలు కన్నానే ? బంగారు వుగ్గుగిన్నెకూడా చేయించాను కదే !.... ఇంక నేనెలా బతకనే చంద్రి ! ఎలా బతకనే !....

చంద్రి :— (ఏడుస్తూ) అయ్యో !.... ఏడవమాకండి పెద్దమ్మగారూ....

సుబ్బులు :— (ఏదో తింటూవస్తూ చిత్తరయిపోయి) ఏవైంది బామ్మా ? ఎందుకు ఏడుస్తున్నారు ?....

సూరమ్మ :— (మనవరాల్ని పట్టుకొని) అయిపోయిందే సుబ్బులూ ! అయిపోయిందే ! నా ఆశలన్నీ నట్టేట ముంచేశాడే ఆ భగవంతుడు.

సుబ్బులు :— (ఏడుస్తూ) అయ్యో ! బామ్మా !.... అలా ఏడవకే !.... నువ్వేడిస్తే నాకూ ఏడుపొస్తుంది.

జగన్నాధం :— (కంగారుగా ప్రవేశిస్తూ) ఏవైఁదర్రా? ఎందుకు ఏడుస్తున్నారు ?
(అందరూ గొల్లుమంటారు ఒక్కసారిగా)

జగన్నాధం :— (విసుగ్గా) అసలేవైందో నువ్వైనా చెప్పి చావ్వే చంద్రి ?

చంద్రి :— నేను చెప్పలేను బాబుగోరూ ! పెద్దమ్మగోర్నే అడగండి. (వెళ్ళిపోయిండి.)

జగన్నాధం :— విషయమేమిటో నువ్వయినా చెప్పమ్మా సుబ్బులూ.

సుబ్బులు :— నాకు తెలియదు నాన్నా, బామ్మేడుస్తూంటే నేనూ ఏడ్చాను, (మధ్య మధ్య తింటూ, ఏడుస్తూంటుంది)

జగన్నాధం :— (చిరాగ్గా) అబ్బబ్బ !.... జరిగిందేవిఁటో చెప్పి ఆ తర్వాత తీరిగ్గా ఏడవండర్రా! ....

సూరమ్మ :— (ఏడుస్తూనే).... సావిత్రి— మన సావిత్రికి....

జగన్నాధం :— (కంగారుగా) అయ్యో ! సావిత్రికేవైందమ్మా !....

సూరమ్మ :— నా నోటితో చెప్పలేను నువ్వే వెళ్ళి చూడు నాయనా ! (జగన్నాధం కంగారుగా లోపలికెళ్తాడు.)

కాంతమ్మ :— (కళ్ళు తుడుచుకుంటూ) ఇదిగో ! సూరమ్మొదినా ! నామాట విని కాస్త తమాయించుకో ! ఊఁ ! లే మరి.... అవునూ.... ఇంతకీ బిడ్డ కడుపులోనే పోయిందా ? పుట్టి పోయిందా ?

సూరమ్మ :— (తుళ్ళిపడి) ఏవిఁటే ?

కాంతమ్మ :— అదే — బిడ్డ కడుపులోనే పోయిందా ? అయితే తల్లి ప్రాణానిక్కూడా ప్రమాదమేనమ్మా !....

సూరమ్మ :— (కసురుతూ) ఛీ ! ఛీ !....బిడ్డ పోవటమేవిటమ్మా అప్రాచ్యపు మాటలూ నువ్వూను ! బిడ్డ దుక్కలా వుంది !

కాంతమ్మ :— (ముక్కున వేలేసుకుని) మరైతే ఈ ఏడుపులు దేనికమ్మా ?

సూరమ్మ :— బానే వుంది !.... ఈసారైనా మగనలుసు పుట్టలేదని నేనే డుస్తుంటే నిండినింట కూర్చుని బిడ్డ పోయిందంటావేమమ్మా మంచిదానివే !

కాంతమ్మ :— (చివాల్న లేచి) అహాహా ! పచ్చని నట్టింట కూర్చుని ఇల్లెగిరేలా సోకాలుపెట్టగా లేంది, నేనన్నమాటలు అరాచకంగా తోచాయా నీకు ? బావుందమ్మా ! బావుంది ! అయినా ఒకళ్ళగోల నాకెందుకు ! (విసురుగా వెళ్ళిపోతుంది.)

జగన్నాధం :— (లోపల్నించి వస్తూ) ఏవిఁటమ్మా సావిత్రికి బంగారంలాంటి పాప పుడితే జరగరాందేదో జరిగినట్టు అంత హడావిడి చేశావ్ ?

సూరమ్మ :— అవున్నాయనా! నా బాధ మీకేం అర్థం అవుతుంది! ఈసారైనా మగబిడ్డ పుడితే, మా నాన్న పేరు పెట్టుకుందామని ఎంతో ముచ్చట పడ్డాను.

జగన్నాధం :— (నవ్వి) పోనీలేమ్మా! ఇప్పుడు మాత్రం మించిపోయిందేవుంది పాపకే నాన్న పేరు కలిసొచ్చేలా పెట్టుకుంటేనరి!

సూరమ్మ :— అంతేనంటావా ? ..

జగన్నాధం :— కాక మరేవిటి.... ఇంక ఆ ఏడుపులూ అవీ మానెయ్యండి! (బిగ్గరగా) ఇదిగో దుర్గా!

దుర్గ :— (లోపల్నించే) ఆఁ !....

జగన్నాధం :— నేనలా బయటికి వెళ్ళొస్తాను !....

దుర్గ :— అలాగే ....

సుబ్బులు :— (గారంగా) బామ్మా!

సూరమ్మ :— ఏమ్మా!

సుబ్బులు :— నీకు.... ఆడపిల్లలంటే ఇష్టం లేదా ?

సూరమ్మ :— ఊఁ హూఁ! ఇష్టం లేదు!

సుబ్బులు :— ఏ ? ఎందుకిష్టం లేదు ?

సూరమ్మ :— ఎంతైనా ఆడపిల్ల ఆడపిల్లే! మగబిడ్డ మగబిడ్డే! పుట్టుంటేనే పున్నామ నరకం తప్పేది!

సుబ్బులు :— పున్నామ నరకమా ?.... అంటే ఏమిటి బామ్మా ?

దుర్గ :— (వస్తూ) పున్నామ నరకం అంటేనా.... ఇప్పుడు మీ బామ్మ చూపిస్తోంది చూడు! అదే!....

సూరమ్మ :— (కోపంగా) ఏవిటి నేను నరకం చూపిస్తున్నానా ?

దుర్గ :— లేకపోతే ఏవిటత్తయ్యా!.... కనకానికి వరసగా మగపిల్లలు పుడితే - పక్షవాతం వస్తే చెయ్యడానికే, చస్తే మీదపడి ఏడవడానికే ఆడపిల్ల లేరని సాధించారా ? ఇప్పుడు సావిత్రికి వరసగా ఆడపిల్లలు పుడితే, పున్నామ నరకంనించి తప్పించడానికి తలకొరివి పెట్టడానికీ కొడుకుల్లేరని సాధిస్తున్నారా!

అసలు పక్షవాతం రావడం దేనికి ఆడపిల్లలు వచ్చి చెయ్యడం దేనికి! ఒకవేళ కర్మకాలి అలాంటిదేదైనా వస్తే అత్తింట నున్న ఆడపిల్ల వచ్చి ఎన్నాళ్ళు చేస్తుంది? ఎవ్వరికైనా కోడళ్ళేగా అక్కర కొచ్చేది. అయినా చచ్చాక మీద పడే యేడిచారో, పక్కనుండే యేడ్చారో మనం చూడబోయామా!....




అలాగే మగపిల్లలూనూ!.... చదువుంటకని, వుద్యోగాలకని దూరాభారాన వున్న మగపిల్లలు మాత్రం ఏం ఆదుకుంటున్నారు. ఈ రోజుల్లో ఏ పిల్లయినా ఒకటే!

అయినా మీ పిచ్చిగానీ ఆడపిల్లని కనాలన్నా మగబిడ్డని కనాలన్నా మన చేతుల్లో వుందా ? ఇంకనైనా మీ రోదన ఆపెయ్యండి! ఇప్పటికే సావిత్రి తెగ బాధపడి పోతోంది.

సూరమ్మ :— (గుండెలు బాదుకుంటూ) హన్నా! హన్నా! ఎన్ని మాటలు! ఎన్ని మాటలంది! నేనింక ఈ కొంపలో ఒక్క క్షణం వుండను! యే కాశీయో రామేశ్వరమో పోతాను. అంతా నిరాత! కాకపోతే నిక్షేపంలాంటి ఆయన దేశాలు పట్టిపోవడం యేవిటి!

దుర్గ :— అవును! ఇంట్లో మనశ్శాంతి వుంటేకదూ ?

సూరమ్మ :— (యేడుస్తూ) అమ్మో! అమ్మో! నోట్లో నాలుక లేనట్టుండే దీనికెంత నోరొచ్చిందిరా భగవంతుడా! ఈ కొంపలో నేనుండలేను (నా దేవుడా! ....)

సుబ్బులు :— అబ్బబ్బ! ఏడవకు బామ్మా!.... నువ్వలా యేడిస్తే ఏం బాగా లేదు. ఎంచక్కా నాలా నవ్వుతూ వుండాలి!

సూరమ్మ :— (ప్రేమగా దగ్గరికి తీసుకుని) నా తల్లి! నా తల్లి! నీకున్నపాటి జ్ఞానం మీ అమ్మకి లేదు! అందుకేనమ్మా నీకు మా అమ్మ పేరు పెట్టుకుంది!....

చంద్రి :— (వస్తూ) పెద్దమ్మగోరూ !....

సూరమ్మ :— యేవిఁటే !....

చంద్రి :— పక్కింటి జానికమ్మ గోరుపిలుత్తున్నారు. దొడ్డోకి రమ్మని

సూరమ్మ :— ఎందుకే ?....

చంద్రి :— యేమోమరి! కోడలి మీద సాడీలు సెప్పడానికేమో!

సూరమ్మ :— (కోపంగా) ఛ! నోరు ముయ్యవే! వెధవ్వాగుడు నువ్వూనూ (లోనికెళ్తుంది.)

సుబ్బులు :— ఒసేయ్ చంద్రి! ఇలా రావే !....

చంద్రి :— (దగ్గరగా వచ్చి) యేటమ్మాయిగోరూ !....

సుబ్బులు :— ఒకటడుగుతాను చెప్తావా ?....

చంద్రి :— మీరడగడం! నాను సెప్పక పోవడమూనా అడగండి అమ్మాయిగోరూ!

సుబ్బులు :— మా తాతయ్య ఇల్లొదిలి ఎందుకెళ్ళిపోయాడో నీకు తెలుసునే ?

చంద్రి :— ఓ తెల్సమ్మాయిగోరూ ?

సుబ్బులు :— ఎందుకు ?

చంద్రి :— (ఓసారి అటూఇటూ చూసి) మీ బామ్మగోరి పాటకి బయపడి!

సుబ్బులు :— ఛ! నోరు ముయ్యవే! పాటకి భయపడి ఎవరైనా ఇల్లొదిలి పోతారేంటే ?....

చంద్రి :— నిజం అమ్మాయిగోరూ! సత్తెపెమానంగా సెప్తున్నాను. ఇసయం ఇవరంగా సెప్పనా ?

సుబ్బులు :— చెప్పు! చెప్పు !....

చంద్రి :— మీ తాతయ్ గోరికి సంగీతమంటే మా ఇట్టమంట! అందుకే ఆర్మనీ వాయించే మీ బామ్మగోర్నిచ్చి సేశారంట! ఇంకా రోజునించి ఆర్మణీపెట్టి వాయించేత్తా, గెట్టిగా అరుత్తా పాడేవారంట మీ బామ్మగోరు.

ఆరి పాటకి గొర్ధసావిట్లో గొడ్డు కట్టు తెంచుకు పారి పోయేవంట. ఫాలిత్తన్న గొడ్డు పెళ్ఖన తన్నేవంట! నిద్ద రోతన్న పిల్లలు తుళ్ళిపడి గుక్కెట్టి యేడ్చేటోల్లంట! కొన్నాళ్లి బాధ బరించి, సంగీతం పాడద్దని సెప్పి సెప్పి ఇసిగిపోయిన మీ తాతగోరు రెండు సొక్కాలు, పంచిలు సంచిలో కుక్కుని రేతికి రేత్తే యేడికో యెళ్ళిపోనారంట!...

సుబ్బులు —— ఇదంతా నీకెలా తెలుసే ?

చంద్రి —— మా యవ్వ సెప్పిందమ్మాయిగోరూ!

సూరమ్మ :—— (కోపంగా వస్తూ) ఎవరూ ఆ వెంకేనా ? అలా చెప్పింది ? దాన్నోరు పడ! దానికేం పొయ్యేకాలం! ఈసారి వూరగాయ ముక్కకోసం రానీ! కాళ్ళు విరక్కొడతాను. అయినా అదేదో వాగితే నీ బుద్దెక్కడికి పోయిందే... వెధవ అబద్ధాలన్నీ చేర్చి అమ్మాయిగారికి చెప్తావా ?

సుబ్బులు :—— (అనునయంగా) పోనీలే బామ్మా, చంద్రి యేదో తెలియక అంది! పోనీ నువ్వుచెప్పు తాతయ్య ఇల్లొదిలిపెట్టి ఎందు కెళ్ళిపోయాడు ?

సూరమ్మ :—— ఏం చెప్పనే తల్లీ! మా అత్తగారు పరమ గయ్యాళి! ఆవిడ నన్ను పెట్టే ఆరళ్ళు చూడలేక ఆవిడని వారించనూ లేక ఇల్లొదిలి పోయారు. పాపం;.... పిచ్చి మారాజు! ఎక్కడున్నారో యేమో! ఆయనకి నా పాటంటే ఎంత ఇష్టమను కున్నావ్! సంగీతమంటే తగని పిచ్చి! (ఉత్సాహంగా) అన్నట్టు సంగీతం అంటే గుర్తొచ్చింది. ఒసేయ్ చంద్రీ! అటకమీంచి హార్మోనియం తియ్యవే! అమ్మాయిగారిక్కూడా నాలుగు పాటలు నేర్పుతా! గోపిక్కూడా సంగీతమంటే చాలా ఇష్టం!

చంద్రి —— (కంగారుగా) ఒద్దమ్మగారూ!

సూరమ్మ —— యేవేఁ ఎందుకొద్దు ?

చంద్రి —— అహఁ! మరేం లేదమ్మగోరూ! పెద్దయ్యగోరి లాగే.... గోపీ బాబుగోరుకూడా ఇల్లొదిలి ...

సూరమ్మ —— (కసిరి) ఛీ! నోరు ముయ్యవే పాపిష్టిదానా! నేనంటే నీకూ అలుసుగానే వుంది!. ముందు చెప్పిన పని చెయ్యి;

చంద్రి —— అలాగే అమ్మగారూ.. (లోనికెళ్తుంది.)

సుబ్బులు :—— (గారంగా) బామ్మా!

సూరమ్మ —— యేమ్మా ? యేవిఁటి ?....

సుబ్బులు —— (విసుగ్గా) నేను సంగీతం నేర్చుకోనే!

సూరమ్మ —— యేమ్మా! ఎందుకు నేర్చుకోవూ ?

సుబ్బులు —— (యేడుపు మొహంతో) మొన్న కరణంగారింట్లో ఎవరో పాడమన్నారు. పోనీలేగదా అని ఒక పాట పాడాను అప్పుడు వాళ్ళమ్మ యేవందో తెలుసా ?

సూరమ్మ —— (ఆత్రతగా) యేవందేవిఁటి!

సుబ్బులు —— దీని గొంతు అచ్చం వాళ్ళబామ్మ గొంతు! వట్టిగార్ధభ స్వరం! అంది అందరూ నవ్వేశారు. గార్దభం అంటే గాడిద కదా! అపుడు నాకెంతేడుపొచ్చిందో (యేడుపు గొంతు)

సూరమ్మ —— (కోపంగా) యేవిఁటే అంత మాటందా! దానికేం పొయ్యే కాలమమ్మా! పిల్లని చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటోంది ? పోన్లే తల్లీ!. ఇంకెప్పుడూ వాళ్ళింటి కెళ్ళకు! ఎంచక్కా మనింట్లోనే పాడుకో!

సుబ్బులు :—— బామ్మా!

సూరమ్మ —— యేవిఁటి తల్లీ.

సుబ్బులు :—— అయినా నేను సంగీతం నేర్చుకోనే....

సూరమ్మ :—— (నిట్టూరుస్తూ) బిడ్డని హడల గొట్టేశారు! పోన్లేమ్మా సంగీతం ఒద్దుగానీ.. మధ్యాన్నం లడ్డూలు చేశాను. తిందువు గాని దా. (లోనికెళ్తుంది.)

సుబ్బులు :—— (ఆనందంగా) యేవిఁటి లడ్డూలే ? (బామ్మని అనుసరిస్తుంది)

(రెండవ రంగము)

జగన్నాధం పేపర్ చూస్తూంటాడు. దుర్గ ఆయన పక్క కుర్చీలోనే కూర్చుని బియ్యం యేరుకుంటుంది.)

జగన్నాధం :—— (పేపర్ చదువుతూ) లారీ.... బస్సూ గుద్దుకుని 42 మంది దుర్మరణం!.. విజయవాడలో అగ్నిప్రమాదం చ! చ! పేపర్ తీస్తే చాలు వెధవ చావులు; ఊ... పట్నంలో విద్యుచ్ఛక్తి కోత!.... యేది సమృద్ధిగా వుంది చచ్చింది గనక! ఊ. మచిలీపట్నం——

దుర్గ :—— ఇదిగో! మిమ్మల్నే! ఈ సంగతి విన్నారా!

జగన్నాధం :—— (పేపర్లోంచే) ఏదీ.... నువ్వు చెప్పండే.

దుర్గ :—— చెప్తానుగానీ పేపర్లోంచి ఆ ముఖాన్ని కాస్త బైటికి తియ్యండి.

జగన్నాధం :—— (ఓసారి చూసి) ఊఁ చెప్పు, యేవిఁటి సంగతి!

దుర్గ —— (రహస్యంగా) మన గోపాలకృష్ణుడు.... ఆదేనండీ మన గోపీ.... యేదో ప్రేమలో పడ్డాట్ట!

జగన్నాధం :—— (కంగారుగా) యేవిఁటే పడ్డాడా ? ఎక్కడే! దెబ్బలేం తగల్లేదు కదా!

దుర్గ :—— (విసుగ్గా) అబ్బబ్బ! ఆ పడ్డం కాదండి! గోపీ ఎవరో ఓ అమ్మాయిని ప్రేమించాట్ట! మా పింతల్లి కొడుకు వుత్తరం రాశాడండీ!

జగన్నాధం :—— (పేపర్లోంచే) ఓస్ ప్రేమించడమే కదా! యేదో కుర్రాడు! ప్రేమించాడు. కుర్రాళ్ళు కాకపోతే మనం ప్రేమించు కుంటాంటోయ్!



దుర్గ :— (కోపంగా) నాశార్ధం, ముందా పేపర్ తీసి అవతల పడెయ్యండి.

జగన్నాధం :—(పేపర్ పడేస్తూ) అబ్బబ్బ! ..నీకన్నింటికీ విసుగే! దుర్గా! ఇప్పుడు చెప్పు! ఎవరు ఎవర్ని ప్రేమించారంటావ్!

దుర్గ :— (విసుగ్గా) ఊఁ! బానేవుంది. . రెడ్డొచ్చె మొదలాడ మన్నట్టు మళ్ళీ మొదటికి రావల్సిందేనా?

జగన్నాధం :—నేను సరిగా వినందే .

దుర్గ :— పోనీ ఈసారైనా కాస్త జాగ్రత్తగా వినండి. మీ మేనల్లుడు గోపీ వున్నాడా?

జగన్నాధం —ఎందుకు లేడూ?

దుర్గ — (వ్యంగ్యంగా) అయ్యో! లేకేం! నిక్షేపంలా వున్నాడు. అయితే అతగాడికి మన సుబ్బుల్నిచ్చి పెళ్ళి చేద్దామను కున్నావాఁ లేదా.

జగన్నాధం :—ఇప్పుడు కాదన్నదెవరే!...

దుర్గ .— మీరూ నేనూ కాదు కాదన్నది! అతగాడే మరో చదువుకున్న అమ్మాయిని ప్రేమించాట్ట! ఆ పిల్లతోనే సినిమాలు, షికార్లు తిరుగుతున్నాట్ట! మా అన్నయ్య వుత్తరం రాశాడండి!

జగన్నాధం :—ఛ! ఛ! గోపీ అలాంటివాడు కాదే.

దుర్గ :— అవునవును! అతగాడు మంచివాడే! తీరి కూర్చుని మా అన్నయ్యే కల్పించి వుత్తరం రాశాడు అంతేనా?

జగన్నాధం :—(నసుగుతూ) అలా అని కాదు ...

దుర్గ .— ఇదిగో! నేను చెప్పేది కాస్త జాగ్రత్తగా వినండి! ... అసలే రోజులు బాగాలేవు. ఆడ పిల్లలకి ఈ చదువులంటూవచ్చాక మరీ బరితెగించి పోయారు. మీదమీద పడితే అతగాడు మాత్రం యేం చస్తాడు! అందుకే నామాట విని మూడు ముళ్ళూ వేయించెయ్యండి!

జగన్నాధం :—కానీ.... వాడి చదువు

దుర్గ :— మరేం పరవాలేదు. పెళ్ళయ్యాక పూర్తి చేస్తాడు.

సుబ్బులు :— (వస్తూ) అమ్మా. . (ఆమె చేతిలో చెరుకు వుంటుంది.)

దుర్గ :— వచ్చావా తల్లీ! రామ్మా రా!

సుబ్బులు .— ఎవరికే పెళ్ళంటున్నావ్!

దుర్గ :— (నవ్వుతూ) నీకేనే!

సుబ్బులు :— (మెలికలు తిరుగుతూ)ఇంకా బావకి చదువు పూర్తవలేదు కదే!

దుర్గ :— ఆ! ఇంకెంత ఒక్క యేడాదేగా. .. అన్నట్లు సుబ్బులూ ఇంకనించి నువ్వు మాత్రం అల్లరి చెయ్యకూడదు. చెట్లెక్క కూడదు. చెర్లోపడి ఈతలు కొట్టకూడదు! సరేనా?

సుబ్బులు :— (గునుస్తూ) అబ్బో! ఇంకా పెళ్ళే కాలేదు. అప్పుడే ఇన్ని అడ్డంకులా. . అలా అయితే నాకు పెళ్ళే ఒద్దు బాబూ?

దుర్గ :— (అనునయంగా) ఛ! ఛా! అలా అనకూడదమ్మా! నువ్వు పెద్ద దానివయ్యావుకదా! కాస్త అణకువ నేర్చుకోవాలి?

సుబ్బులు :— (వింతగా) అణకువా?.. అంటే యేవిఁటమ్మా?

జగన్నాధం :—(నవ్వి) అయ్యో! అది మీ అమ్మకి తెలిస్తేగా నీకు చెప్ప డానికి! ఇలా రా! నేను చెప్తాను!

సుబ్బులు :— (వచ్చి) చెప్పు! అణకువ .అంటే ?...

జగన్నాధం :—అ.... అణకువంటే.... అందరితో మెల్లగా మాట్లాడాలి!! ఇదిగో చూడు. ఇలా చెరకుముక్క తింటూ వీదుల్లోకి వెళ్ళ కూడదు. వీరయ్య తోటలో జాంకాయలు దొంగిలించకూడదు. ఇంకా. . అఁ!. . మగ పిల్లలతో గోలీలాడకూడదు. ఇంకా ఇలాంటివే ..

సుబ్బులు :— అమ్మ బాబోయ్! అణకువంటే ఇదా? పెళ్ళి చేసుకోవాలంటే ఇన్ని మానెయ్యాలా ఊఁహూఁ! నావల్లకాదు బాబు!

దుర్గ :— అబ్బ దాన్నలా హడలగొట్టకండి! అలా కాదమ్మా! పెళ్ళయితే ఇవన్నీ వాటంతట అవే వస్తాయి. అసలు నీకే అల్లరి మానెయ్యాలనిపిస్తుంది.

సుబ్బులు :— (క్షణం ఆలోచనలోపడి)... అమ్మా.... పోనీ.. అక్కసీ వాళ్ళన్నయ్యతో కబాడి ఆడద్దా.

దుర్గ :— ఛ ఛ! కబాడి ఆడపిల్లలు ఆడే ఆట కాదమ్మా! ఎంచక్కా చింత గింజలు, వామన గుంటలు ఆడుకోవాలి!

సుబ్బులు :— మరిన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదమ్మా!

జగన్నాధం :—ఆది! అలా అడుగు! తోటకూరనాడే చెప్పక పోయావా అన్నట్టు నీకూతురు భలే ప్రశ్న వేసిందిలే!

దుర్గ :— (కోపంగా) ఎక్కడా. నన్ను చెప్పనిచ్చారా మీ అమ్మగారు? ఎంతసేపూ అది మా అమ్మ! దాన్నేం అనకండి అంటూ దాన్నిలా తయారు చేసింది ఆవిడకాదూ, పోనీ మీరు చెప్పుకో వచ్చుగా మీ ముద్దుల కూతురికి బుద్ధులు!

జగన్నాధం :—(భయం నటిస్తూ) అయ్యబాబోయ్! నేనా? అసలు నన్నెక్కడ నోరు తెరవనిచ్చావే!

దుర్గ :— హవునవును !.. ఎవరినోరు మూతపడదో సలుగుంలం తెలుసు. యాత్రలకంటూ వెళ్ళబట్టిగానీ ఈ మాత్రం నోరు నన్నెక్కడ తెరవనిచ్చిందావిడ.

సుబ్బులు :— అమ్మా !

దుర్గ :— ఏం తల్లీ

సుబ్బులు :— బామ్మనేం అనకే !..

దుర్గ :— బావుంది ! ఇప్పుడు మీ బామ్మని నేనేవన్నాను !

సుబ్బులు :— అన్లేదూ ? అసలు బామ్మ యాత్రలకే, పిన్నులు వాళ్ళ వూళ్ళకి వెళ్ళిపోతే నాకేం బాగాలేదు.

దుర్గ :— ఇది మరీ బావుంది ! ఆవిడగారు యాత్రలకేగా వెళ్ళింది. రేపీపాటికి వూడిపడదూ ? ఇంక మీ పిన్నులంటావా వుద్యోగాలు చేసుకునే వాళ్ళెలా వుంటారే. ఏదో మీ శావిత్రి పిన్ని పురిటికొచ్చింది కాబట్టి మీ బాబాయిగారు వాళ్ళు వచ్చి నాలుగు రోజులున్నారు.

జగన్నాధం .— ఇంతకీ నన్నేం చెయ్యమంటావే ?

దుర్గ :— మీ చెల్లెల్ని ! బావగార్ని వున్నపాటున రమ్మని ఉత్తరం రాయండి.

జగన్నాధం :— నరే ! అలాగే !.. అన్నట్టు సుబ్బులూ ! అత్తయ్యా, మామయ్య వస్తే.. మర్యాదగా మాట్లాడాలి. బావని చూసి కాస్త సిగ్గు పడాలి ! కాబోయే భర్తకదా !

సుబ్బులు :— (విసుగ్గా) మళ్ళీ ఇదోటా ?

జగన్నాధం :— అదిగో ! అలా విసుక్కోకూడదు !.... విసుక్కునే వాళ్ళంటే బావకన్నలు ఇష్టం వుండదు ! ఇష్టం లేకపోతే నిన్ను పెళ్ళి చేసుకోడు. ఆ తర్వాత నీ ఇష్టం.

సుబ్బులు :— (కరగారుగా) ఉఁ హుఁ ! విసుక్కోను ! బావనైతే అస్సలు విసుక్కోను. మీరే చూస్తారుగా బావని చూసి నేను ఎంతబాగా సిగ్గుపడి పోతానో !

(మూడవ రంగము) (తెర)....

జగన్నాధం, దుర్గ కూర్చుని ఏదో చదువుతుంటుంటారు.

కమల :— (తలుపు తడుతూ) వదినా ! . సుబ్బులూ!.. .

జగన్నాధం :— (పుస్తకం పక్కగాపెట్టి) అరె ! కమల గొంతులావుంది. చూడు దుర్గా.

దుర్గ :— (దుర్గ లేచి తలుపు తీస్తుంది.) రా కమలా ! లోపలికి రా,

జగన్నాధం :— (చివాల్న లేచి) ఓసి కమలం నువ్వుటే ... ఏవిఁటిలా చెప్పాపెట్టకుండా వూడిపడ్డావ్?. . బావ కులాసానా ? గోపిగాడి దగ్గర్నించి వుత్తరాలొస్తున్నాయా ?

కమల :— (నిర్ఘాంతపోతూ) అదేవిఁటన్నయ్యా ! వున్నపాటున బయలుదేరి రమ్మని నువ్వేగా వుత్తరం రాశావ్ !

జగన్నాధం :— (మరింత తెల్లబోయి) నేనా ? నిన్ను రమ్మని వుత్తరం రాశానా ?

దుర్గ :— అదేనండి ! గోపి విషయం మాట్లాడటానికి రమ్మని రాయలేదూ?

జగన్నాధం :— గోపీ.... విషయమా?

దుర్గ :— (విసుగ్గా) అబ్బబ్బ ! అదేనండి మన సుబ్బులుకి, గోపికి పెళ్ళి చేసేద్దామని. .. ఆ విషయం మాట్లాడాలనీ రమ్మని రాశారుగా.

జగన్నాధం :— (ఆలోచిస్తూ) ... గోపికి సుబ్బులుకీ.... పెళ్ళి.. ఆఁ ! గుర్తొచ్చింది !

దుర్గ :— విన్నావా కమలా ! ఇదీ వరస ! నాలుగు రోజులు ఎక్కడికన్నా వెళ్తే నన్నుకూడా ఎవర్నువ్వు ? అనేలా వున్నారు మీ అన్నయ్య ! అయినా ఇవన్నీ నీకు నాకు కొత్తకనకనా ! అవునూ.... అన్నగారు రాలేదూ ?

కమల :— లే దొదినా ! మీ వుత్తరం అందే సరికి ఆయన వూళ్ళోలేరు. చేలో మందుల కోసం పట్నం వెళ్ళారు. నాకే ఏదో కంగారనిపించి వచ్చేశాను. ఇంతకీ విషయం ఏమిఁటి ? ఎందుకింత అర్జంటుగా రమ్మని రాశారు ?

దుర్గ :— కూర్చో కమలా ! ఇప్పుడేగా వచ్చావ్ ! మెల్లిగా మాట్లాడుకుందాం. ముందు కాస్త కాఫీ త్రాగు.
(ఫ్లాస్కులోని కాఫీ వంచి ఇస్తుంది)

కమల :— (తాగుతూ) సుబ్బు లేదే. . ?

దుర్గ :— లోపలుంది. ఓసేవ్ సుబ్బులూ ! మీ అత్తగారొచ్చిందే ?

సుబ్బులు :— (వస్తూ) అరె! అత్తా ! ఎప్పుడొచ్చావ్ ?

కమల :— (నవ్వి) ఇప్పుడేనే ! ...

సుబ్బులు : — (సిగ్గుపడుతూ) మావయ్య బావున్నారా ?

కమల :— (నవ్వుతూనే) ఆఁ ! మావయ్యా బావున్నారు.... ఆయనా బావున్నాడు,

సుబ్బులు :— (సిగ్గుగా) అబ్బ ! పో అత్తా !

కమల :— అబ్బో ! దీనికి సిగ్గుపడ్డం కూడా వచ్చిందే ! అయితే ఇంక పెళ్ళి చేసెయ్యాల్సిందే !

సుబ్బులు :— (సిగ్గుగా) అబ్బ .. పో అత్తా ! నాకు సిగ్గేస్తోంది.

కమల :— నేనెక్కడికి పోతానే మునుపట్లా నేనా ఇంటి ఆడబడుచునే కాదు. కాబోయే వియ్యపురాల్ని కూడా ! నన్ను పొమ్మండానికి మీ కెవ్వరికీ అధికారం లేదు ! అంతేనా వదినా ?

దుర్గా :— (నవ్వి) ఇంకా అనుమానమా ముందు కాఫీ తాగు !

కమల :— (తాగి) ఆఁ ! ఇప్పుడు చెప్పు ! ఏవిఁటి సంగతి ?

దుర్గ :— (నసుగుతూ) నువ్వు మరోలా అనుకోకూడదు.

కమల :— భలే దానివే ! ఏవిటొదినా చిత్రంగా మాట్లాడుతున్నావ్ ! నేనేదో అనుకోవడం ఏవిఁటి ?

దుర్గ :— అదే . కమలా !.... మన పిల్లలిద్దరికీ పెళ్ళి చేసేద్దాం.

కమల :— (ఆశ్చర్యంగా) ఇప్పుడా ?

దుర్గ :— అవును కమలా ! ఈ వేసవిలో చేసేద్దాం , నా ఆరోగ్యం అంత బాగాలేదు. మా కున్నది ఒక్కగానొక్క పిల్ల నీకు తెలుసుగా-దాన్నొత్తిన నాలుగక్షింతలువడితే నాకు నిశ్చింతే.

కమల :— ఇదిగో ఒదినా ! ఏదో మనసులో పెట్టుకుని మాట్లాడుతున్నావ్! లేకపోతే మొన్నొచ్చినప్పుడు లేని సుస్తీ హఠాత్తుగా ఎలా వచ్చి పడింది నీకు !

దుర్గ :— (నసుగుతూ). అదే. అదే. ..

జగన్నాధం :— అదికాదే కమలం ! . . మన గోపీ ఎవర్నో ప్రేమిస్తున్నట్టు ఓ వార్త అందింది మీ వదినకి ! ఇంకచూడు నిద్రపోవడం లేదనుకో !

నాకు మాత్రం కాస్త కంగారుగా వున్నమాట మాత్రం నిజం కమలా !

కమల :— ఛ ! ఛ ! అదేం లేదు ఒదినా ! నీకెవరు చెప్పారోగానీ అంతా అబద్ధం ! అన్నయ్యకూతురు పుట్టిందనగానే నా కోడలని నిర్ణయించేశాను. పైగా అన్నయ్య స్వయంగా అల్లుడుకి చదువు చెప్పించుకుంటూ వాడి మంచి చెడ్డలన్నీ చూసుకుంటున్నాడాయె ! అయినా ఇది నిన్నా ఇవాళా అనుకున్న సంగతా... గోపీకూడా సుబ్బులంటే ప్రాణం అని నీకు మాత్రం తెలియదేవిఁటి ?

దుర్గ :— కా.. నీ....

కమల :— ఇదిగో వదినా ! ఇంకేం మాట్లాడకు ! గోపీ నీ అల్లుడు ! సుబ్బులు నా కోడలు ! సరేనా ?

దుర్గ :— (ఆనందంగా) అయితే లగ్నాలు పెట్టించెయ్యనా ?

కమల :— అలాగే నీ ఇష్టప్రకారమే కానీ !

దుర్గ :— అమ్మయ్య ! ఇప్పుడు నా మనసు కాస్త కుదుటపడింది.

(తెర తీపి రంగం)

(జగన్నాధం ఉత్తరం చదువుతూంటాడు)

జగన్నాధం :— అమ్మా సుబ్బులూ ! (బిగ్గరగా)

సుబ్బులు :— (పరుగెత్తుకొచ్చి) యేవిట్నాన్నా ?

జగన్నాధం :— (నవ్వుతూ) మీ బావొస్తున్నాడమ్మా !

సుబ్బులు :— (ఉత్సాహంగా) అరె ! ఎప్పుడు నాన్నా ?

జగన్నాధం :— ఇవాళేనమ్మా ! ఇదిగో, మొన్న అందాల్సిన ఉత్తర పోస్టల్ వాళ్ళ ధర్మమాఅని ఇవాళందింది! ఇంకాస్సేపట్లో ఒచ్చెయ్యాలి!

దుర్గ :— (ఆనందంగా) నిజవేఁ !....

జగన్నాధం :— అవునోయ్ ! రావడమే కాదు. ఈ శలవులన్నీ ఇక్కడే గడిపేస్తాట ! చూడు (ఉత్తరం అందిస్తాడు)

దుర్గ :— (చదివి) అమ్మయ్య ! ఏదేదో ఊహించుకుని హడిలిపోయాను. అన్నయ్య ఎవర్ని చూసి ఎవరను కున్నారో !

జగన్నాధం :— సరే ! నేశలా కరణంగారింటిదాకా వెళ్ళొస్తాను. గోపీ వస్తే కబురు చెయ్యి !

దుర్గ :— అలాగే ! వెళ్ళిరండి.

సుబ్బులు :— అమ్మా !

దుర్గ :— యేవిఁటమ్మా ?

సుబ్బులు :— బావ నిజంగా శలవులంతా ఇక్కడేవుంటాడా ?

దుర్గ :— అవును తల్లీ !.. అలా అనే రాశాడు చూడు !
(లెటర్ అందిస్తుంది.)

సుబ్బులు :— అయితే బావ నన్ను పెళ్ళి చేసుకుంటాడా.?

దుర్గ :— ఎందుకు చేసుకోడు ? నా బంగారు తల్లిని చేసుకోవడానికి ఎన్ని పూజలు చేసుకోవాలో ! (మురిపెంగా చూస్తూ)

సుబ్బులు :— (బుంగమూతితో) మరి మాలతి అలా అందేవిఁటి ?

దుర్గ :— ఏవందే ?

సుబ్బులు :— మీ బావ బోల్డంత చదువుకున్నాడు ! అక్షరజ్ఞానం లేన్నిన్ను చచ్చినా చేసుకోడు అంది.

దుర్గ :— (కోపంగా) అలా అందా ?.... అయినా ఆ పిల్లకదేంబుద్ధమ్మా! నీకు బావకి పెళ్ళని ఇవాళ కొత్తగా అనుకున్నామా ? అయినా నీకేం తక్కువే ! వెధవ డిగ్రీల్లేవుగానీ.... నీకున్న తెలివితేటలు ఆ మాలతికున్నాయా ?

సుబ్బులు :— ఊఁ హూఁ ! లేవు....

దుర్గ :— నువ్వేం దిగులు పడకు.

సుబ్బులు :— అలాగే... .... మమ్మీ !....

దుర్గ :— యేవిఁటమ్మా ?

సుబ్బులు :— నేను బావ దగ్గర ఇంగ్లీషు నేర్చుకుంటానే !....

దుర్గ :— (నవ్వి) నేర్చుకోవే ! తప్పేంవుంది. కాబోయే మొగుడు ;

సుబ్బులు :— (సిగ్గుగా) అబ్బ ! పోమ్మా !. ..

దుర్గ :— (మురిసిపోతూ) అబ్బా ! నాతల్లికప్పుడే పెళ్ళికళొచ్చేసింది.

గోపీ :— (తలుపు తడుతూ) అత్తయ్యా !.... అత్తయ్యా.

సుబ్బులు :— (కూర్చున్నదల్లా చెంగున లేచి) అమ్మా ! బావే ! బావొచ్చేశాడే ?

దుర్గ :— (తలుపు తీసి) రా ! నాయనా ! నిండా నూరేళ్ళాయుష్షు నీకు ! ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాం.

గోపీ :— యేవిఁటత్తయ్యో ! కొంపతీసి తిడుతున్నారా ?

దుర్గ :— ఛ ! ఛ ! తిట్టడమేవిఁటయ్యా, శుభవాఁ అని అల్లుడు ఇంటికొస్తే సంతోషిస్తాంగాని తిడతావాఁ ఏవిఁటి ! సరేలే, నించోబెట్టే మాట్లాడేస్తున్నాను. కూర్చో ! అమ్మా నాన్నా బావున్నారా ?

గోపీ :— (కూర్చుంటూ) ఆహా ! అందరూ బావున్నారు, అవును ... నువ్వేదో పుకార్లు విన్నావట !... నువ్వు కంగారు పడ్డమే కాక అమ్మని కూడా కంగారు పెట్టేశావట ! ఇంతకీ విషయం ఏవిఁటి ?

దుర్గ :— (మెల్లగా) అమ్మ చెప్పలేదూ ?

గోపీ :— ఊఁ హూఁ ! ఎన్నిసార్లడిగినా విషయం చెప్పదు. వెంటనే మావఁయ్య దగ్గరికెళ్ళు అంది. అంతేకాదు. ఈ శలవులంతా ఇక్కడే వుండాలని మాత్రం పట్టుపట్టింది.... ఇంతకీ యేవిఁటా గొడవ ?

దుర్గ :— (నవ్వుతూ కూతురుకేసి చూస్తూ) మరేంకాదయ్యా ! నీకూ, సుబ్బులుకీ ఆ నాలుగక్షింతలూ వేయించేస్తే ...

గోపీ :— (తేలిగ్గా) ఓ ! పెళ్ళిగొడవా ! ఇంకేవిఁటో అనుకున్నాను.... దానికేంగానీ.... మావఁయ్యేడే !....

దుర్గ :— ఇదిగో ! ఇప్పుడే అలా కరణంగారింటికెళ్ళారు. నువ్వు కాస్త కాఫీ అదీ తాగేసరికి రానేవస్తారు. ఇదిగో సుబ్బులూ !... నువ్వు బావతో మాట్లాడుతూండు, నేను కాఫీ తెస్తాను.

సుబ్బులు :— అలాగే ! వెళ్ళు ! నేను మాట్లాడుతూంటానుగా....
(దుర్గ లోనికెళ్తుంది.)

గోపీ :— (నవ్వుతూ) ఏం సుబ్బులూ ! బావున్నావా ?

సుబ్బులు :— (సిగ్గుగా) ఆ! బానేవున్నాను. మరి....నువ్వో? నువ్వూ బావున్నావా?

గోపి :— నాకేం బ్రహ్మాండంగా వున్నాను.... అవును.... మీ పిలక పంతులు, స్నేహితురాళ్ళు అంతా బావున్నారా?

సుబ్బులు :— ఆ! అంతా బానే వున్నారు....

గోపి :— అన్నట్టు కరణంగారమ్మాయి.... అదే మాలతి బావుందా ఎన్నాళ్ళయిందో ఆ పిల్లని చూసి, అన్నింటిలోనూ ఆమె దేటుగా ఫస్టుమార్కు?

సుబ్బులు :— (విరాగ్గా) అలాగా....

గోపి :— సరేగానీ సుబ్బులూ! బామ్మేదీ.... అదే మా అమ్మమ్మ?

సుబ్బులు :— (సహజధోరణిలో)మా అమ్మతో పోట్లాడి యాత్రలకెళ్ళి పోయిందిగా(సిగ్గు హఠాత్తుగా గుర్తొచ్చి) మీ కాలేజీకి సెలవు లిచ్చేశారా?

గోపి :— ఆ ఇచ్చేశారు శలవులివ్వగానే వచ్చేశాను.

సుబ్బులు :— (మెలికలు తిరుగుతూ) అవును నీకు శలవులు ఎప్పుడిస్తారో నువ్వెప్పుడొస్తావో అని చూస్తున్నాం.

గోపి :— (నవ్వి పరిశీలనగా ఆమెనే చూస్తూ) అదిసరే.... యేవిఁటలా మెలికలు తిరిగి పోతున్నావ్?

సుబ్బులు :— (ఇంకా మెలికలు తిరుగుతుంది)

గోపి :— (కంగారుగా నడుంమీద చెయ్యేస్తూ) ఏమైంది సుబ్బులూ? నడుం పట్టేసిందా?

సుబ్బులు :— ఊఁ హూఁ. నడువుఁపట్లా ఏంపట్లా (సిగ్గుగా)

గోపి :— నో! నో! ఏదో వుంది!.... (బిగ్గరగా ఇదిగో అత్తయ్యా)

సుబ్బులు :— ష్! అరవకు! మధ్యన ఇప్పుడు అమ్మనెందుకు పిలుస్తావ్?

గోపి :— మరైతే చెప్పు! యేమైంది నీకు? కాలేమైనా బెణికిందా?

సుబ్బులు :— ఛ! ఛ! నీకేం తెలియదు బాబూ! అన్నీ నేనే చెప్పాలి! అది సిగ్గుపడ్డవేఁ

గోపి :— (తెల్లబోతూ) యేవిఁటీ సిగ్గుపడ్డవాఁ?

సుబ్బులు :— ఊఁ! ఊఁ! సిగ్గుపడ్డవేఁ! నిన్ను చూసి నేను బోల్డు సిగ్గుపడిపోవాలి కదా?

గోపి :— నన్ను చూసి సిగ్గుపడాలా ఎందుకు?

సుబ్బులు :— అబ్బబ్బ! ఎందుకేవిఁటి బావా! నీకూ నాకు పెళ్ళవుతుంది కదా! అలాంటప్పుడు నిన్ను చూసి నేను సిగ్గుపడద్దేవిఁటి ఇదిగో బావా! నువ్వు చదువైతే చదువుకున్నావ్ గానీ ప్చ్! లోకజ్ఞానం అస్సలేలేదు బావా! నేను చూడు! పెద్దగా చదువు కోకపోయినా నా కన్నీ తెలుసు! అందుకే నిన్ను చూసి నేనిప్పుడు సిగ్గుపడ్డం!

గోపి :— (బిగ్గరగా) మై గాడ్! అది.... నన్ను చూసి పడేసిగ్గా? ఇదిగో అత్తయ్యోయ్!

దుర్గ :— (లోపల్నించే) ఆఁ! ఆఁ!

గోపి :— అర్జంటుగా ఓసారిలా రావాలి!

దుర్గ :— (కాఫీ కప్పుతో వచ్చి) యేవిఁటయ్యా అంత గావుకేక పెట్టావ్?

గోపి :— ఇదిగో అత్తయ్యా! ఓ చిన్న రిక్వెస్ట్.

దుర్గ :— (నవ్వి) యేవిఁటయ్యా అది?

గోపి :— నేను నాలుగు రోజులపాటు ఇక్కడ వుండాలంటే ఇదిగో! దీన్నిలా మెలికలు తిరగడం మానెయ్యమను! అదేదో సిగ్గట పూనకం వచ్చినట్టు తెగవూగిపోతోంది.

సుబ్బులు :— (తల్లి వెనకాల చేరి గారంగా) చూడమ్మా బావ! నేనెంచక్కా సిగ్గుపడుతుంటేను....

గోపి :— అమ్మా సుబ్బమ్మ తల్లీ! నీకూ నీ సిగ్గుకీ ఓ దణ్ణం? ఆ సిగ్గు నా దగ్గర కాస్త తగ్గించెయ్ తల్లీ! నువ్వు కోరింది ఇచ్చుకుంటాగానీ! (బతిమాలుకున్నట్టు)

సుబ్బులు :— ఓయబ్బో! ఇలా సిగ్గుపడ్డం నాకూ కష్టంగానే వుందిలే,

దుర్గ :— (నవ్వి) ఇద్దరికిద్దరూ తలేవాళ్ళే ముందు కాఫీ తాగు!

గోపి :— అమ్మయ్య! ఇంక తాగుతాను. సుబ్బులు సిగ్గుపడ్డం మానాక నాక్కాస్త వూపిరందుతోంది.

జగన్నాధం :—(వస్తూ) అరే! గోపీ వచ్చేశాడే! యేరా గోపీ! ఇదేనా రావడం?

గోపి :— అవును మావఁయ్యా! అత్తయ్య నడిగితే, నువ్వు కరణం గారింటికెళ్ళావంది. సుబ్బులుతో కబుర్లు చెప్తున్నాను.

జగన్నాధం :—(ముసిముసిగా నవ్వుతూ) చెప్పు! చెప్పు! కాబోయే పెళ్ళామేఁగా!

గోపి :— (విరాగ్గా) ఇదిగో మావఁయ్యా! దయచేసి మాటకుముందు ఆ పెళ్ళి గొడవ తేకండి!



జగన్నాథం :—సరేలే! ఇందులో తప్పేంవుందిరా! నువ్వు డాక్టర్‌వి. మంచి మనసున్నవాడివి అందుకే అక్షరంముక్క రాని నా కూతుర్ని చేసుకుంటున్నావ్!

గోపి :— (నిర్లక్ష్యంగా) ఎవరు చెప్పగలరు మావయ్యా! మేరేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అన్నారు పెద్దలు.

సుబ్బులు :— (అమాయకంగా) అంటే యేవిఁటి బావా!

గోపి — (వ్యంగ్యంగా) ఓ నీకు చదువు రాదుకదూ-నేనన్న దానికి అర్థం ఏవిఁటంటే పెళ్ళిళ్ళవేవి స్వర్గంలో జరుగుతాయి అని!

సుబ్బులు :— ఛ! ఛ! అవేం మాటలు బావా! అపశకునం మాటలు- స్వర్గంలో పెళ్ళిళ్ళేవిఁటి నా మొహం! ఇదిగో బావోయ్! మనం మాత్రం బతికుండగానే పెళ్ళి చేసుకుందాం ఆ!

గోపి :— అని మొద్దూ.... నేనన్నదేవిటంటే...

సుబ్బులు :— ఇదిగో బావా!.... నువ్వేం అనద్దుగానీ ముందు కాఫీ తాగు ఇప్పటికే చల్లారిపోయుంటుంది.
(నవ్వి కాఫీ తాగి సుబ్బులు చేతికి కప్పు ఇచ్చేస్తాడు)

జగన్నాథం :—అన్నట్టు గోపీ! చదువయ్యాక వుద్యోగం చేస్తావా! ప్రాక్టీసు పెడతావా!

గోపి :— ఇంకా యేం అనుకోలేదు మావయ్యా!

సుబ్బులు :— (ఉత్సాహంగా) బావా! బావా! ఉద్యోగమే చెయ్యి బావా! ఎంచక్కా కరణంగారి పెద్దమ్మాయిలా పట్నంలో వుండొచ్చు. బోల్డు సినిమాలు చూడచ్చు.

దుర్గ :— (నవ్వుతూ)అబ్బో, ఆశ, నువ్వు చదువుకోలేదుగా పట్నంలో ఎలా వుంటావే!

సుబ్బులు :— ఆహా! పట్నంలో వున్నవాళ్ళందరికి చదువొచ్చా యేవిఁటి!

గోపి :— ఎందుకు రాదు! అక్కడ రిక్షావాడు కూడా పేపర్ చదువుతాడు. అనేక విషయాలు తెలుసుకుంటాడు.

సుబ్బులు :— యేవిఁటి! రిక్షావాడా! పేపర్ చదువుతాడా!

జగన్నాథం :—అంతేకాదమ్మా. అక్కడ పెద్దపెద్ద వాళ్ళుకూడా చదువుకుంటారు.

గోపి. :— అవును వుద్యోగస్తులుకూడానైటు కాలేజీల్లో చేరి పై చదువులు చదువుకుంటారు! అన్నట్టు నీకు నైట్ కాలేజీఅంటే తెలియదు కదూ.... అదే.... నువ్వు చదువుకోలేదుగా....

సుబ్బులు :— (కోపంగా) ఎందుకు చదువుకోలేదు! కావాలంటే మా పిలక పంతుల్ని అడుగు.

గోపి :— (నిరసనగా) ఆ! చదివావ్‌లే! వానాకాలం చదువు! నువ్వు చదివింది అయిదో క్లాసేగా!

సుబ్బులు :— మరి మావూళ్ళో అంతవరకేగామ్మా వుంది (ఏడుపు గొంతు)

గోపి :— (ఆమె గొంతుని అనుకరిస్తూ) మరి కరణంగారమ్మాయి ఎలా చదివిందమ్మా? ఆ పిల్లా నీఈడుదేగా.

సుబ్బులు :— ఆఁ.... వాళ్ళ మావయ్యగారింట్లో వుంది. చదువుకుంటోంది.

గోపి :— పోనీ నువ్వూ అలాగే చదువుకోవచ్చుగా! చిన్న మావయ్య ఎన్నిసార్లు బతిమాలాడు నిన్ను అక్కడి కొచ్చి చదువుకోమని!

సుబ్బులు :— (విసుగ్గా) అబ్బబ్బ! ఈ వెధవ చదువులు నాకొద్దుబాబూ అసలు మా బామ్మేవంటుందో తెలుసా?.... ఆడపిల్లలికి అంతేసి చదువులు వుండకూడదు అవి! అందుకే నాకు చదువంటే చిరాకు ఓ....

దుర్గ : విన్నావుగా నాయనా! ఇదీ వరస!.... అసలు దీన్నిలా తయారు చేసింది మీ అమ్మమ్మకాదూ! అక్షరం ముక్క రాదుగానీ, అల్లరిలో మాత్రం మగపిల్లల్ని మించిపోయింది! ఎవరు చేసుకుంటారోగానీ....

సుబ్బులు :— (విసుగ్గా) ఎవరో ఏవిఁటే.. నన్ను చేసుకొనేది బావేగా.

దుర్గ :— (నిట్టూరుస్తూ) హూఁ! ఎవరు చెప్పగలరు? ఎవరి మనసులు ఎలా మారతాయో!... అదే నువ్వు చదువుకుంటే...

సుబ్బులు :— (విసుగ్గా) పోమ్మా! మళ్ళీ చదువు గోల మొదలెట్టావ్! ఓ సినిమాలో, హీరోయిన్ చదువురాని హీరోతో ఏవందో తెలుసా? (కర్ణకఠోరంగా) చదువురాని వాడవని దిగులు చెందకు.. మనిషి మదిలోని మమతలేని చదువులెందుకు....

గోపి :— తల్లీ! నీ పాట ఆపు భరించలేను! (కంగారుగా)

సుబ్బులు :— (నవ్వి) అందుకే ఇంకెప్పుడూ చదువుమాట ఎత్తకండి. నేను చదవనంటే చదవను! అంతే!

దుర్గ :— (విసుగ్గా) అంతేలే తల్లీ! ఏ నాడు నా మాట విన్నావు గనక!

(అయిదవ రంగము)

(గోపి కూర్చొని ఏదో ఆలోచిస్తూంటాడు సుబ్బులు హడావిడిగా వస్తుంది)

సుబ్బులు :— (వస్తూ) బావా! బావా!....

గోపి :— (నవ్వుతూ) ఏవిఁటి సుబ్బులూ ఏవిఁటి హడావిడి?

సుబ్బులు :— బావా? నీకు ప్రేమించడం ఒచ్చా?

గోపి :— (తృళ్ళిపడి) ఏవిఁటే... ప్రేమించడమా?...

సుబ్బులు :— ఊఁ! ప్రేమించడమే బావా! ఒచ్చా?

గోపి :— ఉఁ హుఁ!....

సుబ్బులు :— (ఆశ్చర్యంగా) ఏవిఁటీ నీకు ప్రేమించడం రాదూ?

గోపి :— ఉఁ హూఁ రాదు!

సుబ్బులు :— అయ్యో! పాపం! ఎలా బ్రతుకుతావో ఏవిఁటో! నిన్ను చూస్తే నాకు జాలేస్తోంది బావా!



గోపి :— ఏవిఁటి నన్ను చూసి జాలేస్తోందా ! ఎందుకు ?

సుబ్బులు :— ప్చ్ ! లేకపోతే ఏవిఁటి బావా ! ఏదీఁ చదువుకోని నాకే ప్రేమించడం తెలుసే !.... పెద్ద చదువులు చదువుకున్న వాడివి !... అందులోనూ డాక్టర్‌వి నీకు ప్రేమించడం రాదంటే.... జాలిపడకేం చెయ్యను. పోనీలే ! ఎలాగోలా నేనే నేర్పుకుంటాను.... నేర్చుకుంటావా ?

గోపి :— ఏవిఁటి ?

సుబ్బులు :— అదే బావా ! ప్రేమించడం....

గోపి :— నీకొచ్చా ?....

సుబ్బులు :— ఓ ! ప్రేమించి చూపిస్తనా (అతన్ని పట్టుకోబోతుంది).

గోపి :— (కంగారుగా) తీర్చి చాల్లే ! ప్రాక్టికల్స్ ఒద్దు ! ఓ అన్నట్టు నీకు చదువు రాదుకదూ ? చేసి చూపించనక్కర్లేదు ! చెప్పు చాలు !

సుబ్బులు :— (నిరాశగా) ఓస్ ! చెప్పడమేఁనా ? ఊఁ ! పోన్లే ! చెప్తాను. జాగ్రత్తగా విను !.... ప్రేమించుకోవడమంటే హీరో హీరోయిన్లు చెట్టాపట్టాలేసుకుని పరుగులెడుతూ పాటలు పాడాలి. రోడ్లమీద, పార్కుల్లోను పడి పడి దొర్లాలి ! ఇంకా.... అన్నట్టు బావా ! నువ్వు సినిమాలు చూస్తావా ?....

గోపి :— ఆఁ ! చూస్తాను ! ఏం ?

సుబ్బులు :— అలా అయితే-ప్రేమించడం నీకూ తెలిసుండాలే ! ఈ ప్రేమలు అన్ని సినిమాల్లోనూ వుంటాయి. నేను పట్నంలోనూ మా బాబాయి వాళ్ళింటికెళ్ళినప్పుడు రోజుకి మూడు సినిమాలు చూస్తాను.... అందుకే నాకు ప్రేమించడం బాగా తెలుసు !

ఆఁ ఇంతకీ నాగేశ్వరరావు జయప్రదలా ప్రేమించుకుందామా.... లేకపోతే శోభన్‌బాబు, జయసుధలా ప్రేమించుకుందామా. అదీ కాకపోతే రామారావు - ఎన్. టి. రామారావు.... అదే బావా మన రాష్ట్రపతి....

గోపి :— (వ్యంగ్యంగా) రాష్ట్రపతి కాదు ! ముఖ్యమంత్రి !

సుబ్బులు :— ప్చ్ ! ఏదో ఒకటిలే ! ఆఁ.... రామారావూ శ్రీదేవిలా ప్రేమించుకుందామా ?

గోపి :— నీ ఇష్టం ! నీకెవరంటే ఇష్టమో వాళ్ళలా చెయ్యి !

సుబ్బులు :— (ఉత్సాహంగా) బావా !.... నాకు.... నాకు సుత్తివేలంటే చచ్చే ఇష్టం బావా !

గోపి :— (చేదు తిన్నట్టు) సుత్తివేలా ?

సుబ్బులు :— అయ్యో ! నీకు ఇష్టంవున్నట్టు లేదు.... పోనీ.... జయమాలిని సిల్క్‌స్మిత.... అనూరాధల్లా....

గోపి :— ఛీ ! ఛీ !

సుబ్బులు :— అబ్బబ్బ ! వట్టాన నీకెవరూ నచ్చరు బావా ! ఎలాగో ఏవిఁటో నీతో వేగడం ! ఊఁ ! పోనీలే ఎలాగోలా నేర్పుతాను ! లే ! ముందు లేచి నా చేతులు పట్టుకో !

దుర్గ :— (లోపల్నించి) అమ్మా ! సుబ్బులూ !

సుబ్బులు :— (బిగ్గరగా).... ఆఁ ! ఏవిఁటమ్మా ?

దుర్గ :— ఓసారిలా రావే !....

సుబ్బులు :— (విసుగ్గా) అబ్బ ! వుండమ్మా ! బావా నేనూ ప్రేమించుకుంటున్నాం !

గోపి :— (కంగారుగా) ఛ ! ఛ ! అత్తయ్య పిలుస్తోంది వెళ్ళు సుబ్బులూ ?

సుబ్బులు :— మరి ప్రేమించుకోవడమో ?....

గోపి :— సాయంత్రం మన మామిడితోటకెళ్దాం !

సుబ్బులు :— (ఉత్సాహంగా) అవును బావోయ్ ! తోటల్లో ప్రేమించుకుంటేనే ఎంచక్కా అచ్చం సినిమాల్లో హీరో హీరోయిన్లలా వుంటాం ! అయినా బావా ! ప్రేమించడం నీకూ తెలుసే ! వుండు ! అమ్మెందుకు పిలుస్తోందో కనుక్కొస్తాను.

గోపి :— అలాగే వెళ్ళు (నుదుటి మీద చిరాగ్గా కొట్టుకుంటాడు).

సుబ్బులు :— (వస్తూ) బావా ! ప్రేమ ..

గోపి :— ప్రేమ సరేగానీ.... అత్తయ్య ఎందుకు పిల్చింది ?

సుబ్బులు :— వంటయింది బావని భోజనానికి పిలు అంది. సరేగానీ బావా ! అమ్మ వడ్డించేలోగా ఏవైనా కబుర్లు చెప్పుబావా !

గోపి :— (నవ్వి) ఏం చెప్పనూ ?

సుబ్బులు :— ఏవైనా సరే ! మీ కాలేజీ గురించి. అక్కడ మీ స్నేహితుల గురించి.. అన్నట్టు బావా ! మీ కాలేజీలో ఆడపిల్లలుంటారా ?

గోపి :— ఆ ! బోల్డుమంది.

సుబ్బులు :— అందంగా వుంటారా ?

గోపి :— ఆ ! ..

సుబ్బులు :— (ఏడుపు గొంతుతో) చాలా అందంగా వుంటారా ?

గోపి :— అంతేకాదు సుబ్బులూ ! అపర సరస్వతులు, చదువంటే ప్రాణం పెడతారు.... ఆహా ! ఆ అందం.... ఆ చందం.... ఆ చదువు.... ఆ....

సుబ్బులు :— ఛ ! ఆపు ! (కోపంగా) వాళ్ళు నాకన్నా అందంగా వుంటారా ?

గోపి :— ఆ ! ఏం ?

సుబ్బులు :— (బిగ్గరగా) అమ్మా !....

దుర్గ :— (వస్తూ) ఏవిఁటే ?

సుబ్బులు :— బావ చూడమ్మా !.... వాళ్ళ కాలేజీలో నాకన్నా అందమైన అమ్మాయిలున్నారంటున్నాడు ! అంటే నేను అందంగా లేననేగా ?



గోపి :— (వ్యంగ్యంగా) ఆ వున్నావ్‌లే మహా అందంగా! ఎందుకు వాసనలేని పువ్వెంతో నువ్వంత!

దుర్గ :— అదేవిటన్నాయనా! దానికి మాత్రం చదువుకోవాలని లేదూ? అక్షరం ముక్క వంట పట్టందే అది మాత్రం ఏం చేస్తుందయ్యా!

గోపి :— (విరాగ్గా) ఇదిగో అత్తయ్యా! నేను డాక్టర్ని! పది మందిలో గౌరవంగా తిరగాల్సిన వాణ్ణి! అక్షరం ముక్క రాని ఈ మొద్దును చేసుకుంటే నా పరువువేం గాను! ఈ సంగతి మీకు మాత్రం తెలియదా?

సుబ్బులు :— (ఏడుపు గొంతుతో) అంటే... అంటే నువ్వు నిజంగానే నన్ను పెళ్ళి చేసుకోవా?

గోపి :— చేసుకోను! చేసుకోను! చేసుకోను! చాలా?

దుర్గ :— అవేం మాటలు గోపీ!

గోపి :— లేకపోతే ఏవిటత్తయ్యా! నేను చదువుకున్నవాణ్ణి చదువుకున్న భార్య కావాలనుకోవడం తప్పా? అందుకే నేనెప్పట్నించో చెప్తున్నాను. సుబ్బులికి చదువు చెప్పించండి అని. విన్నారా?

దుర్గ :— (దిగులుగా) నేను మాత్రం ఏం చెయ్యనయ్యా! అది వినందే! పోనీ - ఆ చదువేవిటో నువ్వు చెప్పి చూడు వింటుందేమో. మొన్నెప్పుడో బావ దగ్గర ఇంగ్లీషు నేర్చుకుంటానంది.

గోపి :— (విసుగ్గా) ఆ! వుద్ధరించింది! ఇదిగో అత్తయ్యా! నా మనసేం బాగాలేదు.... నేనలా బైటికెళ్ళొస్తాను!.... (విసురుగా వెళ్ళి పోతాడు. అప్పుడే జగన్నాధం వస్తాడు)

జగన్నాధం :— (కంగారుగా) ఏవిటి! దుర్గా! గోపి అంత విసురుగా వెళ్ళిపోతున్నాడేవిటి? కొంపదీసి అమ్మాయి ఏం అన్లేదు కదా?

దుర్గ :— (బాధగా) ఏవిటో అంతా అయోమయంగా వుంది! అతనికేమో చదువుకున్న పిల్లని చేసుకోవాలనుంది! ఇదేమో చదువంటే మండిపడుతుంది. ఎంత చదువు మనం చెప్పించినా ఇష్టంలేని పెళ్ళి కట్టివదేసి చెయ్యలేం కదా! ఇదంతా చూస్తుంటే మా అన్నయ్య రాసిన సంగతి నిజమే అనిపిస్తోంది!

జగన్నాధం :— (దిగులుగా) అవును దుర్గా! నువ్వంటే నేనమ్మలేదుగానీ.... పట్నంలో ఇద్దరు ముగ్గురు పిల్లల్నికూడా చూశాట్ట!

దుర్గ :— (ఆదుర్దాగా) ఎవరన్నారు?

జగన్నాధం :— మన పంతులుగారు.

సుబ్బులు :— (కోపంగా) అబద్దం! బావకి నేనంటే చాలాఇష్టం. మాసుబ్బులు ఎంచక్క ముద్ద బంతి పువ్వులా అందంగా వుంటుందని ఎన్నోసార్లన్నాడు.

జగన్నాధం :— (నిట్టూరుస్తూ) నిజవేనమ్మా! కానీ.. అవన్నీ జరిగిపోయిన రోజులు!

సుబ్బులు :— (ఏడుపు గొంతుతో) ఏం కాదు! అన్నీ అబద్దాలే! బావ నన్ను తప్ప ఇంకెవర్నీ చేసుకోడు. (గోపీ వస్తాడు) అదిగో బావ వచ్చాడు. కావాలంటే అడగండి! బావా! నన్ను కాదని పట్నంలో ఇంకో అమ్మాయిని చేసుకుంటావా?

గోపి :— (గంభీరంగా) సారీ సుబ్బులూ! ఇప్పుడేం చెప్పలేను!

చంద్రి :— (లోపల్నించి) అమ్మగోరూ!

దుర్గ :— ఏవిటే?

చంద్రి :— ఓ సారిలా రండి.

దుర్గ :— పానకంలో పుడకలా మధ్య నీగోలేవిటే! (వెళ్తుంది భర్తకూడా అనుసరిస్తాడు)

గోపి :— సుబ్బులూ!

సుబ్బులు :— ఊఁ!

గోపి :— ఓ మాటడుగుతాను ఏం అనుకోవుగా!

సుబ్బులు :— అనుకోను అడుగు!

గోపి :— మాలతి గురించి నీ అభిప్రాయం ఏమిటి?

సుబ్బులు :— (ఏడుపు గొంతుతో) ఇప్పుడు దాని గొడవెందుకు?

గోపి :— (తన్మయత్వంగా) చాలా అందంగా వుంటుంది కదూ.

సుబ్బులు :— (కోపంగా) దాని బొంద! పుట్టి మునిగిమొహం అదీను! అచ్చు కొరివిదయ్యంలా వుంటుంది!

గోపి :— కానీ.... చాలా తెలివిగల అమ్మాయి!

సుబ్బులు :— (కోపంగా) అబ్బ! నువ్వేం చూశావేం దాని తెలివి!

గోపి :— ఛ! ఛ! నీకు జలసీ!

సుబ్బులు :— జలసీనా? అంటే ఏవిటి బావా?

గోపి :— ఓ! నీకు చదువు రాదుకదూ....

సుబ్బులు :— (కోపంగా) ఇదిగో బావా! మాటకు ముందు నీకు చదువు రాదుకదూ - నువ్వు చదువుకోలేదుకదూ అనకు! నాకు చిరాకు... ఆఁ!.... ఇంతకి జలసీ అంటే ఏవిటి?

గోపి :— జలసీ అంటే అసూయ!

సుబ్బులు :— ఏవిటి! అసూయా! దాన్ని చూసి నాకసూయా (పగలబడి నవ్వి) దానికి ఒక్క పట్టు పరికిణీకూడా లేదుబావా! నాకు. 20 పట్టు పరికిణీలున్నాయి?

గోపి :— (కోపంగా) ఇంకేం అవి చూసుకుని మురిసిపో! (పంటింటిలోకి వెళ్తాడు. సుబ్బులు దిగులుగా కూర్చుంటుంది)

చంద్రి :— అమ్మాయిగారూ (వస్తూ)

సుబ్బులు :— (దిగులుగా) చద్రీ!.... బావేవన్నాడో చూశావ్‌టే!

చంద్రి :— ఏవన్నారమ్మాయిగోరూ?

సుబ్బులు :— ఆ మాలతిని చూసి నాకు అసూయట!

చంద్రి :— ఏవిటి అన్నారూ? అనేశారూ.... నాకు తెల్చమ్మాయిగోరూ! ఏదో ఓ రోజిలా అంటారని అనుకుంటానే వుండా!

సుబ్బులు :— నీకెలా తెలుసే (ఏడుపు గొంతుతో)

చంద్రి :— నాకన్నీ తెల్చమ్మాయిగోరూ! అంతేనా మొన్న మద్దినాల మన గోపీ బాబుగోరూ, ఆ మాలతమ్మ రావులోరి గుడికాడ ఒకటే ఇకఇకలు పకపకలు!

సుబ్బులు :— ఏవిటే - ఇదంతా నిజవేనా! (ఏడుపు గొంతుతో)

చంద్రి :— అయ్యో! మీకాడ అబద్దాలాడతానా అమ్మాయిగోరూ! సత్తె పెమానంగా సెప్తున్నాను. అళ్ళ యవ్వారం నాకే వాత్తరం నచ్చలేదు ... ఇద్దరూ ఒకల్నొకల్లు దొంగసూపులు మీరేవైనా అనుకొండమ్మా!.... నాకు మాసెడ్డ కోపం వచ్చేసినాది! అదిగో అమ్మాయిగోరూ - నేను సెప్పినట్లు గోపీ బాబుగోరికి సెప్పేరు ... అరుగోవత్తన్నారు : నే పోతన్నా (వెళ్ళిపోతుంది) (గోపీవస్తాడు)

సుబ్బులు :— (జాలిగా) బావా !.....

గోపీ :— (సీరియస్‌గా) ఏవిఁటి సుబ్బులూ !

సుబ్బులు :— బావా! నేను చదువుకుంటాను బావా! నువ్వెంతవరకు చదువు కోమంటే అంతవరకు చదువుకుంటాను పూజారిగారి జానకిలా ప్రైవేటుగా ఎమ్మే పాసవుతాను !

గోపీ :— (ఆనందంగా) నిజవేఁనా ? మాట తప్పవుగా ?

సుబ్బులు :— ఛ ! ఛ ! సుబ్బులు అల్లం పిల్లేగాని... అబద్ధాలకోరు మాత్రం కాదు బావా ! కావాలంటే ఒట్టేస్తాను. నిజం ! ఒట్టు ! సరస్వతీదేవి తోడు ! కానీ నాకు చదువు మాత్రం నువ్వే చెప్పాలి బావా !

గోపీ :— (ఉత్సాహంగా) ఓ ! అలాగే !.. కానీ. రేపు అమ్మమ్మ వచ్చి ఆడపిల్లలకి చదువెందుకు అంటే ?

సుబ్బులు :— (కోపంగా) చచ్చినా విన్ను. అసలు బామ్మ మాట వినకుండా వుండేనే బావుండేది. ఎంచక్కా కరణంగారమ్మాయిలా పెద్ద చదువుల్లో వుండేదాన్నీపాటికి.

గోపీ :— (అనునయంగా) పోనీలే సుబ్బులూ ! పట్టుదలంటూ వుండాలే గానీ ... ఏదైనా సాధించచ్చు ! చదువు ఇవాళే మొదలు పెడదామా ?

సుబ్బులు :— (ఉత్సాహంగా) అలాగే ! పుస్తకాలు తెచ్చుకోనా ?

గోపీ :— ఆఁ హుఁ ! హు ! ఒద్దు ! ముందు చిన్నచిన్న ప్రశ్నలు వేస్తాను. వాటికి చక్కగా జవాబు చెప్పాలి ! సరేనా ?

సుబ్బులు :— ఓ ! అలాగే ! అడుగు !

గోపీ :— సరే ! ముందు చరిత్రలో కొన్ని ప్రశ్నలు వేస్తాను. నీ కెంత వరకు తెలుసో చెప్పు ! ఆఁ .. నూర్జహాన్ ఎవరి భార్య ?

సుబ్బులు :— (తేలిగ్గా) నూర్జహానా ? . ఛీ ! ఇంకా దానికి పెళ్ళే కాలేదు బావా ?

గోపీ :— (ఆశ్చర్యంగా) ఏవిఁటీ పెళ్ళి కాలేదా ?

సుబ్బులు :— మరయిందేవిఁటి.. పెళ్ళవగానే మా బాబాయి వాళ్ళింటో పని మానేస్తానంది. అదింకా పని చేస్తూనే వుంది బావా !

గోపీ :— చచ్చాం !.... ఆ నూర్జహానా ? . . సరేలే ! పోని ... అక్బర్, జహంగీర్ బాదుషాలు తెలుసా ?




సుబ్బులు :— భలే వాడివే బావా అదే తెలియదా ?.... అవంటే నాకు చచ్చే ఇష్టంకూడాను బావోయ్ ! వాటితోపాటు బందరు లడ్డూలు కూడా ఇష్టమే !

గోపీ :— (చిరాగ్గా) అవును లడ్డూలా గుండ్రంగా వున్నావు కదూ అందుకే అవంటే ఇష్టం ! ఛ ! ఛ ! తిండియావ తప్ప మరోటి లేదు.

సుబ్బులు :— (బిక్క మొహంతో) అదికాదు బావా ! అగ్గరీలు, జాంగ్రీలు....

గోపీ :— (కోపంగా) నాఖర్మం ! నా పిండాకూడు !....

సుబ్బులు :— (ఏడుపు గొంతుతో) అలా కోప్పడకు బావా !.... నాకేడుపొస్తుంది.

గోపీ :— అంత పన్చెయ్యకు తల్లీ !... పోనీ మరొకటడుగుతాను చెప్పు ! శివాజీకి పిల్లలెందరు ?

సుబ్బులు :— (ఆనందంగా) అది ! అలా అడుగు ! శివాజీకి చాలామంది పిల్లలున్నారు బావా ! .. వాళ్ళలో ఒకతను సినిమాల్లోకూడా యాక్ట్ చేస్తున్నాడు. బావా ! కాస్త లావుగా వుంటాడుగానీ ... అబ్బ ! భలేగా చేస్తాడు యాక్టింగ్ !

గోపీ :— శివాజీ కొడుకు. సినిమాల్లో వేస్తాడా ?.... లావుగా వుంటాడా ! ఛ ! ఫో !.

సుబ్బులు :— నిజం బావా ! ఒట్టు సరస్వతీదేవి తోడు ! కావాలంటే . కరణంగారింటో విజయ చిత్రుంది . తెచ్చిచూపించనా ?

గోపీ :— (కోపంగా) ఇదిగో ! సుబ్బలక్ష్మీ ! . నీకూ, నీ చదువుకీ ఓ దణ్ణం తల్లీ ! నీకు చదువు చెప్పడం కన్నా ! .. అదిగో ఆ గోడకి చెప్పడం తేలిక !

సుబ్బులు :— (గునుస్తూ) అదికాదు బావా !... నేనేం చెప్పినా వినుక్కుం టున్నావ్ ? ఎలా చెప్పను మరి !..

గోపీ :— (అనునయంగా) లేకపోతే ఏవిఁటి సుబ్బులూ ! నేను రాజుల గురించి మాట్లాడుతుంటే నువ్వు తిండి గురించి మాట్లాడు తున్నావ్ ! నేను శివాజీ గురించి మాట్లాడుతుంటే.... నువ్వు శివాజీ గణేశన్ గురించి మాట్లాడుతున్నావ్! నూర్జహానంటే పనిపిల్ల అంటున్నావ్ ! నీతో ఎలా చావను ?

సుబ్బులు :— (అమాయకంగా) ఎలాగోలా చావు బావా !

గోపీ :— (తృళ్ళిపడి) ఆ ?...

సుబ్బులు :— (నవ్వేసి)... ఆఁ హాఁ ! నా వుద్దేశం ..

గోపీ :— ఊఁ ! సరేలే !... పాత చరిత్ర ఒదిలేసి ప్రస్తుత చరిత్ర తెలుసుకుందాం....

సుబ్బులు :— సరే !....

గోపీ :— నవంబర్ 14 ఒక మహానుభావుడి పుట్టిన రోజు ! ఆ మహనీయుడెవరు ?

సుబ్బులు :— (ఆలోచించి) మహనీయుడు.... మహానుభావుడు ... ఆఁ ! మన ప్రెసిడెంటుగారే బావా !

గోపీ :— (బిక్క మొహంతో) ఏవిఁటి మన ప్రెసిడెంటుగారా

సుబ్బులు :— అవును బావా ! కచ్చితంగా ఆయనే !

గోపీ :— (నిరసనంగా) ఎలా తెలుసు నీకు ?

సుబ్బులు :— ఎలా తెలుసేవిటి బావా! మరి అందరు అయన్నేగా మహానుభావుడు. మహనీయుడు అంట-రు.

గోపి :— (ఓపిగ్గా) ఛ! అలాకాదు సుబ్బులూ!.... నవంబర్-14 చాచా నెహ్రూ పుట్టిన రోజు. ఆ రోజు బాలల దినంగా పరిగణించి స్కూల్స్‌లో పిల్లలకి స్వీట్స్ పంచుతారు.

సుబ్బులు :— అవును బావోయ్! మర్చిపోయాను సుమా! మా స్కూల్లోను పంచుతారు స్వీట్స్!

గోపి :— అవునా మరి! - చాచా నెహ్రూ అంటె ఎవరు?

సుబ్బులు :— చాచా . నెహ్రూ అంటే - చాచా . చాచానెహ్రూ అంటే... ఆ, గాంధీతాత!

గోపి :— (నెత్తిన చేతులు పెట్టుకుని) హతోస్మి!

సుబ్బులు :— (ఆతృతగా) ఏం బావా కాదా?

గోపి :— ఉఁ హూఁ! పోనీ నీకు రాజీవ్‌గాంధీ తెలుసా?

సుబ్బులు :— ఓ! ఇప్పుడు మనదేశానికి పెద్ద అయనేగా?

గోపి :— అమ్మయ్య! కొంత వరకు కరెక్టే! అయన్నే ప్రధానమంత్రి అంటారు!

సుబ్బులు :— ఓహో!

గోపి :— ఆయన తాతగారే చాచానెహ్రూ అంటే!

సుబ్బులు :— (దిగులుగా) అలాగా! ప్చ్! ఏవిటో బావా! చిన్నప్పట్నించి చెట్లు చేవలు ఎక్కడం చెర్లోపడి ఈతలు కొట్టడం, కనిపించిన వాళ్ళందరికీ పేర్లుపెట్టి ఏడిపించటం. వాళ్ళు హడలిపోతుంటే నడుం మీద చెయ్యిపెట్టుకుని పగలబడి నవ్వడం లాంటివి నేర్చుకున్నానుగానీ చదువు ప్రతిమనిషికీ అవసరం అని ఒక్కనాడూ అనుకోలేదు బావా!

గోపి :— డోంట్‌వర్రీ సుబ్బులూ! నీ చదువు గురించి నేను చూసుకుంటా నుగా.... ఎలాగైనా నిన్ను గ్రాడ్యుయేట్‌ని చేస్తాను

సుబ్బులు :— (విరక్తిగా) ఎప్పటికి బావా?

గోపి :— ఎప్పటికైనా సరే!

సుబ్బులు :— ఎంత నమ్మకం బావా!

సూరమ్మ :— అమ్మా! సుబ్బులూ

సుబ్బులు :— (ఆనందంగా) అరె! బామ్మొచ్చేసిందే రా! బామ్మా! రా! అమ్మా! బామ్మొచ్చిందే! ... (దిగ్గరగా)

దుర్గ :— రండత్తయ్యా! కమలావాళ్ళంతా బావున్నారా?

సూరమ్మ :— ఆ! అంతా బానే వున్నారమ్మా! ఏదో యాత్రలవంకతో వెళ్ళి కూతురింట్లో ఇన్నాళ్ళున్నందుకు చచ్చే సిగ్గేసిందనుకో!

గోపి :— ఏం అమ్మమ్మా! కూతురేగా అమ్మ సరిగ్గా చూడలేదా లేక పోతే నాన్నేమైనా అన్నారా?

సూరమ్మ :— అదెందుకడుగుతావ్‌లే నాయనా! .. అంతా నాభ్రమ? ఎంతైనా పరాయమ్మ కన్నబిడ్డ నా బిడ్డ అవుతాడా? ఏనాటికైనా మంచో చెడో కోడళ్ళు చూడాలేగానీ కూతుళ్ళేం చూస్తారు చుట్టం చూపు తప్ప?

గోపి :— (ఆశ్చర్యంగా) అదేవిటమ్మమ్మోయ్! ప్లేటు మారింది!

సూరమ్మ :— అంతేకాదు నాయనా! అంతకు ముందు ఆడపిల్లలు పుడితే తిట్టిపోసేదాన్నా! మగాడేదో వుద్ధరిస్తాడని! ఆడైనా, మగైనా వాళ్ళ స్వభావాన్నిబట్టి వుంటుందిగానీ పుటకని బట్టి వుండదని తెలుసుకున్నాను ఈ ప్రయాణం నాకు మంచి గుణపాఠమే నేర్పింది.

జగన్నాథం :— (వస్తూ) నీలో ఎంత మార్పొచ్చిందమ్మా! ఇప్పుడు నాకెంత ఆనందంగా వుందో తెలుసా?

సూరమ్మ :— అవున్నాయనా! వయసు నేర్పలేని పాఠాలు అనుభవం నేర్పింది ఇంకా నేనెక్కడికీ పోను! ఆఖరికి కమలింటికైనా సరే!

జగన్నాథం :— (నవ్వి) మధ్యన అదేం చేసిందమ్మా!

సూరమ్మ :— అదంతా ఓ కథలే నాయనా! ... నాలుగు రోజులున్నానో లేదో ఒకటే సూటీపోటి మాటలు! అతడైతే పరాయివాడు! దానికి నేను కన్నతల్లి కాదా! ఎన్ని మాటలంది! ఎన్నిమాటలంది! (కళ్ళు తుడుచుకుంటుంది).

చంద్రి :— (ఆనందంగా వస్తూ) ఆరె! పెద్దమ్మగోరొచ్చేశారే! అమ్మగోరూ! మీర్లేపోతే ఏం బాలేదు. ఇంకెప్పుడూ ఎల్లమాకండి!

సూరమ్మ :— (నవ్వి) ఇంకెక్కడికీ వెళ్ళనే చంద్రి!

చంద్రి :— అమ్మగోరూ! మనమ్మాయిగోరు పెద్దసదూలు సదివేస్తున్నారు తెల్సా?

సూరమ్మ :— ఏవిటే? నిజవేఁ? చదువంటే మండి పడేపిల్ల చదువు నేర్చుకుంటోందా?



దుర్గ :— అవునత్తయ్యా: మనగోపియే చెప్తున్నాడు.

సుబ్బులు :— (భయంగా) బావ్వా! నన్ను చదువుకోవద్దంటావా ?

సూరమ్మ :— అనను తల్లీ! ఆడదానికూడా చదువు ముఖ్యమని తెలుసుకున్నాను. అక్కడ పట్నంలో మీ బాబాయి ఇంటి దగ్గర నీ అంత పిల్లలు పుస్తకాలు పుచ్చుకుని స్కూల్ కెళ్తుంటె ఎంత ముచ్చటగా వుందనుకున్నావ్! నా తల్లి చదువు నేను పాడు చేశానని తెగ బాధపడి పోయాననుకో!

దుర్గ :— పదండత్తయ్యా! ఎప్పుడు బొంచేశారో ఏవిటో స్నానం చేసి బోంచేద్దురుగాని.

సూరమ్మ :— ఊఁ! పదా! . . (వెళ్తుంది. సుబ్బులు, గోపీ తప్ప అంతా అనుసరిస్తారు)

సుబ్బులు : (తలవంచుకొని) బావా!

గోపీ :— ఏవిటి సుబ్బులూ!

సుబ్బులు :— నేనో మాట చెప్తాను. వింటావా!

గోపీ :— ఏవిటి సుబ్బులు! ఇవాళ నీ ధోరణి వింతగావుంది!

సుబ్బులు :— నువ్వు నువ్వు మరో అమ్మాయిని పెళ్ళి చేసేసుకో బావా!

గోపీ :— (తృళ్ళిపడి) సుబ్బులూ!

సుబ్బులు :— అవును బావా! . నువ్వు నీలాగే బాగా చదువుకున్న అమ్మాయిని చూసిచేసుకో!

గోపీ :— (నిష్ఠూరంగా) నువ్వేనా ఈ మాటనేది? నా పరిసరాలకి ఏ ఆడపిల్ల వచ్చినా రక్కేస్తానని శపథం చేసిన నువ్వేనా నన్ను మరో అమ్మాయిని చేసుకోమంటున్నది?

సుబ్బులు :— (బాధగా) నేనే బావా! . నిన్ను ప్రాణాధికంగా ప్రేమించే పిచ్చి సుబ్బుల్నే బావా! నీకు చదువంటే ఇష్టం! నేనాస్థితికి ఎదగడం అతికష్టం! అసలు సంభవం కాదేమోకూడా! నా కోసం నీ ఆశల్ని చంపుకోవద్దు బావా! .

గోపీ :— (అనునయంగా) పిచ్చి సుబ్బులూ! అసంభవం అని ఎలా అనుకుంటున్నావ్? నీకు పురాణాలు తెలుసుగా? నిరక్షరకుక్షి అయిన వాల్మీకి, అంతటి మహాకవి ఎలా అయ్యాడు?

సుబ్బులు :— అది పురాణయుగం బావా! (విరక్తిగా)

గోపీ :— నిజమే! కాని పురాణయుగం నాటికన్నా మానవుడు ఎంతో ప్రగతి సాధించాడు. చంద్రమండలం మీద అడుగు పెట్టాడు.




హిమాలయాలు తేలిగ్గా ఎక్కేశాడు! అందుకే నా సుబ్బులుకి ఏదైనా నేర్పగలను. నాకా నమ్మకం వుంది.

సుబ్బులు :— కానీ, నాకులేదు బావా! నేను బాధపడ్డా సరే! నా బావ సుఖంగా వుండాలి. అదే! అదే నేను కోరుకొనేది. (ముఖం రెండు చేతుల్లోనూ దాచుకుంటుంది)

అందరూ :— (వస్తూ) చప్పట్లుకొడతారు

సుబ్బులు :— (తుళ్ళిపడి) ఏమిటీ?

గోపీ :— (నవ్వి) పిచ్చి సుబ్బులూ! నాకు లోకంలో అందరికన్నా ఆఖరికి ఆ చదువుల సరస్వతికన్నా కూడా నువ్వంటేనే ఇష్టం! నిన్ను కాక మరొకర్ని కల్లోకూడా తలవలేదు! తలవను!

సుబ్బులు — బావా!. (ఆశ్చర్యంగా)

దుర్గ :— (నవ్వి) అవునమ్మా! బావ ముందు చెప్పినదంతా అబద్ధం!

సుబ్బులు — అంటే?

జగన్నాధం :— మరేంలేదమ్మా! ఎంతచెప్పినా నువ్వు చదువుకోవడం లేదని ఇంత నాటకం ఆడాం! బావ ఎవర్నో చేసుకుంటానని అననూ లేదు. నిన్ను చేసుకోనని అంతకన్నా అనలేదు!

దుర్గ :— అవును సుబ్బులూ! మీ మావయ్య ఉత్తరం రాయడం కూడా అబద్ధమే!

చంద్రి :— అవునమ్మాయిగోరూ, గోపీబాబుగోరూ, ఆ మాలతమ్మ దొంగ సూపులు సూసుకుంటారని సెప్పేనే అదీ అబద్దవే!

సుబ్బులు — అంతా మోసం

సూరమ్మ :— అంతా కలిసి నా తల్లిని ఏడిపించారా? నేనూళ్ళో లేకుండా చూసి హన్నా!

కమల :— (ప్రవేశిస్తూ) నువ్వు వూళ్ళో లేవుకనకే అందరి ఆటలూ సాగాయి! మీ మనసులూ మారాయి!

సూరమ్మ :— (ఆశ్చర్యంగా) ఆసి కమలం నువ్వెప్పుడొచ్చావే?....

కమల :— నేన్నీ వెనకేవచ్చానమ్మా - నన్ను క్షమించు!

సూరమ్మ :— (అయోమయంగా) ఏవిటే?

కమల :— మరేంలేదమ్మా! నువ్వెప్పుడూ కూతుళ్ళు చూసినట్టు కోడళ్ళు చూడరు అనేదానివికదా! అందుకే నీకాస్త అనుభవం రావాలని నేనూ, మీ అల్లుడుగారూ కాస్త కఠినంగా ప్రవర్తించాం! అది నిన్ను బాధపెట్టడవే అనుకో! కానీ వదినల్ని నువ్వనే మాటలు వినలేక ఇలా నాటకం ఆడాం. మమ్మల్ని క్షమించమ్మా!

సూరమ్మ :— (బుగ్గలు నొక్కుకుంటూ) ఆసి మీ నాటకాలు చల్లగుండా! ఇది నీకూడా తెలుసుటే దుర్గా?

దుర్గ :— (నవ్వి) తెలుసనత్తయ్యా! నేను పరుషంగా మాట్లాడ్డం కూడా ఈ నాటకంలో ఒక భాగమే! నా మాటలకి కోపగించుకోనేనా మీ రెళ్ళింది! నన్నుకూడా క్షమించండి....

సూరమ్మ — ఆసి మీ ఇల్లు నేలకట్టా!

కాంతమ్మ :— (ప్రవేశిస్తూ) ఏవిటి సూరమ్మొదినోయ్! ఇల్లు నేలగట్టా అంటున్నావ్?

సూరమ్మ :— (ఆనందంగా) నువ్వా కాంతమ్మొదినా రావమ్మా! రా! అబ్బ ఎన్నాళ్ళయిందో మిమ్మల్నందర్నీ చూసి! ఆ రోజు నేనేదో

అన్నానని కోపంవచ్చి వెళ్ళిపోయావు అవన్నీ మనసులో పెట్టుకోకుండా మళ్ళీ వచ్చావ్! నన్ను క్షమించొదినా!

కాంతమ్మ — ఛ! ఛ! మనలో మనకి క్షమార్పణలేంటే సూరమ్మొదినా! నీ మాటలు వినిపించగానే పోయిన ప్రాణం లేచొచ్చిందనుకో వున్న పాటున పరుగెత్తుకొచ్చాను అవునూ యాత్రలు బాగా ముగిశాయా?

సూరమ్మ — ఆ! నా మొహం యాత్రలు! యాత్రలంటూ వెళ్ళానే గానీ నా ప్రాణం అంతా ఇక్కడేవుందనుకో!" అన్నట్టు కాంత మ్మొదినోయ్! మా మనవల పెళ్ళి విన్నావా?

కాంతమ్మ — ఏవిఁటీ! నిజవేఁ! (ఆనందంగా)

సూరమ్మ — అవునమ్మా! మా గోపీ కూడా ఒప్పుకున్నాడు! సుబ్బులు సరేసరి! అందుకే త్వరలో ముహూర్తాలు పెట్టించెయ్యాలను కుంటున్నాం!

కాంతమ్మ — శుభస్య శీఘ్రం!

కమల — కూర్చోండత్తా!

కాంతమ్మ — కూర్చొనడానికేంవుంది గానీ - ఇదిగో దుర్గా! మా వాడికి కట్నం ఏవిఁస్తున్నారేం? (నవ్వుతూ)

దుర్గ — (నవ్వుతూ) మా అమ్మాయే కట్నం!

గోపీ — ఈ చదువురాని మొద్దు నాకొద్దు బాబు!

సుబ్బులు — (తేలిగ్గా) ఓస్! చదువే కదా! వెధవ చదువు నాలుగు రోజుల్లో చదివి అవతల పారేస్తా!

గోపీ — (తమాషాగా) అవునవును! చదివి అవతల పారేస్తావు!

సూరమ్మ — అబ్బబ్బ! ఇంకా దాన్నేడిపించడం మానరేవఁరా! పిచ్చినన్నాసి చిక్కి సగం అయిపోయింది!

గోపీ — (వ్యంగ్యంగా) ఏవిఁటీ చిక్కిందా చిక్కడంకాదు నాలు క్కేజీలు పెరిగింది!

సుబ్బులు — (బెదిరిస్తున్నట్టు) ఏయ్ బావా!

గోపీ — (భయంగా) ఓ! సారీ! నువ్వు పెరగడం ఏవిఁటే నువ్వు ఏడు మల్లెపూల ఎత్తుకాదూ కాకపోతే ఇనుముతోచేసిన

సూరమ్మ — ఇదిగో గోపీ, పదిసార్లలా అనకురా! దిష్టి తగులుతుంది

కమల — ఇఁకే నీ మనవరాలికి ఓ నాలుక్కేజీల సల్లహల్వా దిష్టితిసి పడెయ్

సూరమ్మ — అవున్రా! మీకంతా వేళాకోళంగానే వుంటుంది, రేపు దాని పెళ్ళయితే

కాంతమ్మ — అన్నట్టు మాకు పప్పన్నం ఎప్పుడయ్యా గోపీ!

గోపీ — (కంగారుగా) నాకు తెలియదు బాబు! అదిగో రౌడీరాణి, ఇప్పటికే కొరకొరా చూస్తోంది అసలే రాలుగాయి! కాదంటే పడేసి నాలుగు వుతికినా వుతుకుతుంది

సుబ్బులు — (సిగ్గుగా) అబ్బ! పో బావా!

గోపీ — (కంగారునటిస్తూ) ఏవిఁటి - నన్నుచూసి మళ్ళీ సిగ్గుపడు తున్నావా! - - అయ్య బాబోయ్!

సుబ్బులు — (చిన్నగా నవ్వి) ఛీ! నీ కసలు సిగ్గులేదు!

గోపీ — అయ్యో! ఇది నిజంగానే సిగ్గులావుందే!

సూరమ్మ — ఏవిఁట్రా మరీను! ఒక్కదాన్ని చేసి ఆడిస్తున్నారు! అమాయ కురాలనేగా!

కాంతమ్మ — (పక్కున నవ్వి) ఎవరూ అమాయకురాలు? నీ మనవరాలా? ఆహా! ఎంత పిచ్చిదానివొదినా!

సూరమ్మ — కాకపోతే ఏవిఁటొదినా! ఇంతమంది ఇన్ని నాటకాలాడుతుంటే పిచ్చి సన్నాసి అది గ్రహించలేక ఎంత అల్లాడి పోతోందో చూశావా?

కాంతమ్మ — ఆఁ! ఆఁ! వీళ్ళంతా నాటకం ఆడుతుంటే అంతర్నాటకం ఆడింది నీ మనవరాలు! ఎత్తుకి పై ఎత్తు వేసింది వీళ్ళ నాటకాలు తెలిసినా తెలియనట్టు నటించింది

సూరమ్మ — (అయోమయంగా) ఏవిఁటి కాంతమ్మొదినా! చిత్రంగా మాట్లాడు తున్నావ్! నాటకం ఏవిఁటి? అంతర్నాటకం ఏవిఁటి!

కాంతమ్మ — (నవ్వి) బావుంది ఇంతకీ నీ మనవరాలు ఏం చదివింది?

సూరమ్మ — (గర్వంగా) పెద్దబాలశిక్ష పూర్తి చేసింది అంతేకాదు! ఈ వూళ్ళో అయిదోక్లాసు కూడా చదివింది

దుర్గ — (విసుగ్గా) ఆ! నా మొహం! అది బళ్ళో కెళ్ళిందెప్పుడూ చదవడానికి

సూరమ్మ — (కోపంగా) అదేవిఁటే దుర్గా! అయిందానికి, కాందానికి దాని మీద విరుచుకు పడతావ్! అది బళ్ళోకెళ్ళ లేదూ! అవ్వ! కన్నతల్లే ఇలా మాట్లాడుతుంటే ఇంకా ఏవిఁటి

దుర్గ — అయ్యో! మీరెంత పిచ్చివారత్తయ్యా! ఇది స్కూల్‌కని వెళ్ళి చేసే ఎన్లేవిఁటో తెలుసా? రావిచెట్టుకున్న వుయ్యాల వూగడం, మన నరసయ్యావాళ్ళ గేదూద నెక్కి స్వారీ చెయ్యడం! ఇలాంటివే ఇంకా!

సూరమ్మ — (కోపంగా) అయితే ఆ పంతులుకి బుద్ధిలేదూ? విషయం ఇదమ్మా అని మనతో చెప్పద్దూ?

గోపీ — (మరదలికేసి చూస్తూ) ఆఁ! ఆఁ! అదీ అయింది ఆ పిలకి పంతులో రోజు పాలెర్రంగడి భార్యకి మల్లెపూలు, సెంటు సీసా కొనిచ్చాట్ట! ఆయన కర్మకాలి - సీనుకాస్తా మన సుబ్బమ్మగారి కంట పడిందంట ఇంకేంవుంది ఈవిడ గారి అల్లరి సంగతి పూర్తిగా తెలిసిన ఆయన కాళ్ళు పట్టుకున్నంత పన్జేశాట్ట! ఈ విషయం ఎవరికీ చెప్పద్దని! ఇంక ఈవిడ పెద్ద వరాలిచ్చే దేవతలా పోజుపెట్టి నేను స్కూల్‌కొచ్చినా, రాకపోయినా అటెండెన్స్ పడాలనీ నేను రావడం లేదని ఎవ రికీ చెప్పకూడదనీ ఇంకా ఇల్లాంటివే కొన్ని కండిషన్స్ పెట్టిందట ఇంకేం చేస్తాడా మానవుడు!. సరేనంటూ



బుర్రాపేశాడు. అదీ సంగతి.

దుర్గ :— (బాధగా) ఇదింక బాగు పడుతుందంటావా ?

కాంతమ్మ:— అ ః అ ః అక్కడే అందరూ పప్పులో కాలేశారు !

కమల :— ఏవిటత్తా! కాస్త అర్థం అయ్యేలా చెప్పు.

కాంత :— (నవ్వుతూ) చెప్పేస్తున్నాను... చెప్పేస్తున్నాను..... బ్రహ్మాండమైన శుభవార్త ! చెప్పేస్తున్నామ, ఇదిగో కమలా! ఈ శుభవార్తకి .. మాకు మంచి పార్టీ ఇవ్వాలి.

కమల :— (నవ్వి) ఓస్ పార్టీయేకదా ! నీకేం కావాలంటే అది యిస్తాను. ముందు విషయం చెప్పు !

కాంత :— (చేతిలో పేపరు చూపిస్తూ) సరే... ఇదేవిటో చెప్పండి !

చంద్రి :— కాంతమ్మ గోరికి మతి పోయినట్టుంది. నేపోతే అది పేపరు కాయితం అని ఒరికి తెలవదు ?

కాంత :— మీ కంతే తెలుసే పిచ్చిమొహమా ! కానీ దీంట్లో ఓ మంచి వార్తుంది.

సుబ్బులు :— (ఆదుర్దాగా) ఏవిటమ్మా అది ? (పేపరు లాక్కోబోతుంది)

కాంత :— (పేపర్ గట్టిగా పట్టుకుని) ఆ ః ఆగాగు ః ఇదిగోన్నరా ! అమాయకురాలు, అల్లరి పిల్ల అనుకున్న మన సుబ్బులు - చ ః చ ః సుబ్బులు కాదు సుబ్బలక్ష్మి ! మెట్రిక్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది.

అందరూ :— ఏ వి ః టీ ?

గోపి :— ( నవ్వి ) అబ్బో ః బామ్మగారిక్కూడా జోక్స్ వెయ్యడం వచ్చే !

కాంత :— నిజం గోపీ ! సుబ్బులు మెట్రిక్ పాసయింది. కావాలంటే అమెనే అడుగు.

సుబ్బులు :— (ఆతృతగా పేపర్ లాక్కుని) నిజవేః బావా ! నా నెంబర్ చూడు ! నేను నిజంగానే మెట్రిక్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. ఓ ః ఎలా చదివానా ఆశ్చర్యపోతున్నారు కదూ ? నీకూ నాన్నకీ జరిగిన వుత్తరప్రత్యుత్తరాలన్నీ చూశాను. వాటిలో నీకు నా మీదగల ప్రేమ, చదువు వుండాలనే తపన కనిపించింది.

నిర్లక్ష్యం, అల్లరితనం తప్ప నేను మొద్దుని కాదని నీకు తెలుసుగా. అందుకే మీ బాధంతా అర్థం చేసుకుని జానకి దగ్గిరికెళ్ళి విషయం చెప్పి నాకు చదువు చెప్పమని అడిగాను. నాకు చదువుమీద ఆసక్తి కలిగినందుకు తను ఎంతో సంతోషించింది. మెట్రిక్ పాసయ్యేవరకు ఎవరికీ చెప్పద్దనడంతో తనీ విషయం ఎవరికీ చెప్పలేదు.

గోపి :— (ఆనందంగా) యు వార్ గ్రేట్ సుబ్బులూ! నిజంచెప్పాలంటె మా అందరికన్నా నువ్వే గొప్పదానివి ! హార్టీ కంగ్రాచ్యులేషన్స్ !

సుబ్బులు :— (సిగ్గుగా) థ్యాంక్యూ బావా !

దుర్గ :— అయితే గదిలో తలుపులేసుకొని చదివే పుస్తకాలు ఇవేనేవిఃటే (నవ్వుతూ)

సుబ్బులు :— అవునమ్మా !

సూరమ్మ :— నా తల్లే !.... నాకప్పుడే తెలుసు. ఇది పెద్ద చదువులు చదువుతుందని !

కమల :— (ఆనందంగా) నిన్నుచూసి నిజంగా గర్వపడుతున్నాం సుబ్బులూ ! అయినా మేం ఈ నాటకం ఆడుతున్నామని నీ కెలా తెలిసింది ?

సుబ్బులు :— (నవ్వి) చెప్పానుగా అత్తా ! వుత్తరాల ద్వారా తెలుసుకున్నానని !

కాంతమ్మ :— బావుందమ్మా ఎంతసేపూ ఆవిడగార్ని పొగడ్డమే గానీ.... అయ్యో సూరమ్మత్తా ! ఈ సంగతి నీకెలా తెలిసింది అని ఒక్కరు.... ఒక్కరూ అడగరేవమ్మా !

కమల :— (నవ్వి) నిజవేః అత్తా ! మాకెవ్వరికీ తెలియని ఈ సంగతి నీకెలా తెలిసింది ?

కాంతమ్మ :— అదీ ! అలా అడగండి !.... మన జానకి చెప్పింది. తను అర్జంటుగా వూరెళ్ళాల్సొచ్చిందని రిజల్ట్సు వచ్చాయి. ఈ పేపరు సుబ్బులుకివ్వండి అని చెప్పింది !

కమల :— వదినా ! ముందు స్వీట్స్ పట్రా !

దుర్గ :— ఓ ః స్వీటు, హాటూ రెండూ రెడీగానే వున్నాయి.

కమల :— ఈ శుభసందర్భంలో మరో మంచి శుభవార్త,

అందరూ :— ఏవిటది.

కమల :— నాన్న కనిపించారమ్మా !

అందరూ :— (ఆతృతగా) ఎక్కడ ?

కమల :— తిరుపతిలో !

జగన్నాధం :— ఎంత మంచివార్తే కమలా ! ఏరీ....

కమల :— మీ బావగారు తీసుకొస్తున్నారు.

సూరమ్మ :— (నూత్రాలు కళ్ళకద్దుకుని) ఎంత చల్లని వార్త చెప్పావే కమలా !...

చంద్రి :— ఇదిగో పెద్దమ్మగోరూ ! పెద్దయ్‌గోరు కనబడితే.... నాకు మంచి లంగా కుట్టిస్తానన్నారు. గుర్తుందా !

సూర :— తప్పకుండా కుట్టిస్తానే !

చంద్రి :— వట్టి లంగా కాదండి ! పట్టులంగా కావాలి !

సూరమ్మ :— ఓసీ అదెంత భాగ్యమేః చంద్రీ !

గోపి :— ఇంతకీ మా సుబ్బులు అల్లరి మానేసినట్టేగా ?

సుబ్బులు :— ఇదిగో బావోయ్ !.... చదువుకుంటానన్నానే గానీ అల్లరి మానేస్తాననలేదు... నేనెప్పుడూ అల్లరి సుబ్బుల్నే.

గోపి :— నిజవేః తల్లీ ! అందుకే కంగారుగావుంది. రేపు ఏ కేసులోనో.. అదే.. ఏ ఇంటి కేసులోనో ఇరికించి ఆ పిలక పంతుల్ని బ్లాక్‌మెయిల్ చేసినట్టు నన్నుకూడా....

సుబ్బులు :— ఛీ ! ఛీ !.... నీకస్సలు సిగ్గులేదుబాబూ !.... నువ్వంటే నాకు (వీపుమీద చరిచి) ఇంతప్రేమ ! నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తానా !

(అందరూ నవ్వుతూండగా తెర)



డాక్టర్ మహీధర నళినీమోహన్

# మాత్రా ఛందస్సులో మేఘ సందేశం

స్వాధికారమ్ము స్వశ్రద్ధ చేసిన కతన
ప్రణయినీ విరహార్తి భరితమొక యేడాది
స్వామి శాప మొసంగ శక్తులుడిగిన యక్షు
డలనాడు సీతమ్మ జలకమాడిన చోట్ల
గడుప వలసెను నీడ గర్ధకట్టిన పట్ల
రామ గిర్యాశ్రమా రామ రమ్యస్థలుల 1

అబలా వియోగాన నలమటించెడివాడు
మురుగు వదులై పడ్డ బోసి చేతులవాడు
కొన్ని మాసమ్ములా కొండపై వెళ్ళించి
ఆషాఢ మాసంపు టారంభ ఓపసాన
దర్శించె గిరిసాను తటి కౌగిటికి మబ్బు
కుమ్ములాటల దంతి కొదమటోలిన మబ్బు. 2

మదనాభిలాష నెమ్మది రగిల్చెడు మొగిలు
కట్టెదుట నిలువబడి, కన్నీళ్ళు కుక్కుకొని
ధన రాజకింకరుడు తడవు పరిచింతించె-
హాయిగా కాపురము సేయువారలకైన
కారు మబ్బును జూడ కలతపడు చిత్తమ్ము
ప్రేయసికి దవ్వైన వేళ జెప్పెడిదేమి? 3

శ్రావణోదయవేళ సన్నిహితమగుచుండ
ప్రాణేశ్వరీ ప్రాణ పరిరక్షణార్థియై
తన కుశల వార్త నా ఘనుని చే సందేశ
మంపింప నూహించి స్వాగతోక్తుల బలికె
మొల్లమ్ముగా కొండ మల్లె లర్ఘ్యమొసంగె.
వెలుగు మొగమున పండ ప్రీతి వచనములాడె 4

కలిమైన జీవులకు వలను పడునేగాని
ధూమవాయు జ్యోతితోయ సమ్మేళనము
ప్రాణరహితాంబుదము వార్తలేగతి మోచు?
ఉత్సుకత గుహ్యకుం డూహింప కీ పాటి
జీమూతు నర్థించె — చేతనా చేతన
జ్ఞానమ్ము మిగులునే కామార్తులకు నెందు? 5

భువన విదితంబైన పుష్కలావర్తక
ప్రథిత వంశము లోన ప్రభవించితివి నీవు
ఇంద్రునకు కుడి భుజమ, విద్యా చరిష్ణుడవు-
దుర్విధినే ప్రేయసికి దూరమై నిను వేడు
దదము నర్థించి సిద్ధార్థతం గను కంటె
మనుజుని యాచించి లేదనిపించుకొన లెస్స. 6

ధనరాజు సఖుడు మా దంపతుల విడదీసె
సంతప్తులకు నీవు శరణమగుట పయోద!
కాని పొమ్ము నా చెలియ కొరకు సందేశమ్ము
దరిసించదగు నీవు పెరటి తోటలలోని
శివ శిరశ్చంద్రికల చిందు మేడలనొప్పు.
యక్షులకు కాపురంబైన యలకాపురము. 7

గాలివాటున మింట కదలి వచ్చెడు నిన్ను
భర్తలింటికి తిరిగి వత్తురను నాసతో
పథిక వనితలు కురులు పైకెత్తి చూచుదురు.
నీని బోలినపరాధీను డెవడో తప్ప
నీవు వచ్చెడు వేళ నే విరహ విధురుండు
తరుణి నింటను విడిచి పరసీమలందుండు? 8

అనుకూల రీతి మందానిలము నిను త్రోయ
ఎడమ తట్టున వచ్చు గడుసు చాతక పక్షి
కూయుచున్నది కొసరి గోముగా పొగరెక్క-
గుండ కొంగలు మాల గుచ్చినట్టుగ చేరి
కేరింతలై గర్భధారణోత్సవ రక్తి
వెను వెంట నిన్నంటి కనులపండువ సేయు. 9

ప్రాణమ్ములను నాదు రాకకై నిలుపుకొని
దివసముల లెక్కతో తెల్లవార్చెడు నీదు
వదినె జూతువు — పోక వ్యర్థమైపోదులే.
విప్రయోగము చేత వివశమగు జవరాండ్ర
ప్రేమార్ద్ర సుకుమార హృదయ పుష్పము జారి
పడకుండ ఆశయను తొడిమ నంటుకనిలుచు 10

మొలిపించి నేలరటి మొక్కలను భూదేవి
యొడి సస్యఫలవంత మొనరింప దక్షమగు
కర్ణ పేయములు నీ గర్జనము లాలించి
తమ్మి తూడుల కొసల దారిబత్తెములతో
మానసముపై మనసు మళ్ళి నీకు మరాళ
మాల సాయము వచ్చు కైలాస గిరిదాక. 11

చాలనాళ్ళకు నీదు సాంగత్యము లభింప
గోరు వెచ్చని బాష్ప పూరముల స్నేహమ్ము
నేడిట ప్రకటించు మేటి యీ గిరిరాజు
శ్రీరామ పాదాబ్జ చిహ్నములు నడుముపై
పూనియుండుట జేసి పూజ్యుడే నగరాజు
కౌగలించుక నీని కదలుమా ప్రియసఖా! 12

నీరదా! వివరింతు నీ ప్రయాణమ్మునకు
ననువైన మార్గమ్ము నవధరింప గదయ్యా
శ్రవణ పేయంబైన సందేశ మాపిదప.
ఆ దారిలోన నీ వలసి యున్నపుడెల్ల
శైలాగ్రముల మీద కాయాను కొనవచ్చు
విలము పరిలఘు పయస్సుల పుంజుకొనవచ్చు. 13

సరస నిచుల ద్రుమ స్థావరమ్మును వీడి
మొరటు దిజ్నాగముల కరతాడనమ్ములను
తప్పించుకొని పైకి త్వరితగతి పోవయ్య
గిరి శృంగమును గాలి పెరకి పైకెత్తుకొని
పోవుచున్నదటంచు ముగ్ధసిద్ధాంగనలు
భయ సంభ్రమముల నిను పరికింత్రు మొగమెత్తి. 14

సకల రత్న ప్రభల సమ్మిశ్రణము పోలె
పుట్ట లోపలినుండి పుట్టెనో యన్నట్లు
కట్టెదుట హరిధనుఃఖండంబు కనిపించు
అద్దానిచే శ్యామలాంగుడవగు నీకు
సిగలోన నెమలి పింఛెము తురుముకొన్నట్టి
గోపాలకృష్ణ స్వరూప సామ్యంబబ్బు 15

కృషిఫలము నీ దయా దృష్ట్యధీనము గాన
కనుబొమల విరుపెరుంగని పామర స్త్రీలు
ప్రేమార్ద్ర లోచన శ్రీల నినుజూచెదరు.
చక్కగా నాగళ్ళ దుక్కి దున్నిన మాల
మురు సౌరభము జిమ్మ గురిసి, వెనుకకు వచ్చి
మందగతి పోవయ్య మరల ఉత్తరదిక్కు. 16

కుంభ పోతల వాన గురిసి దావానల
గ్లాని మును బాపితివి గాన డస్సిన నిన్ను
ఆమ్రకూట గిరీంద్రుడు తౌదల ధరించుటే
సాయపడ్డ సఖుండు సంప్రాప్త మగునేని
పెడమొగం బిడడెంత పిసిని గొట్టేనియును
ఇంత యున్నతుడు నిన్నేలా యుపేక్షించు? 17

ఆ శైల పార్శ్వమ్ము లడవి మామిడి చెట్లు
పక్వఫల రుచులతో ప్రచ్ఛన్నమై యుండ
చిక్కనగు నలుపుతో శిఖరమున నీవుండ
ఆకాశచరులైన అమర మిథునంబులకు
నడుమ నలుపును కడమ కడువెల్లనై యున్న
ధరణీ స్తనమ్ము వలె దర్శనీయంబగును. 18

రేగి భిల్లాంగనలు భోగించు పొదరిండ్ల
కిరవైన యచ్చోట నరగడియ నిలిచి, తో
యోత్సర్గ మొనరించి, యురువడిం బయనించి
విషమ కర్కశ శిలా వింధ్య పాదములందు
పాయలై చుట్టుకొని ప్రవహించు నర్మదను
గజ రాజు చర్మరేఖా సామ్యగనుగొమ్ము. 19

వర్షమ్ము వెల్లిగక్కి, వన్యేభ మదజలా
మోదమై, నేరేటి పొదలచే వడి తగ్గి
తిక్తమగు రేవా నదీజలము గొని పొమ్ము

ఘనుడ! సారము పుంజుకొనిన నిన్ననిలుండు
పజగెంటి లేడింక — బలహీనునకు లఘుత
పరిపూర్ణునకు గౌరవము సాజమే కదా! 20

అప్పుడప్పుడె కనుల విప్పనేలయనంటి
మొలకలను కొరుకుచూ, నలుపు పసుపుల నొలయు
అరవిద్చు కడిమి కేసరములను మెక్కుచూ,
నేల విడిచెడు వేడి నిట్టూర్పుల సుగంధ
మాబగా గ్రోలుమా అడుగు గజహరిణములు
చినుకు రాల్చుచు నీవు చనిన మార్గము జూపు. 21

పడుచున్న చినుకులను పట్టి నేర్పరులైన
చాతకిమ్ముల గనుచు - చాలుదీరుచు నెగురు
కొంగలను వ్రేలితో గుర్తించి లెక్కిడుచు-
ఉన్నట్టులుండి నీ వురుమగా చకితలై
ప్రియ సహచరాంగనలు బిగి కౌగిటులానంగ
కిన్నరులు ముదమంది కీర్తించెదరు నిన్ను. 22

త్వరితముగ నా సతికి వార్తకొని పోగోరు
నంబుదా! త్రోవ నీ కాలస్యమగునేమొ
కుటజ సురభిళమైన కొండ కోనలయందు
నీళ్ళు నిండిన కనుల నీ కెదురు విచ్చేసి
స్వాగతపు కేక విడు వనమయూర గణమ్ము
విడిపించుకొని వాని వెడలం యత్నింపుమా! 23

మొగిలి పొట్టలు పగిలి నిగనిగల తెలివెలుగు
కురియు తోటలతోడ - గూండ్లు కట్టెడు పనుల
కాకు లాకుల పడెడు గ్రామచైత్యములతో
పళ్ళ చే నల్లనగు నల్ల నేరేళ్ళతో
దూర తీరము జేర గోరు హంసములతో
తేజరిల్లు దశార్ణ దేశములు నీ రాక. 24

విదిశయను పేర దిగ్విఖ్యాతమగు దాని
రాజధానికి బొమ్ము - రసికత్వ ఫలసిద్ధి
సంపూర్ణముగ నీవు సత్వరమ పొందుదువు.
రమ్యచలదూర్మి వేత్రవతీ నదీ తటిన్
వంగి మంద్రధ్వనుల స్వాదురసపానమ్ము
గొమ్ము స్మితాఖంగ కోమలాధరము వలె 25

విదిశానగరి పొంత విడిది నీకగుగాక
జలద! నీ స్పర్శచే పులకరించినయట్లు
కడిమి పూవుల నిండి కనవచ్చు నీచగిరి.
దానిలోని శిలాచిత్రద్రికల విటిమ్ము
వణ్యాంగనా సురత పరిమళంబులచేత
అచటి పురుషుల యౌవ నాధిక్యత నెరుంగు. 26

అలసటల దీర్చుకొని వన నదీ తీరాళ
ఉద్యాన వనములం దుదయించు మాగధీ
ముకుళములపై జల్లు మురిపించి కురిపించి,
చెక్కిళ్ళపై జారు చెమట తుడుపుల వాడు
కర్ణోత్పల శ్రీల కల పుష్పలావికల
ఛాయా ప్రదానమున క్షణము సంతసపెట్టు. 27

ఉత్తరముగా పోవ నుద్యమించిన నీకు
ఇసుమంత చుట్టయిననేమి? యుజ్జయినిలో
దారు సౌధోత్సంగ సంస్పర్శ మానకుము.
సౌదామనీ చకచ్చకలచే భీతిల్లు
పౌరాంగనల ముద్దు వాలుచూపుల సొగసు
కన జాలకున్నచో కనులున్న ఫలమేమి? 28

తరగ తెగయగ కలధ్వని చేయు ఖగపంక్తి
మొల నూలుగా దాల్చి, స్ఖలిత సుభగంబుగా
సుడిగుండమును నాభిజూపి, హొయలొలికించు
తీవ్ర నిర్వింధ్యా నదీ సంగమము జేసి
అధర పయ్యారసము - సుదతీజనంబులకు
విభ్రమంబులె కోర్కె వెలయించు గతి కదా! 29

ఉదకమ్ము కుశ్కించి యొంటి జడ కట్టగా
పండుటాకులు తీర పాదపంబుల నుండి
జారిపడి పాండుర చ్ఛాయ కల్పింపగా
త్వద్వియోగ వ్యధాదస్థచే సింధునది
కనబరచె నీ భాగ్య గరిమ - నీవే దీని
బరి పుష్ట మొనరించు పద్ధతేదియొ చూడు. 30

ఊరిపెద్దలు చెప్పు ఉదయనోదంతమ్ము
లాలించుచు నవంతి గాలూని, దర్శించు
కడమ పున్నెము మూట గట్టుకొని దివినుండి

వసుధ కరిగెడు స్వర్గవాసులొక దివిముక్క-
కోసికొని తమవెంట కొనివచ్చినట్లుండు
సిరివిశాలంబైన శ్రీవిశాలాపురము 31

మదముచే నవ్యక్త మధురమగు బెగ్గురుల
కువ కువ ధ్వనులతో, నవనవోన్మేషిత
ప్రత్యూష సరసీజ పరిమళ శ్రీలతో
అనుకూలముగ నొత్తి యచటి కాంతల రతి
గ్లాని పోగొట్టు శిప్రానదీ వాతమ్ము
మృదులోక్తులను వేడు ప్రియతముని చందాన. 32

విక్రయార్థంబచటి విపణి వీధులయందు
తరళగుటికారత్న తారహార శ్రేణి
గడ్డిపరకల వన్నె గరుడ పచ్చలబారు
ముత్యాల హారాలు, మువ్వన్నె పగడాలు
కుప్ప తిప్పలు కోట్లకొలది చూడగ నబ్ధి
సలిల మాత్రావశేషం బయ్యెననిపించు. 33

"ప్రద్యోతనుని ముద్దుపట్టి నిచ్చోటనే
రాకుసమ్మున వత్సరాజు తీసుకపోయె-
స్వర్ణ తాళవనంబు వర్ధిల్లె నల్లచట-
ఇంద్రుడిచ్చిన సామజేంద్రంబు మద మెక్కి-
కట్టుకంబము పెరకి గంతులిడె నిచ్చోట"
అని క్రొత్త చుట్టముల నలరింతు రవ్వేలు. 34

పచ్చవన్నె హయమ్ము లచ్చోట దినరాజు
గుర్రాలు నెదిరించు - కొండంత ఏనుగులు
దాన మహిమంబుచే తరచు నీవలె కురియు
అచటి యోధులు రావణాసురునితో పోరి
చంద్రహాసవ్రణ స్మరణాంకముల దక్క-
ఇతర భూషణరాజి నేవగింతురు మేన. 35

కిటికీల వెల్వడెడు కేశ సంస్కారార్థ
ధూపముల బలిసి, బంధుప్రీతి నర్తించు
పెరటి పెంపుడు నెమలి పిందు లవలోకించి
లలిత వనితాపాద లాక్షారుణాంకముల
కుసుమ గంధశ్రీల గుమ్మమను నప్పాటి
భవన శోభను జూచి బడలికలు వాయుమా! 36

స్వామి కంఠచ్ఛాయ వలెనుండి వని నిన్ను
ప్రమథు లాదరదృష్టి బరికింప దర్శించు
జలకేళి సవరింప వలపున్న జవరాండ్ర
గాత్ర పరిమళముతో కలుష తావులు పెనగు
గంధవతి తెమ్మెరల కదులాడు పూదోట
ముందున్న పుణ్య త్రిభువనేశు మందిరము. 37

కంబుధర అమ్మహా కాళాలయమ్ము నీ
వే వేళ చేరినను యినుడస్తమించగల
క్షణము వరకచ్చోట కనుపెట్టుకొని యుండి,
సంధ్యా సమయమందు చండీశ పూజలో
ఆ మంద్రగర్జన వ్యాజమున లయబద్ధ
పటహ నినాదముల పలికి ధన్యుడ వగుము. 38

మొలనూలు నినదింప లలిత నృత్యములతో
రత్నకంకణ కాంతి రమ్య వింజామరల



నలవోకగా పీచి, అలసి, వేశ్యాంగనలు
జలద! నీ తొలి బిందువుల నఖక్షతములను
తడిపి సుఖపెట్టి నిను ధన్యుఁజేసెద రచట
గండు తుమ్మెద బారు కలచు వాల్చూపులను. 39

అటుమీద పటు తాండవారంభ వేళలో
నవజపా పుష్పారుణచ్ఛాయ తొలికించు
సాంధ్యతేజః పుంజ సాంద్రుండవై నీవు
భూతేశు నత్తుంగ భుజసీమ జుట్టుకొని
స్తిమితపడి శర్వాణి తిలకింప శివుని ర
క్తార్ద్రి వారణ చర్మ ధారణేచ్ఛను తీర్చు. 40

పొదుముకొన్నను కనుల పొడ కానరానట్టి
నిసివేళ నవ్వీలు మిసిమి యౌవనవతులు
ప్రియుల యిండ్లకు రాజ వీధి నరుగుచునుండ
గీటు రాపై పసిడి గీత తొలసిన లీల
మెరపు తీగల దారి నెరుక పరచుమె కాని
ఉరియ కురుమకు జడిసికొందురా కోమలులు. 41

పావురాలకు కునుకు పట్టినట్టి ప్రశాంత
సౌధాగ్రమేదైన చక్కనిది చూచుకొని,
వెలుగు లెక్కువ చిమ్మి అలిసిపోయిన నీదు
విద్యుదంగన తోడ వెళ్ళించి యారేయి
తెల్లవారగ లేచి వెళ్ళు ముత్తరదిక్కు-
కాలహరణము మిత్రకార్యార్థులకు పుడురే? 42

ఖండిత ప్రమదలను కన్నీరు తుడిచి ద
క్షిణ నాయకులు బుజ్జగించవలసిన వేళ
ఇది కనుక వెంటనే ఇన మార్గమును విడుము,
కమలినీ సతి వదన కమలమ్మునందోగు
మంచుకన్నీరు హరియించ వచ్చిన భాను
కరములకు నడ్డుపడి కలిగింపకు మసూయ. 43

సహజ సుందరగాత్ర! ఛాయరూపునవైన
సరసానురాగ సంభరిత చిత్తమువంటి
స్వచ్ఛగంభీరావ యస్సులం జొరబడుము,
వెల్లకలువలవోలె విశదార్ద్రి తరళమై
చెలగి త్రుళ్ళింతలగు చేపమాపులందాని
విడిచి దిట్టతనాన వెడలు టుచితమె నీకు? 44

పృథు నితంబము నుండి ప్రిదులు జలవసనమ్ము
స్రోతస్వినీకాంత చేతనదిమిన యట్లు
వానీర తరుశాఖ వంగి నీళ్ళను దాకె,
అగితివి జలద! నీ యాత్ర జాగగునేమొ
ఒకసారి రుచి మరిగియున్న యే పురుషుండు
జఘనమ్ము బయలైన సరసురాలిని విడచు? 45

నీవు కురియుట చేత నేల లోపలినుండి
ఉబికివచ్చెడు పరిమళోద్గార మిళితమై
చల్ల చల్లగ గాలి మెల్ల మెల్లగ వీవ
అడవి మేడులు పండి అందాలు కురిపింప
ముకురంధ్రముల గురక పుట్ట వేదండములు
తృప్తి న్నాఘ్రాణింప దేవగిరి కరుగుమా. 46

నిత్యమ్ము దేవగిరి నివసించు షణ్ముఖుని
పూల మబ్బుగ మారి పూజించు సురధునీ
సలిలార్ద్రి పుష్పముల జడివాన కురియించి-
పాకశాసిన చమూ పరిరక్షణార్థమ్ము
భూతేశ్వరుండగ్ని ముఖమున నందిడినట్టి
భాస్కరాతీతమగు భవ్యతేజంబతడు. 47

శివ చంద్ర చంద్రికా ధవళితా పాంగమగు
కార్తికేయుని నెమ్మి గవ్వించి యాడించు
మద్రిప్రతిధ్వనుల నందమగు గర్జనల.
వసుధరాలిన దాని వన్నెచిన్నెల కన్ను
కొడుకుపై ప్రేమచే కుముద పత్రార్హమగు
చెవిలోన తురుముకొన చేపట్టు శర్వాణి. 48

అర్చించి శరజన్ము నడుగు ముందుకు వేసి,
వాన చినుకులవల్ల పాడగును వీణలని
దారిమళ్ళెదరు సిద్ధ దంపతుల వీక్షించి,
మనుగవాలంభమున పుట్టి లోకమున ధ
ర్మణ్వతీ నదియైన రంతిదేవుని కీర్తి
గౌరవింపగ నొక్క క్షణమచట నిలువబడు. 49

సత్యప్రియా పవు ఛ్ఛాయాప హర్తవై
నీరు త్రాగగ వంగి నీ వుండ నా తటిని
దొడ్డదయ్యును చాల దూరమున కల్పమై
నవ్యేంద్ర నీలమణి నడుమ గల యొక పేట
ముత్యాలహారమ్ము భువి దాల్చెనన్నట్లు
క్రింది కవలోకించు ఖేచరుల కగుపించు. 50

దాటి యా నిర్ఝరిణి దశపురింబోర బొమ్మ
కనుబొమల కదలించు పనుల నేర్పరులైన
రంతి దేవపురీ విలాసినులు సోగలగు
కనురెప్ప లాడించి కౌతుకమ్మున నిన్ను
వీక్షించెదరు - మల్లె లెటుతూగ నటుతూగు
నళిబృందముల కాంతి హరియించు చూపులను. 51

ఆ పిదప పొమ్ము బ్రహ్మావర్త దేశమ్ము
ఛాయా స్వరూపమున - క్షత్రమారణకాండ
చిహ్నముల్ గల కురుక్షేత్రమ్ము దర్శించు.
గాండీవి యచ్చోట కరకు కోలలవేలు
వైరి రాజన్యముఖ పంక్తిపై కురిపించె
పద్మముఖపై నీవు వర్షించు చందాన. 52

అప్త బంధుప్రీతి నాజి విముఖత జెంది,
రేవతీ లోచన శ్రీ ముద్రితంబైన
ప్రియతమంబగు కల్లు విడిచి, బలరాముండు
పరమ పావన సరస్వత్యంబు పానంబు
చేత చేత శుద్ధి చేసికొనె - నీ వట్లె
కృష్ణుండవగుము వర్ణైక మాత్రము చేత. 53

తత్కురుక్షేత్రమ్ము దాటి కనఖలగిరి
ప్రాంతమున హిమవన్నగావరోహ మొనర్చి,
సగర తనయుల దివికి నెగప్రాకనిచ్చెనై
నురుగు నగవుల గిరిజ నొసట బొమముడి వేసి,
కెరటాల హస్తముల హరు జుట్టు బట్టుకొని,
శశినందు కొనజాచు జాహ్నవిని సేవించు. 54

వెనుక సగభాగమ్ము వినువీధిలో ప్రేల
స్ఫటికమ్ము వలె నతి స్వచ్ఛమగు గాంగజల
మమర కుంజరము వలె నాన వంగితివేని
నల్లనగు నీ నీడ నడినీట కదలుచో
అస్థానమందు గంగమ్మతో నేర్పడిన
యమునానదీ సంగమము వోలె కనుపించు. 55

గండు కస్తురిలేళ్ళు కమ్మ తావులు పులిమి
గారవించెడు చోట, గంగ పుట్టినచోట
మంచుచే తెలుపైన మహాచలము జేరి
బహుదూర యానమున బడలి శిఖరాగ్రమున
చదికిలంబడునీవు - శంభు వృషభపు కొమ్ము
గోరాడ బురదంటు కొన్నట్టు తోచెదవు. 56

తీవ్ర వాయువు వీచి దేవదారు ద్రుమ
స్కంధమ్ము లొరసికొన జన్మించు దావాగ్ని
నెరసు చమరీ వాలభరములను మండించి
హిమవంతు బాధింప శమియింపవలె నీవు
సలిలధారా సహస్రముల - నా పన్నార్తి



తొలచుపే యుత్తముల కలిమికుచిత ఫలమ్ము 57

వెండి కొండను ఒరుగు వేళ వేదండమని
భ్రమసి శరభములు నీ పైకి లంఘించుచో
నీవు తప్పుకొనంగ నేలగూలినవాని
పదగళ్ళ చేమొత్తి కదతేర్చుటుచితమ్ము
వ్యర్థముగ దండెత్తి వచ్చు ధూర్తాదముల
పరిభవప్రాప్తి తప్పక పొందుదురు గాక. 58

బాలేందు శేఖరుని పాదచిహ్నంబున్న
సిద్ధులకు పూజ్యమగు శిలయొండు కలదందు
మ్రొక్కి చుట్టుము దాని ముమ్మారు భక్తితో.
దాని నిశ్చల భక్తి దర్శించ గలవారు
పాప పంకిల మిగిరి, పరలోకమున కేగి
శాశ్వత ప్రమథ పద సంప్రాప్తి నొందుదురు. 59

తచ్ఛిలా ప్రాంతమున తాండవించెడు వేళ
గాలి నిండి వెదుళ్ళు కమ్మగా శబ్దింప
త్రిపుర విజయము కిన్నరీగణము పాడగా
గిరి గహ్వరముల [illegible] యురుము గంభీరమై
మర్దల ధ్వని కాగ - మాహేశ్వరోదాత్త
సంగీత వస్తువది సంపూర్ణ తంజెందు 60

హిమశైల పరిసర ప్రముఖ విషయము లరసి,
పరశురాముని ధనుః పాండిత్య సాక్ష్యమ్ము
క్రౌంచరంధ్రమ్ము రాయంచలకు ద్వారమ్ము
గురుతించి, దూరి, యుత్తర దిక్కుగా నీవు
సాగుచో తొల్లి బలిచక్రవర్తిని వంచు
వామన శ్యామ పద శైలరిం బోచెదవు. 61

క్రౌంచరంధ్రము వెడలి, కదలి యూర్ధ్వమ్ముగా
తొల్లి రావణుడూప కీళ్ళు సడలినదాని
అమరాంగనల నిల్వు టద్దమయ్యెడు దాని
కైలాసమున కతిధి కావయ్య - మిన్నంటు
ధవళ శిఖరాగ్రములు — తరుణేందు మౌళి ని
త్యాట్టహాసము పేరి గుట్టలై నట్లుండు. 62

అప్పుడే తెగనరికి నట్టి గజదంతమ్ము
లీలధవళంబైన కైలాస తటమందు
కడు సూక్ష్మముగ నూరబడిన కాటుకవోలె
నీవు పరివేషించు దృశ్యంబు పరికింప
నలుపైన వసనంబు పలెవాటుగా దాల్చు
బలరాముడో యన్న భ్రమగొలుపు చూపరకు. 63

పాప కడియము విడిచి ఫాలాక్షుడందించు
కేలు చేబట్టి తత్క్రీడాచలము మీద
పాదచారిణియై భవాని విహరించుచో
నవరత్నమయమైన నగతటిం బెక్కుటకు
కడుపులోని జలమ్ము గడ్డ కట్టించుకొని
ముందు నిచ్చెనమెట్ల చందాన నిలువబడు. 64

అమర యువతులు నిన్ను హస్తకంకణ వజ్ర
ధారలం గీరి, నీ వారి ధారల బిండి,
జలయంత్రముగ మార్చి, నిలుపుకొనజూచెదరు
కరకు వేసవి లోన దొరికిపోయిన నిన్ను
పిడనొల్లని యెడల - క్రీడా నిమగ్నలౌ
తరి కర్ణ పరుషముగ యురిమి తప్పుక పొమ్ము. 65

బంగారు తామరల ప్రసవించు మానస
హ్రద పయస్సుల త్రాగు, మమరేంద్ర మత్తేభ
ముఖవస్త్రమై గడియ ముచ్చటం దీర్చుకో.
సొంతగాలుల వీచి సుర వృక్ష పత్రముల
యుత్తరీయపు కొసలనుంచు, మాగిరిమీద
తెరలి నానావిధ క్రీడలందని వొందు. 66

విలసద్విమాన నభిగలిత గంగాంశుకను
ప్రియ న గోత్సంగమున హొయలొలుకు నలక నో
వన్నె కాడా! గుర్తుపట్ట నేరక పోవు
వాన కాలమునందు వర్షధారలు కారు
నభ్ర బృందమును ముత్యాలసరముల వ్రేలు.
ముంగురుల వలె దాల్చు మోహనాకారిణిని. 67

(పూర్వమేఘం సమాప్తం)

(సశేషం)

## చరిత్రకు పరుగు

క్షణాల అగ్నికణాల మీద
సత్యాగ్రహం చేసే జాగృతి
అవధిలేని కాలానికి
అన్నివాకిళ్లూ తెరుస్తుంది.
నిప్పుల్లో తడుస్తూవుంటే
ఉప్పెనలకొద్దీ చెమట పుడుతుంది.
నిజం అంచుమీద నడుస్తూవుంటే
నిజాయితీ జారిపడుతుంది.
జారిపడితే ఓటమి కాదు
జడుపు పుడితే ఓటమి.
అంతటి జలపాతం జారుతుంటుంది
ఆకాశం ఒళ్లొంచి.
ఒరిగిన జలపాతం ఉసూరనదు
విరిగిన కీళ్ళను చూసి.
కుంటుతూ సాగినా నరే
చంటి నేలకు పాలిస్తుంది.
జారిపడ్డా నరే
చరిత్రకు పరుగిస్తుంది.

డా॥ సి. నారాయణరెడ్డి

శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు

# ఆచార్య శ్రేష్ఠుడు- హెరాల్డు లాస్కి

మేధావులలో కొద్దిమంది మాత్రమే వ్యక్తి స్వాతంత్ర్యాన్నిగూర్చి ఆలోచిస్తారు. ఆలోచించిన వారిలో యింకా కొద్దిమంది ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తారు. వారి దృక్పధానికి పునాది- నమ్మిక. రాజ్యాంగవేత్తగాను, సంఘసేవకుడుగాను, బోధకుడుగాను నాయకుడుగాను తమ పాత్రను సమర్ధవంతంగా నిర్వహిస్తారు. అట్టివారిలో ముఖ్యులు ఆచార్య హెరాల్డు జోసఫ్ లాస్కి ముఖ్యులు.

ఈయన 30-6-1893వ తేదీన ఇంగ్లండులో ఒక యూదు కుటుంబంలో జన్మించారు. యూదుజాతి ఎడ సర్వత్రా వ్యతిరేకం వున్నా ఇంగ్లండులో వారిస్థితి మెరుగు. 1858 వరకు వారికి పార్లమెంటు ఎన్నికలలో పోటీచేసే హక్కు వుండేదికాదు. కాని యూదుగా జన్మించిన బెంజిమెన్ డిస్రాయిల్ (బేకన్‌ఫీల్డు ప్రభువు) రెండు పర్యాయాలు బ్రిటిషు ప్రధానిగా పనిచేశారు. బడా వడ్డీవ్యాపారస్థులైన, లియనల్ రాత్స్‌చైల్డు, పార్లమెంటుకు ఎన్నికైనా ప్రమాణ పద్ధతిని మార్చిన తర్వాతనే తమ స్థానంలో కూర్చున్నారు. తదుపరి యూదులు మంత్రి వర్గంలోకూడా ప్రవేశించారు. హెర్బర్టు సామ్యూల్, ఎడ్విన్ మాంటేగు, యిందుకు వుదాహరణ. తొలుత బ్రిటిషు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసి ఇండియాకు గవర్నరు-జనరలుగా వచ్చిన రీడింగు ప్రభువు యూదు జాతీయుడు. ఇవి కొన్ని వుదాహరణలు మాత్రమే.

ఆక్సుఫర్డు విశ్వ విద్యాలయంలో చదువు ముగించాక, కనడాయందలి మేల్‌జిల్ విశ్వవిద్యాలయంలో రెండేళ్ళపాటు, అమెరికాయందలి హార్వర్డు విశ్వ విద్యాలయంలో నాల్గేళ్ళపాటు పనిచేసి ఇంగ్లండు తిరిగి వచ్చారు. 1926 నుంచి తనువు చాలించే వరకు లండను స్కూలు ఆఫ్ ఎకనామిక్సు, పోలిటిక్సులో అధ్యాపకులుగా పనిచేశారు. వీరి అధ్యాపకత్వము కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమందు అధ్యాపకులుగా వుండిన, ఆల్‌ఫర్డు మార్షల్‌ను గుర్తుచేస్తుంది. అట్టివారి శిష్యులుగా వుండటము అదృష్టమేకాక గర్వ కారణముకూడాను. రాజనీతిలో- లాస్కీది ఆఖరి మాటనటంలో అతిశయోక్తిలేదు.

లబ్ధిని గురించి ఆలోచించే రోజులలో దృష్టిని ఫేబియన్ సోషలిజము, కమ్యూనిజమువైపు మరలించి, సార్వభౌమత్వము, ప్రజాస్వామికము, ఆర్థిక, రాజకీయ, స్వాతంత్ర్యాన్ని, సిద్ధాంతరీకరించారు. స్త్రీ స్వాతంత్ర్యానికి, కార్మిక శ్రేయస్సుకు పనిచేశారు. మార్క్సు, డార్విన్, సిద్ధాంతాలను ఆకళింపు చేసుకున్నారు. 1937-49 వరకు బ్రిటిషు లేబరుపార్టీ జాతీయ కార్యవర్గ సభ్యులుగా నుండిరి. 1936-39 వరకు స్పెయిన్‌లో నియంతృత్వానికి ప్రజాస్వామ్యానికి జరిగిన అంతర్యుద్ధంలో ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని ప్రజాస్వామికముపైపు సమీకరించారు. బ్రిటిషు పాలకులు భారతదేశంలో కార్మికోద్యమముపై మీరట్ కుట్రకేసు బనాయింపగా అసలు ముద్దాయి బ్రిటిషు ప్రభుత్వమే అని ఘంటా పథంగా చెప్పారు.

ఫెడరలిజానికి భవిష్యత్తులేదని అభిప్రాయపడినా సామ్రాజ్యవాదాన్ని నెట్టివేయటానికి అంతకన్నా ప్రత్యామ్నాయము లేదనేవారు. ప్రతి ప్రభుత్వము ప్రపంచ శ్రేయస్సుకై కొన్ని హక్కులను వదులుకోవాలి. నియంతలు, మత మూఢత్వముపై తిష్ఠ వేస్తారు. పెట్టుబడిదారి వ్యవస్థ చరమ దశలో, ఫాసిజముగా వెర్రితలలు వేస్తుంది. తత్రాపి ప్రజాతంత్ర పునాదులను పెకలించటానికి ప్రయత్నిస్తుంది. ఆర్థిక స్వాతంత్ర్యములేని, రాజకీయ స్వాతంత్ర్యము బూటకము. వికేంద్రీకరణద్వారా ప్రజానీకం ప్రభుత్వంలో పాలు పంచుకుంటారు.

ఆష్టిన్‌వాద ప్రకారం సార్వభౌమత్వము న్యాయ సిద్ధాంతానికి లొంగదు. తాఖీదులు జారీచేయటమేకాని స్వీకరించదు. చట్టాన్ని సవాల్ చేయటమంటే అరాజకానికి బాటవెయ్యటం. న్యాయవ్యవస్థ జటిలమైతే న్యాయానికి ప్రమాదమేర్పడుతుంది. మనోవాక్కాయ కర్మలలో చట్టాన్నామోదిస్తేనే సఫలమౌతుంది. చట్టాన్ని అంతా ఆమోదిస్తారనే హామీలేదు. న్యాయం సహజమైన తీర్పులవల్ల కుదించబడుతుంది. సాంఘిక వొత్తిళ్ళకు, తలవొగ్గాలి చట్టాన్ని రూపొందించాలి కాని వూరికే లభ్యముకాదు. లాస్కి, దీనిని న్యాయమూర్తి తీర్పుగా గాక అంతర్జాతీయ దృక్పథంతో రాజ్యాంగ వేత్తగా నిర్వచించారు. ప్రతి వ్యక్తిమీద సమకాలీన ప్రభావం వుంటుంది. వెయిమర్ రాజ్యాంగము నిర్దుష్టమైన ప్రజాస్వామిక సిద్ధాంతాల పునాదిపై ఏర్పడ్డా దీని అసరాతో జర్మనీలో హిట్లర్ అధికారాన్ని చేపట్టాడు.

కమ్యూనిజము సహితము అనుకూలమగు వాతావరణమున్నప్పుడే విజృంభిస్తుంది. జాతీయత మానవునిలో జీర్ణించిన ఆధునిక మతము. జోన్‌ఆఫ్ ఆర్కు, మొదలు అనేకమంది దీనివల్ల ప్రభావితులయ్యారు. నిరుపమానమైన త్యాగాలు చేశారు. దీనికి మూలపురుషులు జర్మను తత్వవేత్త, ఫిషే, ఇటాలియన్ దేశభక్తుడు మేజినీ. ఆధునిక పారిశ్రామీకరణవల్ల అంతర్జాతీయ విపణిలో పోటీ ఏర్పడింది. ఒక దేశంపై మరోదేశం ఆధారపడవలసి రావటంచేత సంపూర్ణ సార్వభౌమత్వాన్ని ఏదేశం చలాయించలేదు. అంతర్జాతీయ న్యాయనికి స్థానిక న్యాయం, తలవంచాలి. స్వతంత్రానికి స్థావరం ఆస్తి హక్కు.

అసమానతవల్ల ఏర్పడే ప్రమాదాన్ని గురించి సదా హెచ్చరించేవారు. న్యాయసూత్రాలు కాలమాన పరిస్థితులకు అనువుగా మారాలి. అరిస్టాటిల్ బానిసత్వాన్ని, లాకె, రోమన్ కేథలిక్‌ల లెలిని, హిట్లరు యూదులఎడ ద్వేషాన్ని, శాస్త్రరీత్యా బలపరచటానికి ప్రయత్నించి విఫలులయ్యారు. హింసవల్ల అహంభావము, క్రూరత్వము, పెరుగుతుంది. బాధితులలో కపటము, బానిసత్వము చోటుచేసుకుంటుంది. ప్రతిఘటనవల్ల విప్లవ భావాలు విజృంభిస్తాయి. ద్విగుణీకృతమై ప్రజలనాకర్షిస్తాయి. బహిరంగ విజృంభణ కన్న అజ్ఞాతవునికి ప్రమాదకరము. అందువల్ల వాల్టయిర్ అన్నట్లు అందరికి పరిపూర్ణమైన వాక్ స్వాతంత్ర్యముండాలి.

బెర్ట్రాండురస్సెలు చెప్పినట్లు ప్రేమపాత్రుల ఎడమన సంబంధ బాంధవ్యాలు సహజంగా వుంటాయి. ద్వేషించేవారి యెడల సౌమ్యంగా సరళంగా ప్రవర్తించాలి. దేశంయొక్క అభ్యున్నతి న్యాయస్థానాలకిచ్చే గౌరవంమీద ఆధారపడి వుంటుంది. దేశాన్ని పోగొట్టుకున్నాక రాజ్యాంగం నిలవదు. అబ్రహాం లింకన్ చెప్పినట్లు "జీవితాన్ని శరీరాన్ని కాపాడుకోవాలి. జీవితాన్ని రక్షించటానికి ఒక అంగాన్ని ఖండించవచ్చు కాని అంగాన్ని రక్షించటానికి జీవితాన్ని త్యాగం చేయరాదు". జీవితానికి దేశానికి వ్యతిరేకతలేదు. రాజ్యాధికారానికి భద్రత వున్నపుడే వ్యక్తి స్వాతంత్ర్యం నిలుస్తుంది. భద్రత లేనిదే రక్షణ వుండదు. యాక్టను ప్రభువు నిర్వచించినట్లు "సురాజ్యము, వ్యక్తి స్వాతంత్ర్యం, సహజీవనం, చెయ్యాలి". వామపక్ష వాదాన్ని అంతం చెయ్యాలనేవారు ప్రజాస్వామికాన్నే భూస్థాపితం చేస్తారు.

లాస్కి, ప్రపంచమందలి మేధావులతో సన్నిహితంగా వుండేవారు. అమెరికా సుప్రీముకోర్టు న్యాయమూర్తి హోమ్సుతో వీరు జరిపిన వుత్తర ప్రత్యుత్తరాలు యిందుకు తార్కాణము. ఫేబియన్ సంఘ సభ్యులైన జార్జి బెర్నార్డుషా, వెబ్బు దంపతులతో బుజాలు రాసుకున్నారు. 1945లో లేబరు పార్టీ విజయం సాధించగానే దాని కార్యవర్గ అధ్యక్షులై తీర్చిదిద్దారు. సరిసమ జీవిత సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ప్రతివారం వీరు జరిపే సమావేశాలకు అన్ని వర్గాలవారిని ఆకర్షించేవారు. వీరు రచించిన ప్రామాణి గ్రంధాలు ఇరవైదాకా వున్నాయి. వీరి వ్రాతవల్ల రాజనీతి సుసంపన్నమైంది.

వీరు వి. కె. కృష్ణమీనన్‌కు డాక్టరు బి. ఆర్. అంబేద్కర్‌కు గురువు. జవహరలాల్‌నెహ్రూ ఎడ అమిత గౌరవ ముండేది. ఇజ్రాయిల్ స్వతంత్ర దేశం కాగానే దానికి భారతదేశంతో దౌత్యసంబంధాలుండాలని కోరుకొనేవారు కాని ■ కోరిక ఫలించలేదు. పార్టీ రాజకీయాలకు అతీతంగా ప్రవర్తించే అధికారవర్గమే భారతదేశ భవితవ్యాన్ని సక్రమం తీర్చి దిద్దగలదని చెప్పేవారు. ఆయన ది. 24-3-1950వ తేదీని మరణించినా ఆయన స్మృతి భారతీయులలో నిల్చివుంది. అహమ్మదాబాదులో రాజనీతి అధ్యయన సంస్థ వీరి పేరుతో వెలిసింది. రాజనీతి నిర్వచనలో వీరు సాటిలేని వ్యక్తి. ☆

సీరియల్

# తిక్కన సోమయాజి

కీ.శే. కొమ్మూరు నారాయణరావు



(గతసంచిక తరువాయి)

## 5 ఊరేగింపు

శైవులకును వైష్ణవులకును పోరు తీవ్రముగ సాగుచున్నది. ఈ కలహమునకుఁ బ్రత్యేక కారణమేమియు లేదు. విజయదశమినాఁటి రాత్రి వైష్ణవాలయము కడ మోహినీ భస్మాసుర నాట్యమాడిరి. "భస్మాసురుఁడను రాక్షసుఁడు శివునిగూర్చి తపము చేయుట - శివుఁడు ప్రత్యక్షమై వరమును వేఁడుమనుట-వాఁడు తన చేతి నెవరిపైన వేసిన వారు భస్మము కావలయునని వరము కోరుట - శివుఁడావరము నీయగ "ఇది యెంతవఱకు ఫలించునో చూచుటకు నీమీదనే చేయి వేసెద" నని యాతని వెన్నంటుట-శివుఁడు భయపడి పరుగిడి పోవుచుండుట విష్ణువు జగన్మోహినీ రూపమున వచ్చి భస్మాసురుని మోసగించి చంపుట - ఆ దివ్యరూపమును చూచి శివుఁడు భ్రాంతుఁడయి యా మోహినిని వెంబడించుట- మోహినీ యాతనిని ముప్పుతిప్పలు పెట్టుట"— ఇది యిందలి కథ. ఇందు మోహిని పాత్రయొక్క యభినయము జనాకర్షముగ నుండెను.

ఆ రాత్రి యే పురము వెలుపలనున్న శివాలయముచెంతఁ దిరుమూల దేవుని చరిత్రను నాటకముగఁ బ్రదర్శించిరి. ఇందలి కథ "ఉత్తరాపథపు వైష్ణవుఁడొక్కఁడు ద్రావిడదేశమున సంచరించుట-ఆవులనుగాచుకొను శైవుఁడు చనిపోయి యుండుట-యతని కళేబరమును విడువక గోవులుమేఁత మానుట జూచి యతఁడు జాలినొందుట-తన యోగాభ్యాసము వలన నా వైష్ణవుఁడా పశువులను కాచువానిలోఁ బ్రవేశించి తన వైష్ణవశరీరమునొక పొదమాటున దాఁచుట అతఁడావులను దోలుకొని యింటికిఁ బోవుట-తరువాత తన వైష్ణవ శరీరముగానరాక యా వైష్ణవుడట్లు శైవుఁడైన యా కాపు శరీరములోనేయుండి తుదకు శైవమును స్వీకరించుట" ఈ కథ వైష్ణవులు ప్రదర్శించిన మోహినీ భస్మాసుర వలె రక్తి కట్టలేదు.

మఱియొక వీథిలో వైష్ణవులు కొందఱు నృసింహావతార ఘట్టమును బురాణముఁ జెప్పు చుండిరి. వారి కెదురుగఁ గొందరు శైవులు శివలీలలను బురాణము చెప్పుచు, నృసింహుఁడు హిరణ్యకశిపునిఁ జంపిన తరువాతఁ బ్రజలను భయపెట్టుచు లోకమునందిరుగుచుండఁగ వారందఱును బెదిరి శివునిఁ బ్రార్థించిరి. అప్పుడు దేవదేవుఁడైన శివుఁడు శరభరూపమున నరసింహుని సంహరించి, యాతని సింహ చర్మమును ధరించి, కృత్తివాసుఁడని పేరు గాంచెను." అని వ్యాఖ్యానించిరి.

ఇట్లు మఱికొన్ని వీథులలో మఱికొన్ని నాటకములు, పురాణములు, హరికథలు, తోలుబొమ్మలాటలు జరిగినవి. శైవలీలను, బ్రదర్శించిన శైవులను, వైష్ణవలీలలను బ్రదర్శించిన వైష్ణవులను బ్రజలనాకర్షించుకొనుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఆ రాత్రియే శైవవైష్ణవ భక్తులకుఁ బరస్పర మత్సరములు ప్రజ్వరిల్లినవి

మరునాఁ డేకాదశి. శివాలయములలో నభిషేకములు హెచ్చుగ జరిగినవి. జనులు తండోపతండములుగ శివాలయమునకు వెళ్ళి స్వామిని దర్శించుచుండిరి. వైష్ణవులకది కన్నులు కుట్టినట్లయినది. ఆ సాయంకాలము వైష్ణవులు స్వామి నూరేగింపునకు బయలుదేరించిరి. అప్పుడే శివార్చకులు గూడ శివుని యుత్సవ విగ్రహముల నూరేగించుటకుఁ దీసిరి. ఉభయ పక్షములవారును గోట సింహద్వారము కడఁ బరస్పరాభిముఖులై దారసిల్లిరి.

"తొలఁగుడు, దారినిండు, దూరముగఁ బొండ"ని వైష్ణవులు కేక లిడిరి. చీ! చీ!! మేము భవులముఖమును జూడము. తప్పుకొఁనుడని" శైవులఱచుటకు మొదలిడిరి. "ముందు తప్పుకొందురా! లేదా! మీ యుత్సవవిగ్రహములను ముష్టి దేవుని విఱుగగొట్టుమందురా!" అని వైష్ణవార్చకుఁడు గద్దించెను. "ఏమా కండకావరము? మీ నామముల కిగనామముఁ బెట్టించెదన"ని నంబి యాతనిపై నుఱికెను.

"మీ బూదిని బుగ్గిపాలు చేసెద"నని వైష్ణవుఁడు భుజము చఱచెను. పిమ్మట నుభయ పక్షములకు దారుణమగు పోరు ప్రారంభమైనది. ఈ కలి కలమే మనుమసిద్ధి నగరను కల్లోల పఱచినది.

ఇంతలో నచటికి రాజసభనుండి ఖడ్గతిక్కనయును రాజపురుషులును వచ్చిరి. వారిఁ గలహమునుండి విడఁగొట్టుటకా రాజపురుషులెంతయో శ్రమపడిరి. ఆ రెండు పక్షములవారి యొత్తిడిలో నా రాజపురుషులు నలిగిపోయిరి కాని వారిని విడఁదీయ లేకపోయిరి. వారిలో వారు పరస్పరము నొనరించు ప్రహారదానముల ప్రయత్నముగ నా రాజపురుషుల వీఁపులమీఁదగూడఁ బడెను. కాని వారెవరిని గొట్టుటకు సాహసింపలేదు. శైవులందును, వైష్ణవులందును, బరమాదరమున్న తిక్కన యాదేశమట్లుండుటచే వారెవరును హింసా మార్గమున కంగీకరింపలేదు. చేయిచేసికొననిదే యా యల్లరి యడఁగుట కవకాశము కన్పట్టలేదు. కాని వారి ప్రయత్నము మాత్రము వారు విడచి పెట్టక యొనర్చుచుండిరి.

ఇంతలోఁ దిక్కన మంత్రిగూడ నచటికి వచ్చెను. అతని యెడఁగల గౌరవము వలన నిరుపక్షముల వారును గోలాహలమును గొంత యాపిరి. అప్పుడా యమాత్యుఁడు రెండు పక్షములందలి పెద్దలను దనకడకుఁ బిలిపించెను. వారు వచ్చి యాతని యిరు పార్శ్వములందును నిలుచుండిరి. "మీకి తగవు వచ్చుటకుఁ గారణమేమి?" అని యాతఁడు ప్రశ్నించెను.

"అంతనొక వృద్ధవైష్ణవుఁడు మంత్రిగారూ! మా వైష్ణవులను వారునిలువ

నిచ్చుటలేదు విష్ణుదేవుని నిరసించుచు నిన్న రాత్రి పురాణముఁజెప్పి నలు గుఱి దగ్గఱ నానావిధములగు కూతలను గూసిరి అపక్రవర్ణాక్రముఁడగు చక్రివిక్రియము వీరి యర్ధనారి దేవుని కడదిగఁదుడుపేనట॥ లోకభీకరుఁడగు హిరణ్యకశిపుని యుక్కడఁగించిన నారసింహస్వామినిఁజంపిన మొనగాఁడీ తిరిపగాఁడేనఁట। ఆది వరాహ రూపము సణఁచినదిగూడ నాతఁడేనట। ఈ విధముగలేనిపోని కథలను గల్పించి జనులకు వారి మతము వంకఁద్రిప్ప కొనఁజూచు చున్నారు శ్రీవిష్ణుని యంశమందుద్భవించిన పరశురాముఁడు గణపతినిఁబండ్లూడదన్నినపుడా శివుఁడును గివుఁడును పరాక్రమమును జూపఁ జాలెనా॥ ఇంత యెందులకు ఆ జగదేక దేవుఁడైన ఆదినారాయణుని పాద గంగనే గదా॥ వారి శివ్వమితలఁదాల్చెను

అని యీ విధముగఁడినయుపన్యాసము సాగనిచ్చుచుండఁనొక వృద్ధ శైవుఁడు 'చూచితిరా, నాయనలారా॥ దేవాదిదేవుఁడగు శివుని దూషణచేసిన ఈ దురాత్మునకుఁబుట్టగతులుండునా॥ నిన్న రాత్రి నుండియు నిదేవరుస ఆ పరమేశ్వరుని యొక్క యాద్యంతములు వీరి దేవుఁడుగాని బ్రహ్మదేవుఁడు గాని కనుఁగొనఁజాలఁపోయిరి అట్టి యాద్యంత రహితమూర్తివారి కన్నుం కెంత చులకనయ్యెను। గణపతి దేవుని దంతముఁబరశురాముడు చెక్కగా శంకరస్వామి యూరకుండెనఁట ఆ శివ్య వత్సుఁడూరకుండఁజా॥ గంగను మా దేవుఁడు తల దాల్చుటగూడ కొక లోపముగనే చెప్పుచున్నాఁడు ఆ గంగ బ్రహ్మదేవుని కలశములో నుండెడిదఁట। దానితో నాతఁడు వామ నుని పాదమును గడుగునపుడు విష్ణు పాదమునుండి యది పుట్టినదఁట ఇదేమి పురాణగాథ। మత్స్యావతారము వామనావతారము కన్న మొదటిదే గద। ఆ మత్స్యమూర్తి గంగలో జనించి యర్ఘ్య మొసంగుచున్న యిగస్త్యుని చేతఁజిక్కి స్వర్ణమయముగాఁగా నాముని యాశ్చర్యమున దానిని జూచినట్లును, ఓయీ॥ నేను భృగుశాపమున జనించిన శేశవుఁడను నన్ను గంగలో విడిచి పెట్టుమ ని యాతఁడు కోరినట్లును, మత్స్యపురాణములోఁగలదు అదెట్లు పొసఁగును? కావున నీ వైష్ణవ పురాణములన్నియు నసత్యములు గంగ యీ విష్ణుపాదములనుండి పుట్టలేదు ఆ జగదీశ్వరుఁడు గంగను దాల్చు టకుఁగారణము వినుఁడు గంగ యద్భుతలీలఁబొంగ హరివిరించి పురోగ మాసురసుర నికరము కరము భయాక్రాంతులగుచు శివునిఁబ్రార్థించిరి అప్పుఁడు మృడుఁడు తద్గంగను మల్లికాధవళజాతిమౌళిని ధరించెను అనుచుఁ ఒండితారాధ్య చరిత్రమునందలి ప్రమాణములను బాడుచుఎరవశుఁడై తాండ వించెను అట్లు కొంతతడవు తాండవించి ఈ నీరంతయును నజుఁడు హరికాలుగడుగఁబుట్టినదేనా? ఇంతనీరు బ్రహ్మకడ మొదట నెట్లుండెను?

ఈనీరున్నఁగలశము బ్రహ్మాండ భాండ పరిమాణములో నుండవలెను గదా॥ ఆ భాండమతని కడఁబెట్టిన వారెవరు॥ ఆ జలము మొదట నెచ్చట నుండెను॥ ఎవరు బ్రహ్మకడకుఁదెచ్చిరి॥ తన కాలిని గడిగిన నీటికే హరి యింత భయపడి శివుని పాదములపైఁబడనేల॥ ఇదేనా వారి దేవుని సామ ర్థ్యము॥ హరి యను నామమెంత చక్కనిది। కోతిని బాముము, గప్పను గూడ హరి యందురు వారి దేవుడుగూడ నట్టివాఁడే।" అని యుద్రేక పూరి తుడై యేమేమియో వలికెను

ఆ ఎలుకులకు వైష్ణవుఁడు కన్నులెఱ్ఱజేసి 'ఏమీ॥ యీ వితండవాదము॥ హరియనఁగాఁగోతియా। శివ శబ్దమున కర్థమునక్కగాదా। అందుచే వీరి దేవుఁడు నక్కయే। ఓరీ హరిదూషకా। నీ కన్నులు పేలిపోవటదా।" ఏకోహ వై నారాయణ ఆసీత్ నబ్రహ్మానేశానః' అని వేదములు ఘోషించుచున్నవి





హరి తరువాతి వారేగదా బ్రహ్మ రుద్రాదులు. అది నీవు గ్రహించ లేకున్నావు" అని గద్దింప నా శైవనంబి "నోరుస్ను దని యరుపకుము "ఏకయే వరుద్రః" "విశ్వాధికోరుద్రః" యను శ్రుతుల కర్థము గ్రహించితివా?" అని పండ్లు గీటుచు నాతనిపై కుఱికెను. ఈ విధముగ వారు వాదించు కొనుచు నొకరిపై నొకరు పడి గ్రుద్దులాడు కొనుటకు సిద్ధపడుచుండిరి.

అంతనా మంత్రి పుంగవుఁడు వారిని నివారించి "ఓయీ మీకీ వాదన తగదు. మతము పేరునఁగయ్యములాడుటయే ముక్తి మార్గమా? యేమి? శివ కేశవులభిన్నులు ఒక్క మూర్తినే శివనామముతోఁ గొందఱును విష్ణు నామముతోఁ గొందఱును వ్యవహరింతురు. ఆ మూర్తియే యాద్యంతరహితుఁడు. పురాణ పురుషుడు. వేదాంత వేద్యుఁడు. అనిర్వచనీయ తేజోవిరాజమూర్తి. అతఁ డోంకారవాచ్యుఁడు; అనహంకార విరూఢ భావనారాధ్యుఁడు; త్రిభువన దృఢ పంజర శుక విభవ మహితుఁడు; సమస్త విష్టప నిర్మోక భుజంగపతి; అఖిల జగదభిన్నరూపుఁడు; భావనాతీతుఁడు; అతఁడు శ్రుతి సీమంతమణి; ఆశ్రిత వాంఛాపూర్తికరణ చింతామణి; అనతదురిత తమోద్యుమణి; లోకరక్షామణి; ఆ హరిహరనాథమూర్తి మరుత్సరిదా కల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుందర మూర్తి. భావనతత్పరచేతోయుక్త భక్త పర తంత్రుడు. ఆ దేవదేవుఁడు శరణాగత సంశ్రిత భయాపహరణుఁడు. వనమాలికా భుజంగాఽభరణుఁడు భుజగ సమాచరిత శయన భూషణ కృత్యుడు. ఆయద్వైతమూర్తిని భజించి తరింపుఁడు. భారతభూమి యక్షిణ మత కులహతుభితము కారాదు. ఆసేతు శీతాచల పర్యంతము వైదిక మతము వర్ధిలుగాక! అఖిల జనులకు నభ్యుదయము లభ్యమగుగాక! వైదిక మతమునకుఁగవల బిడ్డలైన శైవవైష్ణవమతములు పరస్పర స్నేహముతో మెలఁగు గాక! మోక్ష సామ్రాజ్యలక్ష్మీ సాక్షాత్కారమే పరమ లక్ష్యముగా నుంచుకొనవలెఁగాని కుక్షింభరత్వమునకై కుహనామత ప్రచార భారవహులై విరుద్ధ మతాచారములతో స్పర్ధఁబెంచికొని యొకరి కుత్తుకల నొకరు నొక్కుకొని రాక్షసత్వమును బ్రకటించు కొనుట మన ఆత్మ లక్ష్యము కారాదు. ఎదుటి వారిదైవమును నిందించిన మీ దైవము మెచ్చుకొనుననుకొనుట పొరపాటు. ఇట్టి మిథ్యా వాదములను గట్టి పెట్టి మీ మీ యాలయములకుఁమీరు పొండ"ని వారిని మందలించెను.

వారప్పుడు తమ తమ దైవముల యుత్సవ విగ్రహములున్న పల్లకీల కడ కేఁగిరి. మంత్రి వరుఁడును వారి ననుసరించి యా పల్లకీలకడకు వచ్చెను. అంతవఱకును వారికి జరిగిన కలహముల యుద్రేకపుఁదోపిడిలో నా పల్లకీలు రెండును నొకదాని నొకటి యొరసికొని యుండెను. విగ్రహములు చిందర వందరగా నుండెను. గౌరి యుండవలసిన స్థలమున శ్రీదేవి గలదు. శ్రీదేవి స్థానమును గౌరి యాక్రమించెను. శివకేశవుల విగ్రహములొక దానినొకటి కౌఁగిలించుకొని యుండెను. శివుని కంఠము నందలికపాల మాలికయు వెన్నుని మెడలోని కౌస్తుభ మణియు వియ్యములందు చుండెను. గరుడాశ్వారును నందీశ్వరుడును చిరవియోగానంతరము కలసికొన్న స్నేహితుల వలెఁబరస్పరాలింగన మొనరించుకొను చుండిరి.

అంతనా కవీంద్రుడు చేతులను జోడించి "ఓ దేవదేవా! నీవే విష్ణుదేవుఁడవు; నీవే రుద్రమూర్తివి; అద్వైత స్వరూపుఁడవగు నీ నిజతత్త్వమును గ్రహింపఁజాలక జనులు మాయాంధకారవృతులై నీకు భిన్నభిన్న రూపములను, భిన్న నామములను గల్పించి తాము పరస్పర స్పర్ధలను బెంచుకొనుచుఁ గొట్టుకొనుచున్నారు ప్రభూ!

"కిమ స్త్రిమాలాంకిము కౌస్తుభంవా
పరిష్క్రియాయాం, బహుమస్య నేత్వయ్
కింకాలకూటఃకిమువాయశో దా
స్తన్యంతవ స్వాదు వద ప్రభో మే"

అనుచు నాతఁడు ధ్యాన నిమగ్నుఁడై కన్నులు మూసికొని యట్లే యుండెను. అప్పుడాతని హృదయమున నొక్క యద్వైతమూర్తి సాక్షాత్కరించెను. పద్మమోహినసద్మయోయన నొప్పు పద్మ ముఖికి నుల్లము పల్లవింప భద్రాయిత మూర్తియై యది యొప్పుచుండెను. దానికి రుచక్రియల వైదిక శ్రేణి "విష్ణురూపాయ" 'నమశ్శివాయ' యని ధ్యానించుచుండిరి. ఆ మూర్తి నుండి పెల్లుబికిన కరుణా రసంపు వెల్లువ వలె శిరమున శశిరేఖ జాలువారు చుండెను. హరి నీల స్ఫాటికలో నలరారు సురభి చందనముబలె బొక్కటఁ బుండరీక మొప్పి యుండెను. ఉతదే త్రిలోక రక్షకుఁడనివేసికొన్న ముద్రవలెగళమున గరళపుఁగాంతి చెన్నారెను. ఉరమునసిరికిఁబ్రతిబింబమిచ్చు కౌస్తుభ రత్నపుఁగాంతులు దిక్కుల నిండారెను. ఆ దేవదేవునట్లు ధ్యానించు నా కవీంద్రుడు నిమీలితలోచనుఁడై యుండెను. శైవ వైష్ణవార్చకులు తమ తమ పూజా విగ్రహములతోఁబల్యంకికలనుగొని పోయిరి. కాని యా తిక్కనార్యునిహృదయస్థ దైవ స్వరూపమును ఎవరును గదలింపఁజాలక పోయిరి.

## 6. గురు శిష్యులు

అది యుషఃకాలము. ఆకసము నావరించియున్న తెలికాంతులు మెల్ల మెల్లఁగా నక్షత్రములను మాటు పఱుచుచుండెను. కృష్ణానదిలోఁగార్తికస్నానమొనరించి, పవనుఁడు మందగతులతోవన మార్గమునుండి పోవుచుండఁగాఁ దత్స్పర్శనము నలతలించుక చలించుచుండెను. ఆ లతాగ్రములందలి లతాంతములలో నిద్రించుచున్న మధుకర బృందమప్పుడేలేచి, గొంతెత్తి, మధుర గీతిక లాలపించుచుండెను. శకుంత సంతాన మాగీతికలకు శ్రుతులను మేళవించుచున్నట్లు మధ్య మధ్య మధురముగాఁగూయు చుండెను.

అదియొక వన మార్గము. దారి సన్నముగ నున్నది. దారికిరు ప్రక్కల నున్న పొదలు విరిసిన విరులతో వెలయుచున్నవి. ఆ విరులమీఁది చిరు మంచుకణములలో సరుణ కిరణములు వింతవింత కాంతులతో వెలయుచు నా వనలక్ష్మికిఁగొత్రగా వన్నె వెట్టు చుండెను. ఆ వనమార్గమున నిరువురాశ్వికులరుగు చెంచుచుండిరి. వారిలో నొకఁడు దిక్కనార్యుడు.

రెండవవాఁడు సుమారిరువ దైదేడుల ప్రాయమువాఁడు. బలిష్ఠమైన దీర్ఘకాయముతో నొప్పుచుండెను. శరశరాసనధరుఁడై, బద్ధనిస్త్రింశుఁడై గోదాంగుళిత్రాణుఁడై, యాతఁడు ద్రోణాచార్యుని వెనుకనరుగు విజయునివలె నొప్పుచుండెను. అతఁడు పేరుననేగాదు; పౌరుషమునఁగూడ వీరభద్రేశ్వరుఁడే.

వీరభద్రుఁడు చాళుక్య వంశీయుఁడు. (నిడదవోలు) నిరవద్య పురము రాజధానిగఁగల యొక చిన్న మండలము నేలుచున్న యిందుశేఖరుని ప్రియనందనుఁడు. ఇందు శేఖరుఁడు తన ముద్దులపట్టినిఁదిక్కనామాత్యుని చేతఁ బెట్టుచు "వీని విద్వాంసునిఁజేయు భారముమీది" యని ప్రార్థించెను. పాండిత్యమునందేగాక ధనుర్వేదమునందును, రాజనీతియందును, దిక్కనార్యుఁడు దిట్టయగుటచే, నాతనికప్పగించినచోఁ దన కుమారుఁడు రాజపుత్రున కుండవలసిన విద్యలన్నియుఁబూర్తిగాఁబొందగలఁడనియు యిందుశేఖరుఁడట్లొనరించెను.

బాలకుఁడు బుద్ధి కౌశల్యమును, సూక్ష్మగ్రహణ శక్తియు కలిగి యుండుట మాత్రమేగాక, వినయ సంపన్నుఁడైయుండుటచేత నామంత్రి పుంగవుని యనుగ్రహమున కాస్పదుడయ్యెను. కావ్యనాటకములు, తర్క వ్యాకరణ మీమాంసాది శాస్త్రములు, నాతఁడు కొంత వఱకు నభ్యసించెను. కృష్ణ ద్వైపాయన కృతంబగు భారతామ్నాయమును జెప్పు సందర్భమున నామంత్రి పుంగవుఁడొద లెఱుంగనంతటి యావేశముతోఁజెప్పును. దాని నాకర్ణించు నపుడు బాలుఁడు కావ్యమధువునఁజొక్కి పరవశుఁడగును. అందును విరాట పర్వమన్న నా మంత్రికి మిగులప్రీతి. అది చెప్పునపుడు వినువారు నిద్రాహారములు మఱచి ప్రతిమల వలె నిశ్చేష్టులగుదురు. అందులకుఁగారణమా కథ యందలి మాధుర్యమో! లేక కవిపుంగవుని వ్యాఖ్యాన కౌశలమో!! ప్రతి ఘట్టము గన్నులకుఁగట్టినట్లు ప్రతిపాత్ర యెదుటికివచ్చి మాటాడినట్లు ప్రతి సన్నివేశము ముందు దోఁచినట్లు, వర్ణించుచు, బోధించిన నెవరు పరవశులు గారు! విజయుని విజయ ఘట్టములు వచ్చినపుడు వీరభద్రుఁడు మఱియు

నుత్సాహముతో నాలించును. ఉత్తర గోగ్రహణమందు బృహన్నలచూపిన సాహస కృత్యమాతనికి మిగుల హృద్యముగ నుండెను. సమయము చిక్కినపుడు తానుగూడ నిట్టి వీరకార్యము నొనర్చవలెనని యుబలాట పడుచుండెను. ఆ రాజనందనుఁడా గురుపుంగవుని కడ కావ్య శాస్త్రములను మాత్రమేకాక, రాజకీయ విద్యలనుకూడ నభ్యసించెను. అశ్వారోహణము, గజారోహణము, ధనుర్విద్య, మొదలగునవి కుశాగ్రబుద్ధితో నాతఁడు గ్రహించెను. అస్త్రసంధానము నభ్యసించునప్పుడబ్బాలకుడు తన సద్గురుమూర్తిని ద్రోణాచార్యునిగను, దన్ను విజయునిగను, భావించు కొనుచుండును.

సప్తాశ్వుని యశ్వగమన వేగమునధిక్షేపించుచు వారి యశ్వములు పరుగులిడు చుండెను. వారికనతి దూరమున మార్గమధ్యమున నొక వరాహము గనుపించెను. దానినిఁజూచి, వీరభద్రుఁడు తన గుఱ్ఱమునాపి, చేసన్నచే గురువర్యుని నిలిపి; శరాసనముదీసి, శరము సంధించి, గురిచూచివేసెను. ఆ శరము జివ్వుమనిపోయి యా వరాహ గర్భమున నాటుకొనెను. కాని యది కొట్టుకొనలేదు సరిగదా! యీ షణ్మాత్రము చలింపనైనలేదు. వాఁడాశ్చర్య చకితుఁడై మరియొక వాడియమ్మును విడచెను. అదిగూడ దాని గర్భమున గ్రుచ్చుకొనెను. కాని యొక్కించుకయు నా సూకరము కదలలేదు. అది చూచినంతనే యా గురుశిష్యుల కాశ్చర్యమినుమడించినది. వెంటనే వారు దాని దాపునకుఁబోయిరి.

ఆపంది యంతకుమున్నే యొక ఖడ్గము గ్రుచ్చుకొని చచ్చి పడియున్నట్లు వారు గ్రహించిరి. ఆ కత్తి సగము వఱకు దాని హృదయములోనికి గాఢముగ నాటుకొనినది. సూర్యకిరణములు పడి యా కత్తి తళతళ మెఱయుచుండెను. ఆ ఖడ్గమును వీరభద్రుఁడు ప్రయత్న పూర్వకముగా నూఁడఁదీసెను. దానిపై నేవియో యక్షరములు గూడనున్నట్లున్నవి. కాని యవి రుధిరపూరితలై యుండుటచేతఁజదువుట కనువుగలేవు. చెంతనున్న సెలయేటి నీటిలో వీరభద్రుఁడు దానినిఁగడిఁగి చూడ "రుద్ర" అని వ్రాసి యున్నది. వరాహలాంఛనముగూడ దానిపైఁజిత్రింపఁబడి యున్నది. వీరభద్రుఁడా కరవాలము నాశ్చర్యముగఁదన గురువునకుఁజూపెను. పిదప వారిరువురకు నిట్లు సంభాషణ జరిగినది.

వీరభద్రుఁడు :- ఆర్యా! ఈకరవాలము నాఁటిన తీరుఁబట్టిఁచూడనాతండెవరో సమర్థుడైన యోధునివలెఁగన్పించు చున్నాఁడు! ఏ రాష్ట్రములోనివాఁడో! ఏ వంశములోని వాఁడో!

తిక్కన : రాజకుమారా! దీనిపై వరాహ లాంఛనముగూడ నున్నది. చూచితివా! అది కాకతీయుల లాంఛనము. గణపతి దేవుఁడును, నతని వంశమునందలి రాజపుత్రులును, దఱచుగ నీయడవికివేఁటకు వచ్చుచుందురు. బహుశః యిది యా కాకతీయ వంశము నందలి యే రాజపుత్రుని ఖడ్గమోయై యుండును.

వీరభద్రుఁడు :- ఇంతటి పిరుఁడి పందిని విడిచి వెళ్లుటకుఁగారణమేమై యుండునో! తుదికి కత్తినైను దీసికొనలేదు.

తిక్కన :- దెబ్బతిన్న పంది తప్పించుకొని పరుగున నిందాక వచ్చి యిటఁబడి చచ్చియుండును. ఆ యోధుఁడు దీనినివెదకి, కనఁజాలకపోయి యుండును. ఇంతలో జీఁకటిపడియుండును. అందుచే నాతఁడు వెనుకకు మరలియుండును.

ఈ విధముగఁగొంతతడవు ప్రసంగించుకొనిన పిదప, నా రాజకుమారుఁడాకత్తిని తన కడ భద్రపఱచెను. మరల వారు తమతమ యశ్వముల నధిరోహించి పయనము సాగించుచుండిరి. కొంతతడవైన పిమ్మట వీరభద్రుడు "ఆర్యా! ఇచ్చటికా విశ్వేశ్వరదేశికుని మఠమెంత దూరముండు" నని ప్రశ్నింపఁగా నా కవీంద్రుఁడు సుమారు రెండామడలుండును. మఱియొక రెండు ఘడియలలోఁదేలికగనచటకుఁబోగలము." అని ప్రత్యుత్తరమిచ్చెను. వారి సైంధవములాసన్నని యడవి బాటలోనైనను వాయువేగమునఁబోవుచు నల్పకాలములో నా వనమును దాటినవి.

## 7. కుట్ర

నెల్లూరు పుర బాహ్యమున శివాలయమునకు వెనుక నొక చిన్న గుడిసె గలదు. దాని చుట్టును దట్టముగ డొంకలును, దుప్పలను, నలముకొని యుండుటచేనది యచ్చటనున్నట్లే యెవరికినిదెలియదు. ఆ ప్రాంతమున జన సంచారముండుటకెట్టి యవసరమునులేదు. ఆ యిల్లచ్చట నున్నట్లెఱిఁగినవారక్కన బయ్యనలును, వారియనుచరులగు మఱి కొందఱు మాత్రమే. ఆ యిరువురు రాజకుమారులును, అప్పుడప్పు డక్కడకు వచ్చి నెల్లూరు పురాధీశ్వరుని పాలనముఁ గూర్చియు, ఁదదాస్థానమునఁదమకున్న యాధిక్యమును గూర్చియు విమర్శించు కొనుట జరుగుచుండెను. వారక్కడ నెట్టి రహస్యములైనను నిరభ్యంతరముగఁబ్రసంగించుకొందురు.

ఆనాఁడు వారీ విధముగ సంభాషించుకొనిరి.

అక్కన్న :- బయ్యా! మొన్న యా భట్టుచేసిన పొగడ్తను వింటివిగదా! "అన్య రాజులీడెయఁరు రాయ వేశ్యాభుజంగుఁడైన మనుమజనవిభునక"ని వాడన్నంత నా పలుకులు బల్లెములవలె నా హృదయమున గ్రుచ్చుకొన్నవి. ఆ నిర్వచనోత్తర రామాయణమును గాల్చి తత్కృతి కర్తయైన తిక్కన నాల్కను వేయి చీలికలుగఁజీల్చి, వాఁడు కొండాడుచున్న సిద్ధిరాజుల తలను నేలఁగూలవేయఁజాలని మన పౌరుషములేల? రాచపుట్టువు పుట్టి మన మిట్టి శత్రు జన స్తుతి వచన రచనలను వినవలసి వచ్చుచున్నది. ఆజీవితాంతము మనము పౌరుషముఁజంపుకొని యిట్లు పడి యుండవలసినదేనా? ఈ యస్వాతంత్ర్యమున కెన్నఁటికైనను ముక్తి యుండునా?

బయ్యన :- అక్కా! తొందరపడకు. దేనికైనను గాలము కలసి రావలెను. గదా! మనుమఁడు మన కన్న బలవంతుఁడు. దానికిఁదోడు ఆవులించినఁబ్రేగులు లెక్కపెట్టుఁజాలుధీశాలి తిక్కనమంత్రి. ఆతనికిఁగుడి భుజము వంటివాడు. ఇఁక ఖడ్గతిక్కనకుఁదిక్కయెత్తిన నెవరును నిలువఁజాలరు.

అక్కన :- అట్లయిన నీ క్రుళ్లు మాటలను వినుచుఁగలకాలము పడి యుండవలయుననియే నా నీ యభిప్రాయము?

బయ్యన :- ఎందుకట్లుండును? నేను మాత్రము పునుబులుసునుదిన లేదందువా? పౌరుషవంతమగు సూర్యవంశమునఁబుట్ట లేదందువా? ఈ యాస్థానమున మనకున్న చుల్కఁదనము నాహృదయమును మాత్రము వేధింప లేదందువా? ఈ సిద్ధిరాజొక్క రాజకీయ విషయమైనను బకనీయఁడుగదా! ఒక్క మంతనమైన మనతోఁ జేయఁడుగదా! ఎప్పుడుఁదిక్కన మంత్రి తోడిదే లోకమని



యెన్నుచుండును. తిక్కరాజేదియో తిక్కరాజని కొనెడివారము. అతనికన్న నెక్కువతిక్క యతని కుమారుఁడగుఁ నీ సిద్ధరాజ నకు సిద్ధించి నట్లున్నది. "ఉబుసుపోక కేద్రైనను ద్యోగమిప్పింపవయ్యా" యని కోరఁగా నతఁడు యుక్తి యుక్తముగా "మన కుద్యోగులు వెలియైనారాయేమి? మీకూ సేవకవృత్తి యెందుక"ని పలికెను. ఒక్క యున్నతోద్యోగి కాని, యొక సేవకుఁడుగాని మన మాట వినరుగదా!

అక్కన :- మఱి నీ కతనిపై నభిమాన మెందులకు?

బయ్యన :- అభిమానముఁ జూపుచున్నవారెవరోయి! ఎదిరించుటకు శక్తి లేక తల వంచుకొని యూరకుండి, చేతకాని తనమును బ్రకటించుచున్నాము కాని!

అక్కన :- నేఁడు లేనిశక్తి రేపెక్కడ నుండియైన వచ్చునా? శత్రువుల నెదిరించుటకు భుజబలము చాలనప్పుడు బుద్ధి బలమును వినియోగింప వలయును. బయ్యా! ఎందుకు వ్యర్థ ప్రసంగము? నేనొక్కటే మాట యడుగుచున్నాను. చెప్పుము. సిద్ధిరాజు నణఁగఁ ద్రొక్కుట నీ కిష్టమా? కాదా?

బయ్యన :- ఎందులకిష్టములేదు! అపాయము లేని యుపాయమందులకవసరము కదా! నీ కట్టి యుపాయము దట్టినఁ జెప్పుము. నేనుఁగూడ దోడ్పడెదను.

అక్కన :- అలాగుదారికి రా! ఇప్పుడు ముందురాజ మంత్రులను వేఱు చేయవలయును,

బయ్యన :- అది మన మెట్లు చేయగలము?

అక్కన :- ఎందుకుఁ జేయలేము! పురుషప్రయత్నమునకు సాధ్యముకానిది యుండునా? విను! మొన్న సభలో భారత రచన కృతికి మనుమసిద్ధి యుబలాటపడుట నీవు చూచియే యున్నావుగదా! కవి దాని నాతనికిఁ గృతి నీయనిచోఁ దల గొఱిగించి, యూరేగించి, మద్య మాంసములను గుడిపించెదనని రాజు పలుకుట నీవు వినియే యుంటివి గదా!

బయ్యన :- ఔనౌను! తిక్కన కవి బ్రాహ్మణ పుట్టువు పుట్టుట చేత నా పలుకులు సహించెను గాని యదే రాచబిడ్డయినచో నీ పాటికిఁ దాను పొడుచుకొని చచ్చుటయో, యెదటివారినిఁ బొడిచిచంపుటయో చేయకుండునా!

అక్కన :- ఆ పలుకులామంత్రి నెంతకలఁత పెట్టెనో నీ కేమి తెలియును? అవి యాతని హృదయమున ములుకులవలె నాఁటుకొనినవి గాఁబోలు. వెలవెల బారుచున్న మోమును వంచుకొనెను. అతఁడు మిక్కిలి గంభీరుఁడుగావున నావిన్నదన మెవ్వరును గుర్తించుట కవకాశము లేక పోయినది. కాని నేను మాత్రము స్పష్టముగ గుర్తించితిని. ఈయంశము నాధారముగఁజేసికొని మన మిప్పుడు కథల నల్ల వలయును. మొట్ట మొదట నా కవిని రాజాస్థానమున నడుగుపెట్టనీయకుండఁ జేయువలెను. పిమ్మట "నీవా విధముగ భారతకృతిని గూర్చి పలుకుట చేతనే యాతఁడు విముఖుఁడై, కొలువునకు రాలేదని" రాజుతోఁజెప్పవలయును. ఈ విధముగ వారికి స్పర్ధలు పెంచవచ్చును.

బయ్యన :- మంత్రిని రాజాస్థానమునకు రాకుండ నెట్లరి కట్టఁగలము.

(అక్కన యాతని చెవిలో నేదియోచెప్పెను.)

బయ్యన :- రాజముద్ర యట్లు లభించును? అది దుస్సాధము. అక్కన తనకొంగున ముడివైచుకొనియున్న యొక యుంగరమును విప్పి, "ఇదిగో రాజ ముద్రిక" యని జూపెను. బయ్యన యాశ్చర్యచకితుఁడయి దానిని పరీశీలించుచుండెను.

బయ్యన :- ఇది నీకెట్లు లభించినది?

అక్కన :- దైవము నా చేతిలోఁ బెట్టినాఁడు ఇది యెట్లు వచ్చిననేమి? మన మిప్పుడరయ వలసినది కర్తవ్యము కాని యంగుళీయక వృత్తాంతముగాదు.

బయ్యన :- సరేఁ తరువాతఁజేయవలసిన పనియేమి?

అక్కన :- ఎప్పుడు మనము మంత్రిని వేరుచేయుదుమో అప్పుడు రాజు యొక్క బలము మూడువంతులు ముప్పాతికయణఁగినదని నమ్ము. అటుపిమ్మట మన మాతనినిదేలికగాఁ బదచ్యుతునిఁ చేయవచ్చును.

బయ్యన :- వెఱ్ఱివాఁడా! అంత తేలికగా జరుగు పనియాయది? త్రాచుపాము వంటి ఖడ్గ తిక్కన మాట మఱచితివి కాఁబోలు.

అక్కన :- దానికేమిలే! ఖడ్గ తిక్కన కత్తిఁబట్టఁగలఁడు కాని యుక్తిఁబన్నఁజాలఁడు. అపర యుగంధరుఁడైన మంత్రికే మనము జంకవలెను.

బయ్యన :- సోదరా! సాహసము పనికిరాదు. అర్థ బలమును, అంగ బలము లేనిదే యిట్టి యుద్యమమును గూర్చి దలపెట్టరాదు. ఎవ్వనినైన సమర్థు నాశ్రయించి మనమీ పనిని దుదముట్టింపవలెనుగాని స్వతంత్రించుట వలనఁ బ్రయోజనము లేదు.

అక్కన :- నేను మాత్రమంత తెలివి తక్కువ వాఁడననటోయి. అప్పుడే దానికిఁదగిన వానిని గూడ నూహించియే యుంచితిని.

బయ్యన :- ఎవఁడాతఁడు.

అక్కన :- ధాన్య కటకపురాధీశ్వరుఁడగు కుళోత్తుంగ రాజేంద్రచోడుఁడే దీనికి సమర్థుఁడు. అతని ముత్తాత యయిన పృథ్వీశ్వరుని మనుమసిద్ధి రాజు తండ్రియగు తిక్కభూపాలుఁ డింతకుఁ బూర్వము చంపియున్నాడు గదా! ఆ విషయము నాధారముగఁ జేసికొని మనుమసిద్ధిపై నాతని సహాయముఁ బొందవచ్చును.

బయ్యన :- నెల నాఁడిప్పుడు కాకతీయులకు సామంత రాజ్యముగనున్నది గదా!

అక్కన :- ఔను. గణపతి దేవునెట్లయిన నెదిరించి స్వాతంత్ర్యమును బొందవలయునను నుబలాటమాతనికి కున్నట్లు వింటిని. మనకి నెల్లూరు స్వాధీనమగుటలో నాతఁడుతోడ్పడినచో మన మాతనికి గణపతి దేవునెదిరించుటలోఁ దోడ్పడెద మనవచ్చును.

బయ్యన :- గణపతిదేవు నెదిరించుట యాతనికిజన్మలో సాగనిపని. శివదేవయ్య మంత్రి యున్నంత కాలమూ రాజవరునిఁదేరిచూచుటకైన నెవరికిని దరముగాదు.

అక్కన :- ఆ విషయమునే నెఱుఁగనందువా! మనపని పూర్తియగువఱకు మనుమసిద్ధిరాజు నాతఁడు నాశనమొనరించు వఱకు నాతనికిఁ దోడ్పడుదమని చెప్పవలెను. మనకు విజయము ప్రాప్తించిన పిమ్మట మనము గూడఁదగిన యధికారము సంపాదించుకొన్న పిమ్మట నాతని వాగ్దానమును ద్రోసి పుచ్చవచ్చును.

బయ్యన :- ఇంత మిత్ర ద్రోహమా!

అక్కన :- అంత పాపభీతియే యున్నచో మూఁడు యుగములు ముందునకుఁ బోవలసి యుండును. కార్యవాదికిట్టి కుశంకలున్ననెట్లు నెగ్గగలఁడు? సత్యము అహింసయనునవి ప్రధానమగు గుణములుగా

నుండవలసిన చౌద్ధులే యీదినములలోఁ దన్నియమములను బాటించుచున్నట్లు నటించుచున్నను జాటుచాటునఁ గల్లలాడి మానము దినుచుండ మనమా వానిని పాటించువారము? యుద్ధమునందు హింసయు, నసత్యము లేకుండ జరుగుచున్నదా? బయ్యా! ఇట్టి వెట్టి వెట్టి యనుమానములను గట్టిపెట్టుము. కార్యదీక్షకుఁగంకణముఁగట్టుము. భుజబలము లేకున్న యుక్తి ప్రయుక్తులచేనైనను విజయమును సాధింప వలయును.

వారిరువురు నిట్లు కొంతతడవు యోచించుకొని నాఁటి మంతనమును జాలించి కోటలోనికి వచ్చిరి. అది మొదలు వారుతఱచుగా నచటగలిసికొను చుండిరి.

## 8. మిత్ర ద్వయము

కృష్ణా తరంగిణీ తీరమున విశ్వేశ్వరదేశికుని మఠ మెప్పుడును వేద నినాదములతో వెలయుచుండును. విశ్వేశ్వర దేశికులు సాంగ వేదవేది. శివపూజా నిరతుఁడు. శైవసిద్ధాంత సారము నితఁడు పూర్తిగ నాస్వాదించెను. ఈ గురుపుంగవుఁడు శివతత్వసారమను నొక గ్రంథమును గూడ రచించెను.

అనాఁటి శైవులకు బసవఁడా దర్శ ప్రాయుఁడు. బసవఁడు యజ్ఞోప వీతమును, బ్రాహ్మ్యమును, వర్జించుట చేత నప్పటి వీరశైవులు గూడ వర్ణ ధర్మములందు మిగుల నాదరముఁజూపుచుండెడివారు. మనదేశికుఁడు మాత్రము నాఁటి వీరశైవులవలెగాక బ్రాహ్మణ ధర్మములందు మిగుల నాదరముఁజూపు చుండెడివాఁడు. అతఁడు పూర్వాచార పరాయణుఁడు ధర్మ మారాపలంబి. అతఁడు తన పేర నెన్నెన్నో శివాలయములను నెల కొల్పించెను. కృష్ణానది చెంతనున్న యతని మఠము దగ్గర గూడ నొక శివాలయమున్నది. ఆ మఠమున నీ త్యాగమూర్తి యొక సత్రమును గూడ గట్టించెను. అందెందఱెందఱో పథికులు భుజించి వెళ్ళుచుందురు ఆ సత్ర మన్ని జాతులవారికి నన్నదానమొసఱ్చును. ఊరఁబోసిన యుసిరికకాయలు, మంచినీళ్లు, మజ్జిగ మొదలగువానిచేతఁ బరితృప్తిఁ జెంది యచటి యరుగుల మీదఁగొంతతడవు పండుకొని, తమ మార్గాయాసము దీరిన పిమ్మటఁబోవు చుండెడు పథికులస్తోత్ర పాఠములతో నెప్పుడును దత్ప్రాంతము కలకలలాడు చుండును.

ఆ సత్రము ప్రక్కనొక పెద్ద పాఠశాల గలదు. అందు షట్శాస్త్రము లను, వేద త్రయమును, నేర్పుదురు. ఆ పాఠశాలకు ఋగ్యజుస్సామ వేదములు జెప్పువారు ముగ్గురును, బదవాక్య ప్రమాణ సాహిత్యాగమములకు వ్యాఖ్యానముఁజేయు వారేడుగురును, నుపాధ్యాయులుగలరు. ఆ యుపాధ్యా యులెల్లరును విద్యా పరిపూర్ణులే. అచట గురుశిష్య సంబంధము తండ్రి కొడుకుల సంబంధము కన్నఁబరస్పర ప్రేమ పూరితమయి యుండును

ఆ పాఠశాలకు నాతిదూరమున నొక పెద్దవైద్యశాలగలదు. అది రెండు భాగములుగ విభజింపఁబడియున్నది అందొక భాగము ప్రసూత్యా దులకును స్త్రీరోగములకును నిర్ణయింపఁబడినది. రెండవ భాగమునందఱకును జికిత్సచేయుదురు శివాలయము, సత్రము పాఠశాల, వైద్యశాల, దేశికుని యధికారముననే యుండెను వీనియందేమాత్రము లోపములేకుండ నాతఁడు నడిపించు చుండెను.

విశ్వేశ్వర దేశికులా మఠములోని వారికేగాదు యాపదాంధ్ర భూమికిని దేశకులనియే చెప్పవచ్చును. దక్షిణ హిందూ దేశమందలి యానాఁటి రాజ్య ములలోఁ గాకతీయ సామ్రాజ్యము ముఖ్యమైనది. ఆ సామ్రాజ్యమున కధీశ్వరుఁడైన గణపతి దేవునకు దీక్షాగురుఁడీతఁడు. అంతేగాక చోళకాళ చుర్యమాళ వంశీయులగు నానాఁటి దక్షిణ హిందూ దేశపుముఖ్య రాజులెల్లరు నీతని కడ దీక్షను బొందిన శిష్యులే ఆ రాజ పుంగవులెల్లరును దమకిరీటములు దాఁకునటుల నితని పాదములకు నమస్కరించి ధన్యాత్ములగు చుందురు

వారి దృక్పథమున శంభుండును విశ్వేశ్వరశంభుండును భిన్నవ్యక్తులు గారు. సాక్షాదీశ్వరుఁడే తమ్ముద్ధరింప జేయుటకీ రూపమున వచ్చెనని వారి నమ్మకము.

పాఠశాలకొక ప్రక్క నొక పెద్ద భవనముగలదు. ఆ భవనము విదేశాగతులైన పండితులకు బసగా నిచ్చుటకు నిర్మింపఁ బడినది. ఆనాఁడా సౌధమత్యంత మనోహరముగ నలంకరింపఁ బడినది. లోపల బల్లలను చేర్చి వానిపై నెన్నెన్నో గ్రంథములనునిచిరి. అందు సంస్కృత గ్రంథములే హెచ్చు. గ్రంథముల ప్రక్కఁ గూర్చుండుట కాసనములును, పుస్తకములనునుచుటకు వ్యాస పీఠములును జేర్పఁబడి యుండెను. ఆ భవనమునకు వెలుపలిగోడలపై "మహామంత్రికి స్వాగతము" నియు, "నుభయకవి మిత్రునకు స్వాగతము"నియుఁ బెద్ద యక్షరములలో వింత వింత రంగులతోఁ జిత్రింపఁబడి యుండెను. విద్యార్థులు భవన ద్వారములను గుసుమమాల్యాదులతో వింతవింతగ నలంకరించిరి. కొందఱు విద్యార్థులు క్రొత్త తాటియాకులను సేకరించి పొత్తములుగ నమర్చు చుండిరి.

తిక్కనామాత్యుఁడు రావలసిన దినమది. ప్రతి సంవత్సరమును గార్తిక మాసమున నాపాఠశాలలో వార్షికోత్సవములు జరుపుటయు, నా నందర్భమునఁ దిక్కనామాత్యుఁడటకు వచ్చి సారస్వతోపన్యాసము లిచ్చుటయు కొన్ని దినములు భారత పఠన మొనర్చుటయు నాచారము.

విశ్వేశ్వరదేశికునకుఁ దిక్కనార్యుఁడు బాల్యస్నేహితుఁడు. దేశికునివలె నితఁడు గొప్ప శివభక్తుఁడు. "మహేశ్వరాం ఘ్రికమలధ్యానైకనిరతుఁడనని యతఁడు నిర్వచనోత్తర రామాయణమునఁ జెప్పికొనెను. దేశికులవలె నాతఁడు సమస్తవేదవేదాంగ కోవిదుఁడు. కవిత్వ విషయమునదేశికున కందని చెయియే. దాతృత్వవిషయమున వారొకరి కొకరు తీసిపోరు. పెక్కండ్రు రాజులకు దీక్షాగురుఁడాతఁడయిన —గొందఱు రాజకుమారులకస్త్ర గురుండితఁడు ఈ మిత్రద్వయము తఱచు కలిసి కొనుటయు, బౌద్ధ జైనమతముల వలన హిందూమతమునకు వచ్చు ముప్పును గూర్చి ముచ్చటించు కొనుటయు, జరుగుచుండును.

అల్లంత దూరముననేయమాత్యుని, జూచి యధ్యాపకులును, విద్యార్థులును, నెదురేగి యుచిత మర్యాదల వేదపారాయణము లొనర్చుచుఁగొని వచ్చిరి. విశ్వేశ్వర గురువులాతనిఁ గుశల ప్రశ్న పూర్వకముగ సత్కరించిరి. అనల్ప కావ్య కల్పనా శిల్పపారగుఁడగు కవియు, నద్వితీయ కార్యఘటనా చతురుఁడగుమంత్రియు, విద్యానిధియు, సుగుణాస్పదుండును, నగునొక పనుఁడు వచ్చినప్పుడు వారి యానందమునకు మేర యుండునా?

నాఁటి నుండి భారతపఠనము జరుగుచుండెను. అన్ని పర్వములందును గలికి విరాటోద్యోగ పర్వములన్నఁ బ్రీతిమెండు కావున విరాటపర్వము మొదలుపెట్టబడినది. ఆ తిక్కనార్యుని కంఠ స్వరము శ్రవణా నందకరముగా నుండెను కథ, నానారసాభ్యుదయోల్లాసియై యింపు గొల్పుచుండెను. దానికా కవి పుంగవునివ్యాఖ్యాన పటిమ మఱింత వన్నె వెట్టుచుండెను. ఉత్తర గోగ్రహణ ఘట్టము వచ్చినది. ఉత్తరుఁడు అంతఃపురకాంతలకడ ప్రగల్భములాడుట, బృహన్నల సారథ్యమును గూర్చి యధిక్షేపించుచు నెట్టకేల కంగీకరించుట, బృహన్నల కవచాదులను తొడుగుకొనుటలో నస్త వ్యస్తము నటించియెల్లరను నవ్వించుట, యుద్ధమునకేఁగుట ఉత్తరుఁడా సైన్యమును జూచి బెదిరి రథము నుండి యుఱికి పారపోఁ జూచుట, మొదలగు ఘట్టములందలి శ్లోకముల నా కవీంద్రుఁడు వ్యాఖ్యానించు నప్పుడు మూలము నందలి విషయముల కన్న హెచ్చుగ జెప్పుచు నా కథ హాస్యరసాస్పదమయి యాకర్షణముగ నుండునట్లు వర్ణించెను. ఆ యుత్తరునకు మూడిన పరిస్థితియే తనకు సంభవించినచో శత్రు సైన్యము నెట్లు రూపు మాపియుండునో యని వీర భద్రుఁడొక్కని ట్టూర్పుఁబుచ్చెను.

అట్టి యెడ నా వినుచున్నవారి యవధానమునకు నానందమునకు నునొకించుక యాటంకము కల్గునట్లొక నూతనపురుషుఁడా వంకకు వచ్చెను. అతఁడు విశ్వేశ్వరదేశికునకు నమస్కరించి యేదియోమెల్లగఁ జెప్పెను. అంత నాదేశికుఁడు నాఁటికిఁ గావ్య పఠనము జాలింప నియోగించెను. ఆ మంత్రిసత్తముఁడును, దేశికుఁడును, నూత్నపురుషుఁడును, వీరభద్రుఁడును, దప్ప నన్యులట నుండి వెడలిపోయిరి వారీ విధముగ సంభాషించుకొనిరి.

విశ్వేశ్వర :— (తిక్కన వంకఁదిరిగి) మిత్రమా! ఈతఁడ థర్వణుఁడను పండితోత్తముఁడు.

తిక్కన :— ఓహో! వ్యాకరణ శాస్త్రమున నపార పాండిత్యమును సంపాదించిన కారికా కారులు వీరేనా!

అధర్వణ :— చిత్తము నాపాండిత్యమే మాత్రము లెండు మీ వంటివారి కడ గణుతింపఁదగినదిగాదు.

తిక్కన :— ఇంతకుఁ బూర్వమే మీపేరు వినియున్నాను. ఇప్పుడు మిమ్ము దర్శించు భాగ్యము గూడ లభించినది. మీరుజైన మతావలంబకులని వినియున్నాను. నిజమేనా?

అధర్వణ :— (ఒక్క నిట్టూర్పుఁ బుచ్చి యూరకుండును).

విశ్వేశ్వర :— మిత్రమా! వీరిజైనమతపుఁదీరువేరు. మనమద్వైతమునకుఁ జేయు సేవకన్న మఱి యొక విధముగ హెచ్చుసేవను వీరేచేయుచున్నారని చెప్పవచ్చును. వైదిక మతమును గబళించుటకై జైనులెన్నో ప్రయత్నములు జేయుచున్నారు గదా! ప్రక్కలోని బల్లెమువలె వారికి నే నుండుట కష్టముగనున్నది. నేను రాజులకు దీక్షనిప్పించుచూ నీ పరిస్థితిలోనైనను వైదిక మతమును నిలఁబెట్టుట వారికి సహింపరానిదిగ నున్నది. అందును నేను గణపతిదేవునకు దీక్ష నిచ్చినది మొదలు నామీఁదను కాకతీయ ప్రభుని మీఁదను వారికిఁ గక్ష మఱింత హెచ్చినది.

తిక్కన :— ఔనౌను! ఆ కాకతీయులు మొదట జైనులే గదా!

విశ్వేశ్వర :— అందుచేతనే వారికా దుఃఖము. ఆ గణపతి ధరాకాంతుఁడా జైనుల గర్వమెన్నియో విధముల నణఁగఁ ద్రొక్కుచునే యున్నాఁడు. కాని వారు మఱియుఁ జెలరేగుచున్నారు. అందుచేతనే యీ హైందవమతాభిమాని కపట జైనుఁడయి వారితోఁ గలిసి సంచరించుచు వారి కుట్ర లెప్పటి కప్పుడు నాకుఁ దెలియజేయుచున్నాఁడు. వెంటనే నేను నా శిష్యులైన రాజులలో నెవరితోడనో జెప్పి యా కుట్ర లనురూపు మాపుచున్నాను.

అధర్వణ :— ఆర్యా! అట్టి కైతవమతావలంబనము పాపహేతువని నే నెఱుఁగుదును. ఐనప్పటికిని నేను బతితుఁడనైనను వైదిక మతము పతనము గాకుండఁ జూడవలయునని నా తలంపు.

తిక్కన :— మీ కృషి యపూర్వము. మీమత సేవ యపారము.

విశ్వేశ్వర :— అధర్వణా! ఇప్పుడేమి హాని తలపెట్టిరంటివి

అధర్వణ :— గణపతి దేవుని ప్రియకుమారుఁడగు రుద్రదేవుఁడు మొన్న వారి చేఁజిక్కినాడు.

వీరభద్రుడు :— అయ్యో! రాజకుమారునే యంతసులభముగ వారు బంధింపఁజాలిరా!

అధర్వణ :— "నీ వెట్లు పట్టు బడితివ"నినేను రహస్యముగ నడిగితిని. అతఁడు "నేను వేటకు వనమునకు వెళ్ళి యొకవరాహమును

## ట్రాజిడీ

నువ్వు ఆధారంగా
నా కలల తీగలు
అల్లుకుంటుంటే
చూసి,
ఆనందపడ్డా
తీరా అవి
ఎదిగి
కన్నీళ్ళ పువ్వుల్ని
పూశాయ్!

శ్రీ ఎస్. హనుమంత్రావ్.

## వర్తమానం

చెట్లు కూలుస్తున్నారా
కూల్చండి కూల్చండి
నాగరికత పేరుతో
నగరాలు పెంచండి

రాళ్ళు పేలుస్తున్నారా
పేల్చండి పేల్చండి
కలవారి భవనాలు
చెమటోడ్చి కట్టండి.

చట్టేట్టు చదువుతున్నారా
చదవండి చదవండి
చదువుల్లో సారాన్ని
తెల్లవాడి కమ్మండి.

కవిత అల్లుతున్నారా
అల్లండి అల్లండి
కర్రిమొద్దు నరంటికి
జరీ రంగు పులమండి.

శ్రీ కొడవంటి లీలామోహనరావు

వెంటఁదరుముచు సైనికులకు దూరమైతిని. విధి ప్రతికూలమగుటచే తన సమ్ముల పొదిలోని శరములయి పోయినవి. తోడనే నాకత్తి నావరాహముపై విసరితిని. అట్టి సమయమున నిరాయుధుఁడనగు నన్నువారవలీలగఁ బట్టి బంధించిరి"అని చెప్పెను.

వీరభద్రుఁడు :— గురుదేవా! మనము చూచినకత్తి యతనిదేయై యుండును. పాపమా రాజకుమారునివారేమి బాధలు పెట్టు చున్నారో గదా!

అధర్వణ :— గణపతిదేవుఁడు జైనులననేక విధములుగ హింసించుచున్నాఁడఁట. అతని కుమారుఁడు చేఁజిక్కినప్పుడు ప్రాణములతో విడిచి పెట్టరాదని వారి పట్టుదల, చిత్రవధ చేయంపథలెనని వారి యూహ.

విశ్వేశ్వర :— చంపింపవలయుననియే తలపెట్టిరా! ఎంతదారుణము ఈ విషయమా కాకతీయ రాజేంద్రునకుఁ దెలిసిన వార్తను, వారివసదులు నీపాటికి నాశనము కావా!

వీరభద్రుఁడు :— జైనులహింసాపరులేమో! వారెట్లు మానవప్రాణములు దీయుటకు సమ కట్టుచున్నారు.

అధర్వణ :— ఇట్టి ఘాతుక కృత్యము లొనర్చుటకు వీరొక ప్రత్యేకదళ మేర్పఱచుకొనిరి. యమభట దళము వంటి యీదళ మెన్నెన్ని హింసలు చేయుచున్నదో లెక్కింపఁ దరము గాదు. మత రక్షణ కొఱకాదళము హింస మార్గమవలంబించినను దప్పులేదఁట ఆహింస మాత్రము జైనవసదుల ప్రాంతమున జరుగరాదఁట. అందుచేతనే దానికి రెండు క్రోసుల దూరమున వారు చిత్రవధచేయుటకూహించుచు నేఁటి రాత్రియే వానిని జంపుటకు నిశ్చయించుకొనుచున్నారు. కాలాతిక్రమణమయిన గణపతి దేవునకుఁ దెలియునని వారి భయము.

విశ్వేశ్వర :— ఇప్పుడు మాత్రము దెలియకుండునా!

అధర్వణ :— పిల్లికన్నులు మూసికొని పాలుద్రావుచు లోకమెల్ల గ్రుడ్డిదనుకొనుట సహజము గదా!

విశ్వేశ్వర :— నేఁడే చంపుటకు నిశ్చయించు కొన్నారా! ఈలోగా మనమా గణపతి దేవునకు వర్తమాన మంపుటయు నతఁడు వచ్చుటయు జరుగదే! మనమాబాలుని రక్షింపవలయును.

వీరభద్రుఁడు :— అవును. నేనొక్కఁడనే పోయి యా కార్యమునెఱవేర్చుకొని రాఁగలను.

తిక్కన :— నాయనా! సాహసమువద్దు నేనుగూడ నీతో వచ్చెదను.

విశ్వేశ్వర :— మఱి మీరే శ్రమపడవలెను. మా మఠమునందుఁ నంతటి వీరయవంసు లెవరును లేరు.

అధర్వణ :— నే నావంకకు వచ్చిన, వారు నను గుర్తించెదరు. మఱి వారి వసదులలోన నన్నుండనీయరు.

వీరభద్రుఁడు :— దీని కెందఱో రావలసిన నిమిత్తమేమి కలదు? నేనొక్కఁడనే చాలుదును. మా గురువులు గూడ వచ్చిననీకఁ జెప్పవలసినదేమి?

అని యాతడింకనునేమియో జెప్పఁబోయి యుత్తర కుమార ప్రజ్ఞలని వారను కొందురనికాఁబోలుసంతటితో నూరకుండెను. వధ్యస్థానమున గుర్తించుటకుఁ దగిన యానవాళ్లను వారధర్వణు నడిగి, తమ తమ యశ్వములనాయత్త పఱిచి ప్రయాణ సన్నాహమొనర్చిరి.

(ఇంకా వుంది)

# కలగూరగంప

## 'విద్వత్కవి భూషణ'
## శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

మద్రాసులోని చూళైకి చెందిన సామిపిళ్ళై వీధిలోని [illegible] నంబరు చిన్న యిల్లు. అందలి చిన్నగదిలో ముతక ఖద్దరులాల్చీ, ముతకధోవతి ధరించిన వృద్ధమూర్తి సదా రచనలోనో, పరిశోధనములోనో మునిగి వుండేవారు. సంస్కృతాంధ్రములను మథించి రచనామృతమును పంచిపెట్టిన కవి. విమర్శకులు, పరిశోధకులు వారు. గదినిండా గుట్టలుగానున్న పుస్తకాల మధ్య వాల్మీకివలె సారస్వత యోగమగ్నులుగా వెలిగిన పుణ్యమూర్తి శ్రీ వేదం వేంకట కృష్ణశర్మగారు. ఎవ్వరు వెళ్ళినా అభిమానముతో ఆదరించే హృదయులు శ్రీ శర్మగారు.

శ్రీ శర్మగారు 1889లో కార్వేటి నగర ప్రభు సమ్మానితమైన వేదము కుటుంబములో జన్మించారు. తమ పదునైదవ యేటనే కార్వేటి నగరమున "ఆమ్నాయ నిలయ" మను గ్రంథాలయమును నెలకొల్పిరి. ఉదరపోషణార్థము కడప మండల మందలి కోడూరులోని మిషనరీయగు రెవరెండ్ సి. స్క్రీబాగారి ఆహ్వానంపై క్రైస్తవ గ్రంథములను ఆంధ్రీకరించు వుద్యోగమున చేరారు. కొందరు మిత్రులు, శిష్యులు సహకరించుటతో "జ్ఞానోదయ నిలయ" మను గ్రంథాలయమును స్థాపించారు. అంతలో స్వాతంత్ర్యోద్యమము వారి నాకర్షించినది. శ్రీ శర్మగారు, వారి శిష్యులు శ్రీయుతులు నారు నాగనార్య, చమర్తి చెంగల్ రాజుగారలు జాతీయోద్యమ ప్రచారమున పాల్గొనిరి. సేవా దీక్షితులగు శర్మగారు కోడూరులో బాలభటోపాధ్యాయ శిక్షణాశిబిరమును నెలకొల్పిరి. గ్రంథాలయోద్యమము, బాల భటోద్యమము వారి నెక్కువగా ఆకర్షించినప్పుడు మిషన్ మేనేజ్‌మెంటుతో అభిప్రాయ భేదములు రాగా వుద్యోగమును విరమించుకొని "సనాతన ధర్మ ప్రబోధిని" యను గ్రంథ ప్రచురణ సంఘమును స్థాపించిరి. కొంత కాలము నాయుడుపేట నుండి వెలువడిన "వర్తమాని" యను క్రైస్తవమత పత్రికకు సహాయ సంపాదకులుగా నుండిరి. నాలుగేళ్ళ తరువాత మద్రాసు వెళ్ళిరి. అచట సెంట్‌పాల్స్ హైస్కూలు, సెంట్ క్రిష్టఫర్ [illegible]నింగ్ కళాశాల, తరువాత శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానంవారి వున్నత పాఠశాలలలో ఆంధ్రోపాధ్యాయ పదవులను అత్యంత ప్రతిభావంతముగ నిర్వహించి 1950లో వుద్యోగ విరమణ మొనర్చిరి. శ్రీ శర్మగారు నిరంతర అధ్యయన ప్రవృత్తిగలవారు. ప్రాచీన ఆధునాతన రచనా ప్రక్రియలలో సిద్ధహస్తులు.

శర్మగారి సాహిత్య కృషికి తలమానికము వంటిది వారి "శతక వాఙ్మయ సర్వస్వము." ఆంధ్ర సారస్వతమున కది యొక అమూల్యమగు ఆభరణము. "శతక సాహిత్యము ఆంధ్రవాఙ్మయ నందనారామములలో స్వైర చర్య మొనరించు నొక మనోహర పుష్ప వాటికా ఖండము, వందలాది శతకములను సేకరించి ఆ శతకములలోని కావ్య విశేషములను విడదీసి చూపినవారు శర్మగారు. ఆయా శతకములలో ఆయా కవులు వాడిన తెలుగు పలుకు బడులు జాతీయములు, సామెతలు, నుడికారపు సొంపులు మున్నగు వానిని విశదీకరించిన అత్యుత్తమ పరిశోధకులని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వారిని ప్రస్తుతించిరి. శతక వాఙ్మయ సర్వస్వము యొక్క ప్రథమ సంపుటము (475 పుటలు) మాత్రము వెలువడినది.

శ్రీ శర్మగారు దాదాపు ఏబది కృతులను రచించారు. వాటిలో కుందమాల (దిఙ్నాగుని నాటకమున కాంధ్రీకరణము) భామినీ విలాసము, ఊరుభంగము, నెహ్రూ కావ్యము, బాలచరితము, శ్రీ మద్రామాయణ మహత్వము, తేనెసోనలు (మూడు సంపుటములు) అతి ప్రసిద్ధములు. కీర్తి గాములుగాక, నిష్కాములై విశ్వశ్రేయ లక్ష్యముతో రచనలు సాగించిన మనీషి ఆయన. ఆయన స్వేచ్ఛా ప్రియులు, ఒకరిని యాచించిన వారు కారు. వారి ప్రార్థనా పద్యము చూడుడు.

"కోటి వచ్చునుగాక, మోమోటలేని
సరసతయె లేని, యౌదార్య సరణిలేని
వాక్పతిన్ బ్రీతిగనని దౌర్భాగ్యులిండ్ల
నన్ను పడిగాపు సేయకు కన్నతల్లి".

వారి రచనలలో గొన్ని విశ్వ విద్యాలయ పరీక్షలకు పాఠ్యపుస్తకములుగ నుండినవి. సరస్వతీ కటాక్షము పూర్తిగా నుండినదిగాని లేమివారిని వెంటాడినది, రాష్ట్రీయ పండితోపాధ్యాయ పరిషత్తు వారిని "విద్వత్కవి భూషణ" బిరుదముతో సత్కరించినది" 18-7-1961 రాజంపేటలో కడప మండల మందలి శిష్యులు వారిని ఘనముగ సన్మానించిరి. ఆనాటి సన్మానోత్సవ సభాధ్యక్షులు, అప్పుడు లోకసభ అధ్యక్షులుగ నుండిన శ్రీమాన్ మాడభూషి అనంత శయనం అయ్యంగారు.

ఉద్యోగ విరమణానంతరము శర్మగారు ఆంధ్రవాణి, మాతృసేవ, ఆంధ్ర మహిళ పత్రికా సంపాదక వర్గమున పనిచేసిరి. నిర్విరామంగా సాహిత్యార్చన మొనర్చి దైహికంగా, మానసికంగా, ఆర్థికంగా యిబ్బందులకు గురియైనప్పటికి ఆ జన్మాంతము రచన గావించి తరించిన మహనీయులు శర్మగారు. వారు 1970లో దివంగతులైరి.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## బసవేశ్వర వచనం

డబ్బున్న వాళ్ళు
శివుడికి కోవెళ్ళు నిర్మిస్తారు.
పేదవాణ్ణి
నేనేంచేయ్యగలను?
కాళ్ళే స్తంభాలు
శరీరం ఆలయం
శిరస్సు శిఖరం
బంగారు కలశం.
కూడల సంగమ దేవా, అవధరించు!

స్థావరాలన్నీ శిథిలమైపోతాయి
జంగమాలే నిలుస్తాయి.

—బసవణ్ణ, 820 వచనం.

మధ్యయుగపు వీరశైవ ఉద్యమానికి నాయకుడు బసవణ్ణ. అతడు రచించిన వచనాలు వీరశైవ మతానికి ముఖ్య సాహిత్యం. పై నుదహరించిన "వచనం" కన్నడ వచనాలన్నిటికీ ప్రాతినిధ్యం వహిస్తుందని చెప్పవచ్చు. వీరశైవమనే ఈ తిరుగుబాటు ఉద్యమపు ముఖ్య లక్షణాలన్నిటినీ ఇది సూచిస్తుంది.

హిందూదేశంలో దేవాలయాల్ని సాధారణంగా మానవశరీరపు ఆకారంలో నిర్మించడం సంప్రదాయం. దేవాలయ నిర్మాణపు ఉత్సవం అంకురార్పణతో ప్రారంభమౌతుంది. కొంత మట్టిని తవ్వి, విత్తనాలున్న పాత్ర (కుండ) నిఖూడ ఉంచుతారు. ఆ అంకురించిన విత్తనాలనుండి ఆలయమూ మానవ శరీరంలా పెరుగుతుందని అభిప్రాయం. ఆలయపు వివిధ భాగాలకి శరీరావయవాలపేర్లే ఉంటాయి. రెండు ప్రక్కలనీ హస్తాలనిగాని పక్షాలనిగాని పిలుస్తారు. స్తంభాన్ని పాదం అంటారు. పైకప్పు శిఖరం, అంటే తల. మూలవిరాట్టుఉండే చీకటి గదిని గర్భగృహం అంటారు. అంచేత ఆలయం అంటే రాళ్లు. ఇటుకలతో కట్టిన శరీరాకార నిర్మాణం అన్నమాట.

కాని చరిత్రలో క్రమంగా ఈ ఉత్ప్రేక్ష మరుగున పడిపోతుంది. ఆలయ ఆకృతికిఉండే, మానవ శరీరంతో సారూప్యం మనుషులు మరిచి పోతారు. అంటే అది కేవలం ఒక ప్రాణంలేని కట్టడంగా మిగిలిపోతుంది. బసవేశ్వరుని వచనం మన దృష్టిని నిర్జీవ దేవాలయంనుండి జీవంగల దేవాలయంవైపు మళ్ళిస్తుంది. ప్రతీకనుండి మూల సత్యానికి మళ్ళిస్తుంది.

ప్రతి గుడి మానవ శరీరంలాంటిదైతే, ప్రతి శరీరమూ ఒక గుడి లాంటిది, ఇది దాక్రిక బంధం. దేవాలయమూ దేహాలయమూకూడా భగవంతుడి నివాస గృహాలే. కొందరు భక్తుల జీవితగాథలుకూడా ఈ విషయాన్ని గుర్తుచేస్తాయి. ఉదాహరణకి, ఘంటాకర్ణుడు తనని తనే శివుడికి బలి ఇచ్చుకున్నాడు. ఎలా? అతడి శరీరం శివాలయానికి గుమ్మం అయింది; బాహువులు ద్వార బంధాలయ్యాయి; తల గుడిగంటగా మారింది.

పై "వచనం" కర్తృత్వానికీ అస్తిత్వానికీగల తేడానికూడా సూచిస్తుంది. డబ్బున్నవాళ్లు దేవాలయాలు "కట్టించ" గలరు. ఏం 'చేసినా' వాళ్ళే భగవంతుడి నివాసాలు కాలేరు. భక్తులు బీదలైనా, తమ దేహాలే ఆలయాలు కనుక, తామే భగవద్గృహాలు కాగలరు. అదీకాక, చేసినది అశాశ్వతం; అయినది శాశ్వతం. దేవాలయాలు మానవ నిర్మితాలయితే దేహాలయాలు దైవసృష్టి.

స్థావరాలకీ జంగమాలకీగల భేదం గుర్తించడం వీరశైవుల ఆలోచనలో ప్రధాన విషయం. 'స్థావర' పదం "స్థితి' ని తెలియజేస్తే 'జంగమ' పదం గమనాన్ని సూచిస్తుంది. స్థావరమంటే ఒకచోట ఉండేది, కదలికలేనిది, ప్రాణంలేనిది, జంగమమంటే కదిలేది, కదిలించేది, ప్రాణం గలది. అంచేత స్థావరాలైన రాతి కట్టడాలకంటె జంగమాలైన శివభక్తులు అధికులుకదా!

వీరశైవంలో జంగాలంటే సన్న్యసించిన శివభక్తులు. శివస్తోత్రాలు చేస్తూ గ్రామగ్రామాలకి తిరుగుతారు. జంగాలు శివుడి అవతారాలని ఒక నమ్మకం. ఈ విధంగాచూసినా, స్థావరాలైన కోవెలగాని, లింగంగాని, భగవంతుడిని సూచించే ప్రతీకలు మాత్రమే. జంగాలు సాక్షాత్ శివరూపాలు ఈ వచనంలో బసవణ్ణ ప్రతీకకంటె స్వయం శివుడే పూజనీయుడని ధ్వనింపజేస్తున్నాడు. మానవ శరీరం వెంటనే స్ఫురింపజేస్తుంది; రాతికోవెల మరచి పోతుంది. అంచేత ధనికులు కట్టిన రాతి కోవెళ్ళకంటె బీదజంగాలే నయం.

ధనవంతులకీ దేవాలయాలకీ దగ్గరసంబంధం; భగవంతుడికీ పేదవారికీ దగ్గర సంబంధం. ఈ రెండు సత్యాలనీ 1—4, 5—8 పాదాలలో కవి సూచించాడు. మన దేశంలో ప్రముఖ దేవాలయాలన్నీ మహారాజులో మహా ధనవంతులో నిర్మించినవే. ఆ మహా నిర్మాణాలు. శిల్పకళ ఉట్టిపడే స్తంభాలు, మండపాలు, గోడలు, శిఖరాలు, సర్వాభరణభూషితాలయిన విగ్రహాలు దైవభోగం కోసం మడిమాన్యాలు—ఇవన్నీ సామాన్యజనులకి చేతనయినది భక్తి మాత్రమే. అదే గొప్ప అంటాడు బసవణ్ణ.

వీరశైవం కేవలం మత సంబంధమైన ఉద్యమం కాదు. దానికి ఆర్థిక, సాంఘిక కారణాలుకూడా ఉన్నాయి. ఈ విప్లవం ధనికుల మీద బీదల విప్లవం; వైదిక బ్రాహ్మణుల మీద శూద్రుల, అధమ వర్ణస్థుల తిరుగుబాటు; సంస్కృత సాహిత్యం మీద కన్నడ సాహితీకారులు ఎత్తిన ధ్వజం; మార్గ సంప్రదాయాలకి వ్యతిరేకంగా దేశీసంప్రదాయులు ఎగరేసినజండా; పండితుల మీద పామరుల, సామాన్యుల ధిక్కారం; పాషాణ హృదయాలమీద, రాతి దేవుళ్ళమీద మానవ నేత్రాలు కురిపించిన అశ్రువర్షం, అగ్నిధార, రక్తతర్పణం, భక్తి కవిత్వం.

ఈ విప్లవాన్ని పై 'వచనం' నాటకీకరిస్తున్నది.

డబ్బున్న వాళ్లు
శివుడికి కోవెళ్లు నిర్మిస్తారు.
వెంటనే వచ్చే పాదాలు ధనిక, బీద తేడాని గుర్తిస్తాయి.
బీదవాణ్ణి
నేనేం చెయ్యగలను ?

ఏమీ 'చెయ్యలేక పోవడాన్ని' గుర్చి కవి నిస్పృహ పొందుతాడు. కాని తరువాతి పాదాల్లో ఈ నిస్పృహనుండి మేలుకుని, ఏమీ చెయ్యలేక పోయినా తానే ఒక నడిచే దేవాలయం కాగలడని గుర్తిస్తాడు. ఆఖరి మూడు పాదాలు తేడాని స్పష్టం చేస్తాయి. కట్టిన (లేదా కట్టించిన) నిర్మాణం ఎప్పటికైనా కూలిపోతుంది; కాని ఒకసారి దేహం దేవుడి నివాసం అయితే అది అమరం అవుతుంది. శాశ్వతం అవుతుంది.

వీరశైవంలో గురువు, లింగం, జంగం-ఈ మూడు ప్రధాన అంగాలు, నిజమైన భక్తుడికి మూడూ భగవత్స్వరూపాలే. లింగం ప్రాణంలేనిది; జంగం ప్రాణి అయినా నిజానికి స్థావరం జంగమాల మధ్య తేడాలేదు. కాని జంగమరూపుడైన భక్తునివిడిచి స్థావరమైన గుడిని, లింగాన్ని మాత్రమే పూజించడం అవివేకం. ఈ అజ్ఞానాన్ని బసవణ్ణ ఖండిస్తున్నాడు.

ఆఖరిపాదం "జంగమాలే నిలుస్తాయి". ఇక్కడ నపుంసకలింగం వాడడంలో కవి, జంగాలనే మనుష్యులనేకాక, స్థావరాలుకాని జంగమరూపాలన్నిటినీ సూచిస్తున్నాడు. ఈ విధంగాకూడా జంగమ శబ్దార్థం విస్తృతమై, శాశ్వతత్వాన్ని సూచించేందుకు ఉపయోగపడింది. శివలింగం కన్న చిత్తశుద్ధి ముఖ్యమని ఈ వచనం సారాంశం.

బసవణ్ణ క్రీ. శ. 1106—1167 మధ్య జీవించాడు. బిజ్జలుడనేరాజు దగ్గర మంత్రిగా ఉండేవాడు. అతడు శివభక్తుడే కాక కవి, సంఘసంస్కర్త, రాజకీయవాది. పేదసాదల పక్షాన నిలబడినవాడు, వర్ణాశ్రమ ధర్మాలని, కర్మకాండని నిరసించాడు. ధనాన్ని, పదవిని, బంధువుల్ని, యజ్ఞోపవీతాన్నీ విసర్జించి, కులాతీత సమాజాన్ని సృష్టించి, పటాటోపాలులేని శివ భక్తని ప్రచారంచేశాడు. తర్వాత వచ్చిన అల్లమప్రభు, అక్కమహాదేవి వంటి 'వచన' కవులకు మార్గదర్శకుడయ్యాడు. కన్నడ సాహిత్యంలో బసవణ్ణ, ఇతరుల వచనాలూ అజరామరాలు.

(స్పీకింగ్ ఆఫ్ శివ అనే పుస్తకానికి ఎ. కె. రామానుజన్ వ్రాసిన ఉపోద్ఘాతం ఆధారంగా )

## మరికొన్ని బసవేశ్వర వచనాలు :

1\.

ఊబిలో దిగబడ్డ
ఆవులా అటూ
ఇటూ అర్రులు చాస్తూ
అరుస్తున్నాను.
ఆ పశుపతే ఆదుకోవాలి
కొమ్ములు పట్టి
లేవనెత్తి
ఒడ్డెక్కించాలి.

2\.

చందమామలా
రోజుకో కళగా
పెరుగుతూంది నా భక్తి.
ఈ లోగా రాహువులా
ఈ ప్రపంచం—
గ్రహణం విడిచేది
ఎప్పుడో కదా !

3\.

బలికోసం తెచ్చిన మేకపిల్ల
తోరణాలకోసం తెచ్చిన మామిడాకుల్ని
తినేసింది. బలి ఇచ్చాక
మేకని వండుకు తిన్నారు భక్తులు
వాళ్ల మాత్రం
ఎంతకాలం ఉంటారు ?

4\.

చెట్టుకి నోరు
వేళ్ళ దగ్గర ఉంటుంది
మొదట్లో నీళ్ళుపోస్తే
చిగుళ్ళు వచ్చిపడతాయి.
భగవంతుడి నోరు
పేదవాళ్ళ దగ్గరుంది
వాళ్ళని తృప్తిపరుచు

5\.

నోరంతా అబద్ధాలు
చూపుల్లో విషపుకోర్కెలు
దేవుడెలా ఉంటాడు మనసులో ?
యజమాని ఇంట్లో ఉంటే
గుమ్మంలో గడ్డి మొలుస్తుందా ?
ఇల్లంతా పాడుబడి ఉంటుందా?

6

సీట్లో నానబెడితే
రాయి మెత్తబడుతుందా ?
గంటల తరబడి ధ్యానిస్తే
మనసుకి నిలకడ వస్తుందా ?
భక్తిలేని పూజార్లు
నిధికి కాపలాఉండే దెయ్యాలు.

7\.

పిల్ల తల్లి అయినవేశ్య
విటుణ్ణి ఆహ్వానిస్తే
ఏవరికీ న్యాయం చెయ్యలేదు.
పిల్లకి పాలివ్వలేదు.
ప్రియుడి ప్రక్కన పడుక్కోలేదు.
భక్తిలో ఓ కాలూ
ప్రపంచంలో ఓ కాలు అయితే
ప్రయాణం ఎలా సాగుతుంది ?

8\.

ఈ భక్తి
మనకొద్దు.
ముందుకెళ్ళినా
వెనక్కొచ్చినా
అంపంలా
హృదయాన్ని
కోస్తుంది
పాము పుట్టలో
చెయ్యి పెట్టాక
పాము కరవదా మరి ?

9,

నంసారమనే బండరాయి
కాలికి కట్టేరు.
భక్తి అనే కర్ర దూలాన్ని
నేను పట్టుకున్నాను.
ఒకటి తేలనివ్వదు.
రెండోది ములగ నివ్వదు.
ఎలా ఒడ్డెక్కిస్తావో, స్వామీ!

10\.

నంసార సాగరపు అలలు
ఉవ్వెత్తుగా లేస్తున్నాయి.
నా హృదయాన్ని తాకి
తడిపేశాయి.
పీకలమీద కొచ్చాయి.
నోటమాట
రాకుండా అడ్డుపడుతున్నాయి.
కళ్ళు కనిపించడం లేదు.

# భారతి
## కథలు రాసేవారికి మనవి.....

భారతిలో ప్రచురణకి పరిశీలనార్థం చిన్న కథలు పంపవలసిందిగా రచయిత(త్రు) లకి మనవి చేస్తున్నాము.

రచనలు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి

కథలు 12 అరరావు కాగితాలకి మించకుండా ఉంటే మంచిది

అనువాదాలు, అనుసరణలు పంపరాదు

ప్రచురణకి స్వీకరించని రచనలని త్రిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరచి పంపాలి

రచనలని సంపాదకుడు, భారతి, సాహిత్య మాసపత్రిక, ఆంధ్రపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ – 520003 అన్న చిరునామాకి పంపాలి

అయ్యో, అయ్యో, మునిగి
పోతున్నాను!
ప్రభూ, నా పిలుపు విను!

(అనువాదాలన్నీ వ్యాస రచయితవి.)

కె. గోదావరిశర్మ

# కొన్ని పిట్టల [పక్షుల] పేర్లు

ఇటీవల చందుపట్ల గ్రామంలో [నల్గొండ జిల్లా] కొత్తోజు లచ్చయ్య (వయస్సు 65 సం॥లు) ముచ్చపోతుల నర్సయ్య గారలను కలసికోవడం జరిగింది. వీళ్ళిద్దరూ పిట్టలని వేటాడే వాళ్ళు. మా తెలుగు క్లాసులో పిట్టల ప్రసక్తి వచ్చినప్పుడు మా గురువుగారు డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారు పిట్టల పేర్లని సేకరించమని ప్రోత్సహించారు. ఆ ప్రేరణతో ఆ వేటగాళ్ళను కలిసికొని ఈ క్రింది 127 జాతుల పిట్టల పేర్లని సేకరించాను. వీటికి వివరాలు కూడా సేకరిస్తున్నాను.

ప్రస్తుతానికి ఈ పట్టికతో సరిపెట్టుతున్నాను.

1. ఊర పిచ్చుక 2. గరి పిచ్చుక 3 శీతువ 4. పెద్ద శీతువ 5. కొత్త శీతువ 6. బంద శీతువ 7. పాలపిట్ట 8. వటీక 9. వడ్ల పిట్ట (వడ్రంగిపిట్ట) 10. హంసపిట్ట 11. కినుపిట్ట 12. పొడికంటి (గుడ్లగూబ) 13. కోకిల 14. లవంక 15. బుర్క 16. గద్ది బుర్క 17. కొంజ 18. పొట్టికొంజ 19. సెలగ 20. లంబాడి సెలగ 21. చీమసెలగ 22. గర్కసెలగ 23. బాపని సెలగ 24. బురుబుంగ 25. బాతు 26. పెద్దబాతు 27. పావురము 28. అడవి పావురము 29. ఎనుగుల వెంకటయ్య 30. పిగిలి పింఛం 31. మంగలి పిట్ట 32. బైరపిట్ట 33. కుందేటి సాలువ 34. బోద 35. లంబాడి బోద 36. గద్ద 37. తెనెగద్ద 38 బొల్లిగద్ద 39. తెల్లగద్ద 40. కోడి 41. బొల్లికోడి 42. చీమకోడి 43. టర్కికోడి (తొండంకోడి) 44. నేల కోడి 45. నిప్పుకోడి 46. నీరుకోడి 47. సిలాక్ ముసలాయ్ కోడి 48. జుట్టుపిట్ట 49. కొంగ 50. ఎర్రకొంగ 51. గుడ్డికొంగ 52. ఎర్ర కాలు కొంగ 53. నల్లమూతి కొంగ 54. మసిరెకొంగ 55. గాడిద కొంగ 56. నల్లమెడకొంగ 57. జమ్మిపిట్ట 58. జావ్విపిట్ట 59. కాకి 60. చమురుకాకి 61. లొటిపిట్ కాకి 62. పొట్టేరగాడు 63. సాకలి గిజిగాడు 64. సింతపువ్వుపిట్ట 65. పావులనారిగాడు 66. గింజుగ్గు 67. రికపిట్ట 68. కేర్జపిట్ట 69. ఉల్లెందపిట్ట 70. పెద్దఉల్లెందపిట్ట 71. పూరేదు 72. జిలకంతె 73. పెద్దజిలకంతె 74. తొండల జోసిగాడు 75. గొంగడి ముసుగు 76. రామచిలుక 77. సముద్రుని చిలుక 78. పంచరంగుల చిలుక 79. పచ్చచిలుక 80. బండిజిన్క 81. రాతిజిన్క 82. ఎలిసెపిట్ట 83. గొంద్ల పిట్ట 84. గువ్వ 85. పచ్చగువ్వ (పోల్కాలు) 86. పొదగువ్వ 87. తుర్కగువ్వ 88. జిట్ట గువ్వ 89. బెదగువ్వ 90. రాగిగువ్వ 91. గోతెరగాడు 92. వసువు ముద్ద 93. కొంసలిపిట్ట 94. సువ్వనాతిపిట్ట 95. తెల్లతోకపిట్ట 96. కొరెందపిట్ట 97. లకుముకిపిట్ట 98. చెవులపిట్ట 99. బంగార గిజిగాడు 100. పరికెపిట్ట 101 గోరెంక 102 తంగెడు గోరెంక 103. భూపాలంపిట్ట 104. పచ్చతోకపిట్ట 105. మయిలనార 106. శంక రాయ్‌మొద్దు 107. కన్నెలేడిపిట్ట 108. భూమిపావ 109. ఎర్రతోక పిట్ట 110. నేలపిట్ట 111. చిన్నకమిలి 112. బూడిదపిట్ట 113. తంగెడు పూత 114. కిరిటి 115. పెద్దజుట్టుపిట్ట 116. తోగయ్యపిట్ట 117. ఎర్ర బొల్లన్‌గాడు 118. చిటికెంపిట్ట 119. జాల్‌మాయ్‌పిట్ట 120. అరెబుర్ద 121. నల్లకోకలపిట్ట 122. నెమలి 123. తారావు 124. పత్తెనా 125. కెలువా 126. జెరిపింద్రి 127. కెర్‌కుష్‌గో.

ఈ పిట్టలన్నీ ఇప్పుడు ప్రస్తుతం బతికివున్న జాతులే. పై వేటగాళ్లు వేటాడి పట్టి, చంపి తినినవే.

నేను కొంగ, బాతులనుకూడా పిట్టలుగానే గుర్తిస్తున్నాను. చీమకోడి, టర్కికోడి వంటివి స్వదేశానివి కాక పోవచ్చును. కొన్ని పిట్టలకు పూర్వ శబ్దాలుగా మనుష్యులలోని కులాల పేర్లుండడం గమనార్హం. గాడు, గువ్వ, పిట్ట వంటివి. ఈ పేర్లలో చాలావాటికి మలి శబ్దాలుగా ఉన్నాయి. స్త్రీ, పులింగ విభజన శబ్దాన్నిబట్టి గ్రహించే విధానం పిట్టల పేర్లలో లేనట్లే అనిపిస్తుంది. (గాడు మొ॥నవి చేర్చినప్పుడు తప్ప) చివరి ఐదు పిట్టల పేర్లు ఎరుకలి భాషలోని పేర్లు. ఎరుకలజాతివారు చెప్పినవి. తెలుగుపేర్లు ఏమిటో తెలియలేదు. భూమిపావ, కిరిటి, భూపాలంపిట్ట, వసువుముద్ద, సువ్వనాతిపిట్ట వంటిపేర్లు హృద్యంగా ఉన్నాయి. ఇంచుమించు అన్ని పేర్లకి రెండేసి శబ్దాలు ఉండడం, అందులో మొదటిది గుర్తింపుకోసం చెప్పే విశేషణంగా ఉండడం, గమనార్హం. పావురము, బాతు, కొంగ వంటి ఏక శబ్దనామాలు తక్కువగా ఉన్నాయి. " వట్రీక, కిరిటి " వంటి పేర్లలో మధ్య అచ్చును తగ్గించడం, పొడిగించడం మనం చేయకూడదనిపించింది. ఆ వేటగాళ్ళిద్దరూ ఇట్లాగే ఉచ్చరించారు. గొంగడి ముసుగు పిట్ట మనిషి గొంగడి ముసుగు వేసికొంటే ఎట్లా ఉంటుందో తన రెక్కలతో కప్పుకొని అట్లా కన్పిస్తున్నది. సింతపువ్వ పిట్ట, తంగెడుపూత, చెవులపిట్టలుకూడా అలాంటి పోలికల చేతనే ఏర్పడి ఉండొచ్చును. జిజ్ఞాసువులింకా ఈ పిట్టలపై వివరాలు రాస్తే బాగుంటుంది.

డి. నర్సయ్య.

# విప్లవకవిత్వ భాష-శేషేంద్ర

శ్రీశ్రీ 1940లలో విప్లవ కాన్‌సెప్ట్ ప్రప్రథమముగా ప్రవేశపెట్టి నారనియు, ఆ కాన్‌సెప్ట్‌కు తగిన కవిత్వభాష శేషేంద్ర కవితలలో ("మండే సూర్యుడు", "నా దేశం నా ప్రజలు", "గొరిల్లా", 1974-77) ప్రారంభమయినదనియు డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు ప్రతిపాదించారు (భారతి అగస్టు 1985).

విప్లవమును మన కవులు ఎంత లెవర్లీగా తెచ్చుచున్నారో కదా!
విప్లవ కాన్‌సెప్ట్ శ్రీశ్రీదా?

"విప్లవ" మనేమాట శాంతిపర్వంలో భీష్ముడు వాడినాడు. ధర్మమునకు సంభవించు మహాద్విపత్తును విప్లవమనినాడు. వ్యవస్థకు సంభవించు బలవత్పరిణామమును విప్లవమని మనమనుచున్నాము. క్రాంవెల్ ఉద్యమము, జాకోబిన్ (ఫ్రెంచి విప్లవము), కెమాల్‌పాషా తిరుగుబాటు, బోల్షివిక్ విప్లవము ఇట్టివి. విప్లవకాన్‌సెప్ట్ అనునది ఏ యొకనినుండి ఉద్గమించునది కాదు. క్రాంవెల్ రిపబ్లిక్‌కు బీజాలు కొన్ని శతాబ్దముల క్రితమే నాటబడినవి. సోషలిస్టు విప్లవ శాస్త్రముల నమునకు బ్రిటిష్, ఫ్రెంచి, జర్మను మేధావుల రచనలు పునాదులు. కాన్‌సెప్ట్‌లు కవులనుండి రావు. శాస్త్రజ్ఞుల (ఇందు తాత్వికులు. ఆర్థిక శాస్త్రజ్ఞులు చింతకులుందురు) నుండియే వచ్చును. ఫ్రెంచి విప్లవమునకు

మూలపురుషులు విజ్ఞాన సర్వస్వకారులు (ఎన్‌సైక్లోపిడిస్టులు) విప్లవము కవుల పద్యములవలన రాదు. కోడి కూసినందువలన తెల్లవారదు. తెల్లవారుట సూచించు కోడి కూత. అనాటికే ఫేషనబుల్ అయిన విప్లవ పరిభాషను శ్రీశ్రీ వాడినను, విప్లవ కాన్‌సెప్ట్ శ్రీశ్రీది కాదని నా మతము. గోగోలు "కోటు" (ఒక చిన్న కథ) నుండి రష్యన్ కథానికలు వచ్చినవని అన్నట్లు, తెలుగులో అన్ని విప్లవ కాన్‌సెప్టులు ఉన్నవ "మాలపల్లి" నుండి వచ్చినవి. ఈ విషయమును వేరు వ్యాసమున వివరించెదను. అరే! "మాలపల్లి" ప్రోసులో ఉన్నది. మేము మాట్లాడుచున్నది కవిత్వము గురించి యందురా? (గద్యం కవీనాం నికషం వదంతి) అనికదా చెప్పిరి. సంస్కృతములో చాల పద్య కావ్యములకంటె గద్యములోనున్న "కాదంబరి" యే గొప్పది. "మాలపల్లి" లోని గద్య రచన చిత్రచిత్ర శైలులలో ఉండి, పద్యకావ్యములను తలదన్నుచున్నది. విప్లవ కాన్‌సెప్ట్‌నే కాక, విప్లవ వైవిధ్యముల స్వరూప స్వభావములను అవిష్కరించిన అగ్రగామి "మాలపల్లి" విప్లవసంబుద్ధి, విప్లవ పరిభాష (ఇడియం) విప్లవపంథ, విప్లవ సంవిధానము అన్నియు "మాలపల్లి" లో కలవు, పద్యరచనలనే తీసికొందము. గురజాడ "దేశభక్తి" (1910) గేయమందు, గరిమెళ్ల "మా కొద్దీ తెల్ల దొరతనము" (1922) గేయమందు కలయట్టి విప్లవ స్పృహయైనా శ్రీశ్రీ, శేషేంద్ర రచనలలో కలదా? వీరిది మార్క్సిస్టు విప్లవము, వారిది స్వాతంత్ర్య సమరము అందురా? ఇంపీరియలిజం అనేది కేపిటలిజం పరాకాష్ఠ అను విషయము మరచిపోరాదు. అందుకే వారిది శ్రేష్ఠతర విప్లవము. బోల్షివిక్ విప్లవ పూర్వాపర కాలములలో వెలసిన పుష్కిన్ లెర్మొంటోవ్, నెక్రసోవ్, మాయకోవస్కి వంటి కవులతో శ్రీశ్రీ శేషేంద్ర రచనలపోల్చిన, వీరివి బుడిబుడి పలుకులు చిలుక ప్రసంగములను నది స్పష్టమగును. పోనీ - నెరుడా, లోర్కాలతో పోల్చవచ్చునా? నజింహిక్మెత్ తో సరితూగగలరా? ఆ కవుల జాతి జీవనములో పడుగు పేకలు (ఇంగ్లీషులో "వూఫ్ అండ్ వార్ప్" అనెదను) గా కలసిపోయింది. మన వారి విప్లవ రచనలో? ఇవి కార్మిక కర్షకులకే అర్థము కావు ఇక పండితులకేమర్థమగును? అర్థమగుటయన్న వారి అంతర్యమేమనియే నా ప్రశ్న విప్లవము, విప్లవము అని వ్రాయుచున్నారు. అది వారు చేయుదురా? మమ్ముల చేయుడందురా? నాలుగంకెల జీతములు టంచనుగ నెల తుదిలో స్వీకరించు "ప్రొఫెసరు" లకు గౌనర్మెంటు గులాములకు విప్లవదెబ్బ ఏమి తెలియును? షాహుకారుల ఎదుట చేతులు నలుపుకొనుచు, పాటకపు జనులను గ్రుడ్లురిమి చూచే మధ్యమతరగతి మర్యాదా మనుషులా విప్లవము తెచ్చునది? సోషలిస్టుద్యమము ప్లాటినం జూబిలీ జరుపుకొనుచున్నను, ఎచటవేసిన గొంగడివలె నున్నది. రైతును ఎక్స్‌ప్లాయిటు చేయి పరిస్థితిని 14వ శతాబ్దపు మంచన స్పష్టముగా వర్ణించెను. ఆయన "అపహరించు" అనుపదము వాడెను. ఇట్లపహరించు వారిలో సేవావృత్తి బ్రతికెడువారు" (వీరే నేటి "వైట్‌కాలర్ ఎంప్లాయిస్") "విద్యోపజీవికలు" (వీరే నేటి విశ్వవిద్యాలయ ప్రొఫెసరులు) ఉన్నారు. మంచన సంఘమును ఆర్థికముగా వర్గాలుగ విభజించెను. నేటి మన సంఘము వర్ణాలుగా అడ్డముగాను, వర్గాలుగా నిలువుగాను చీలిపోయినది. మన కవులకు క్రాంతిదృష్టి లేదు. ఒక ప్రణాళికలేదు. ఒకధ్యేయము లేదు. విప్లవ సంబుద్ధి లేదు. భారతీయులకు విప్లవభేషజము ఒంటబట్టినదా అని నా యనుమానము. ప్రారంభమున తాటాకు మంటలవలె, అంతయు గడబిడ. కాలము గడుపనిండు. అంతయు సద్దుమణిగి పోవును. ఎవరి సీలుగంటి ("స్లాట్") లో వారు కుదురుకొని పోవుదురు. దగాపడిన సాధారణ మానవుడు ముక్కున వ్రేలిడికొని ఆశ్చర్యపడి పోవుచుండును.

డా. తంగిరాల వెంకటసుబ్బారావుగారు ఇచ్చిన శేషేంద్ర రచనలలో విప్లవ కవిత్వ భాషయుండు పంక్తులనుండి విప్లవకవిత్వ భాషా పదములను ఇచ్చుచున్నాను.

ఒక కొత్త శకం, ఒక బాంబు, ఒక తుపాకి, ఒక శతఘ్ని, నికృష్ట నాగరికత, బందూకు, ఎర్రకాంతుల జెండాలు, తుపాకులు కాయండి, పోట్లాట, రక్తప్రవక్త, ఎర్రకోరిక, నా కొడవలి, ఉరితీసిన వీరుడు, విప్లవ ఎంత. నా చేతులు నా ఖడ్గాలు, నా జేబుల్లో కోకిలలులేవు, నేను ఎర్రటి కోడిపుంజును ఒక గ్లాసెడు రక్తం, విప్లవ జెండా, నా గుండెచీల్చి, ఎర్రకాంతుల జెండాలు, ఎర్ర కోరిక. ఎట్‌సెటరా.

ఎర్ర, ఎర్ర, రక్తం, రక్తం వంటి పునరుక్తులు హిడింబాసురుడు స్టేజి మీదికివచ్చి "రక్తం రక్త నరవాసన, నరవాసన" అనినట్లున్నవి. ఒక బిచ్చగాడు భీకర వేషము వేసికొని "యమగండం, బ్రహ్మగండం" అని యరచుచు పోవుచుండ, దానికి భయపడ్డ గృహిణులు బిచ్చము తప్పకుండ వేయుచుండిరి. అలాగున్నది, ఈ విప్లవ భాషాగోల. కానీ భూస్వాములు పార్శ్రామిక నేతలు ఎదపడరు. వారిదగ్గరనే ఎక్కువగా బందూకులు, తుపాకులు, శతఘ్నులున్నవి. వియత్నాం వారియొద్దకంటె అమెరికా వారిదగ్గరనే ఎక్కువ ఆయుధాలుండెను? ఎవరు గెలిచిరి? బందూకు, రక్తం అనుటయు విప్లవము కాదు. నేను ఎచ్చటనో చదివినట్లు గుర్తు. అత్యంత విప్లవాత్మక వాక్యము "ప్రపంచము లోని పని మనుషులారా! ఏకంకండి" అనునది, అది సంభవించినప్పుడు విప్లవము తానంత తానే వచ్చును.

శేషేంద్రకు "మెటఫరు" (రూపకాలంకారము) మీద మక్కువ. "కస్ ప్యూజాడు మెటఫరు" మీద మరియును. మెటఫరును సాగి గుంజి అంకెల గుణింతమువలె చేయుట నేటి వచన పద్యాల సంవిధానముగా కనిపించును. అది శేషేంద్ర ప్రభావమో లేక నేటి "ఇథోస్" అగునో, నిర్ణయింపవలసి యున్నది. శేషేంద్రప్రతీకలు, భావచ్ఛాయలు వైప్లవికాలు కావు పాత చింత తొక్కులే. ఉదా:

- నేను సత్యాగ్రహి.
- నేను నా కళ్ళల శరీరాన్ని దగ్ధం చేసుకొని తప్త హిరణ్య ద్రవంగా ప్రవహిస్తున్నాను.
- నా గొంతు ప్రజలకు దానం చేశాను.
- నేను రక్తప్రవక్తను
- మనిషికి మృత్యువులేదని, జీవితం ఎన్నటికీ చావదనీ-
- మీరు పలకా పుస్తకాలు పట్టుకొని పోతుంటే బాబూ! మీరు శిలువలు మోసుకపోతున్న బాలక్రైస్తుల్లా కనిపిస్తారు నా కళ్ళకు.
- రైతు నాగలి మోస్తున్నాడు, క్రీస్తు శిలువ మోసినట్లు
- మట్టి పిసుకుతాను
- అంతరాత్మ కోడైకూస్తోంది.
- నేనింత ఒక పిడికెడు మట్టేకావచ్చు. కానీ కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్న పొగరుంది.

ఈ వాక్యములలో విప్లవ కవిత్వము కానీ, విప్లవభాష కానీ యున్నవా? కొన్ని వాక్యాలలోని "నేను", శేషేంద్ర మలిరచనలలోని ప్లాంభాయెన్సు, వాల్‌ట్‌విట్మన్ ("గడ్డిపరకలు") ను పేదగ అనుకరించినట్టివని నా యనుమానము. విప్లవకావ్యము వ్రాయదలచినవారు అలెగ్జాండరు ట్వార్డ్వాస్కి వ్రాసిన ఐతిహాసిక ప్రమాణముగల విప్లవ మహాకావ్యము "వాసిలీ ట్యోర్కిన్" ను అధ్యయనము చేయుట మంచిది. కొంత చమత్కృతి కొంత వక్రోక్తి కొంత బుకాయింపు, యున్నంత మాత్రమున రచన విప్లవకవిత్వము కానేరదు. విప్లవకవిత్వము వ్రాయుటకు శేషేంద్రకు (ఈ పేరు "మెటఫరు" గా వాడుచున్నాను. ఠి) నేపథ్యముకాని, మనోధర్మము కాని లేవు. మనదేశపు విప్లవకవి నామధారులందరు దాదాపు ఇంతే. "విద్రోహి" రచయిత కాజీ నజ్రుల్ ఇస్లాముకూడ ఈ కోవకు చెందును. అభిజాత్య (క్లాసికల్), కవిత్వము, కాల్పనిక (రొమాంటిక్) కవితము, వాస్తవిక (రియలిస్టు) కవిత్వము ప్రతిభావ్యుత్పత్తుల వలన అబ్బవచ్చును. విప్లవ కవిత్వము పాల్గొనుట వలననే రాగలదు. శేషేంద్రయే అనినాడు, "నాగలి భుజానవేసుకొని ఆకలి సంపాదించుకొన్నవాడే (టాల్‌స్టాయి కథానిక "ఇవాన్ ది ఫూల్"

ప్రతిధ్వని. లి,) ఆకలి తీర్చుకునే హక్కునుకూడా సంపాదించు కొన్నవాడు" అని. ఈ వాక్య నిర్మాణమును విప్లవమునకు అన్వయించి నేనందును "విప్లవ ఫలితములను పొందు హక్కు సంపాదించు కొన్నవాడే, విప్లవ కవిత్వమును వ్రాయు హక్కును కూడా సంపాదించుకొన్నవాడు" అని.

దీనిని శేషేంద్రపైని వైయక్తికవిమర్శ అనుకొనుచున్నారా? వలదువలదు. ఆ మాటకువచ్చిన అప్పుడు మన మధ్యనుండు కవులలో శేషేంద్రయే మిన్న నేను విమర్శ చేయునది డా. తంగిరాల వెంకటసుబ్బారావు, శేషేంద్ర రచనలలో నున్నది యనిన "విప్లవ కవిత్వభాష" ను నా విమర్శ ఆ పంథాలో ప్రయాణించు విప్లవకవిత్వ భాషలందరికిని వర్తించును. శేషేంద్రను ఒక మెటఫరుగ, ఒక ప్రతీకగ పరిగణించినాను. నా దాడి ఆ మెటఫరుపై, ఆ ప్రతీకపై.

## "యవనిక" శబ్ద విచారం

భారతి (మే '86) లో శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి "సంస్కృత నాటకములను ఎట్లు ఆడుచుండిరి"ని చదివితిని.

దాదాపు వ్యాసమంతా తెర పాత్ర గురించి వ్రాసినా, సంస్కృత నాటక పరిభాషలోని "యవనిక" శబ్ద స్వరూపం వ్రాయలేదు అంటే నాటకం తెరకు "యవనిక" అనే పేరు ఎందుకు లేదా ఎట్లు వచ్చింది అనే ప్రశ్న చర్చనీయం.

సంస్కృతంలో తెరకు పటీ, అపటీ, తిరస్కారణీ, ప్రతిసీర అనే పేర్లున్నాయి. వీటికర్థం స్పష్టంగా చెప్పవచ్చు. తెరకు "యవనిక" అని కూడా పేరుంది. యజయోరభేదయేత్తినట్లు యవనిక, జవనిక కూడా అయింది.

యవనిక శబ్దాన్ని భరతుడు నాట్యశాస్త్రంలోను అమరసింహుడు, కోశంలోను, అభినవ గుప్తుడు అభినవభారతిలోను పేర్కొన్నారు.

"యవనిక" అంటే ఏమి?

దీనికి మూడు విధాలుగా అర్థం చెబుతారు.

ఒకటి,

"యవనిక" కాదు "యమనిక"

కొన్ని సంస్కృత నాటక వ్రాతప్రతులలో "యమనిక" అనే వున్నదని సుశీల కుమారదే వ్రాసినాడు.

"యం" (నిరోధించు) అనే మూలంనుండి యమనిక పదం వచ్చింది అప్పుడు కప్పునది అనే అర్థంతో పదం సరిపోతుంది.

రెండు,

"యవనిక" శబ్దాన్ని "యు" శబ్దమూలం నుంచి సాధించడానికి ప్రయత్నాలున్నాయి.

"యునోతి అవృణోతి అనయా ఇతి"
("కుట్టనీమతం" వ్యాఖ్యానంలో)

మూడు,

గురుబాల ప్రబోధికలో "యవనిక"కు వ్యుత్పత్త్యర్థం ఇలాగుంది. "యువంత్యత్రజనా ఇతి యవనికా" యు — మిశ్రణే జనులు దేనియందు కూడుదురో.

నాలుగు,

పై మూడు అర్థాలు సంతృప్తికరంగా లేవు. "యవనిక" పదానికి గ్రీకు మూలం ఉంది అని ఒక వాదం. గ్రీకులకు "అయోనియను"లు అని కూడా పేరు కలదు. అయోనియులను మన ప్రాచీనులు "యవను"లని పిలిచిరి. తర్వాతి కాలంలో పారశీకులకు, తురుష్కులకు, శ్వేతజాతి పాశ్చాత్యులకు కూడా "యవన" నామధేయం ప్రసాదించబడింది. మన పండితరాయలు "యవనీ రమణీ విపదశ్శమనీ" అని ఒక మొగలు సుందరిని వర్ణించినాడంటారు. సంస్కృత నాటకముల మేరకు "యవన" అంటే గ్రీకులే అని మనం నిర్ణయించవచ్చు ఎందుకంటే, భరతుని కాలానికి మహమ్మదు ప్రవక్త పుట్టియుండలేదు. అభినవ గుప్తుని కాలానికి గజనీ మహమ్మదు పుట్టియుండడు.

గ్రీకు ప్రభావం గురించి చర్చిస్తాము.

"యవనిక" అంటే గ్రీసునుండి తెచ్చిన రంగుల తెర అని ఒక ప్రతిపాదన.

ప్రాచీన సంస్కృత నాటకాలపై గ్రీకు నాటక ప్రభావం లేదని పాశ్చాత్య పండితులే ఒప్పుకొన్నారు. క్రీ.శ. రెండవ శతాబ్దంనాటి ఒక గ్రీకు మోదాంత నాటకంలో కన్నడం-తులు మాటలున్నాయట. గ్రీకు నాటకాలలో "తెర" పద్ధతి లేదనునది అందరికీ తెలిసిన విషయమే. ఆ పద్ధతినే ఎరవు తెచ్చుకొననపుడు గ్రీకుల రంగు గుడ్డను మాత్రం తెచ్చుకొన్నామనడం హాస్యాస్పదం. పారశీకుల రంగుల తివాసీలు తెచ్చి తెరగా వేసి "యవనిక" అని అన్నారని ఒక పిడివాదం. రోమను నాటకాలలో తెర పద్ధతి వుంది. ■ పద్ధతి ననుసరించి "యవనిక" వచ్చియుండునని ఇంకొక వూహ. "యవనిక" శబ్దం గ్రీకు ప్రభావం నుండే నిష్పన్నమయింది. కేవలం "తెర" అనేదానికి పర్యాయపదాలుండనే వున్నాయి. కానీ "యవనిక" మాత్రం ప్రత్యేక ప్రాముఖ్యం కల పదం. అదెట్లో తత్‌జ్ఞుల మతాన్ని వివరిస్తాను

"యవనిక" పదం గ్రీకు నాటక ప్రభావం వలన కాక యవనీ యౌవనుల మూలకముగ వచ్చినదని ఒక సిద్ధాంతము. అదెట్లంటే: అలెగ్జాండరు దండయాత్ర తరువాత భారతదేశంపై గ్రీకు ప్రభావం అంతో ఇంతో ఉండ మొదలుపెట్టింది. పశ్చిమోత్తరమున గ్రీకు సామంత రాజ్యములు వెలసినవి. అర్థశాస్త్రంలో, భారతదేశపు రాజులకు గ్రీకు తరుణులపైని గల మోజు చెప్పబడింది. భాస నాటకాలలో రాజపాత్రకు గ్రీకు స్త్రీలు "బాడీగార్డులు"గా ఉన్నట్లు చెప్పబడిందట! ఈ విష

యాన్ని ఒక గ్రంథం[1]లోని అథస్సూచిక ఆధారంగా వ్రాస్తున్నాను. నాటకంలో తెరలు రెండు రకాలు. ఒకటి రంగభూమికీ, నేపథ్య గృహానికీ అడ్డంగా వ్రేలాడ వేయబడినట్టిది. రెండు, ఏదైనా పాత్ర ప్రవేశించేటప్పుడు, ఆ పాత్రకు అడ్డంగా ఇద్దరు తెరపట్టుతూ వచ్చి, రంగభూమిలో ఆ తెరను దించివేయడం. ఈ విన్యాసం శాస్త్రిగారి వ్యాసంలో చెప్పబడింది. రాజపాత్రలకు బాడీగార్డులు గ్రీకు యువతులున్నట్లు, ఈ తెర పట్టేవారు యవన స్త్రీలు అయివుండవచ్చునని మనం ఇపుడు సిద్ధాంతీకరించవచ్చును. యవని (గ్రీకు స్త్రీ) పట్టే తెర "యవనిక" అని పిలువబడ సాగివుంటుంది. రాజులకు యవన యవ్వనుల మీద మోజు వున్నట్లు, నాటి నాటక ప్రేక్షకులకూ వుండి వుండడంలో ఆశ్చర్యం లేదు. శ్వేతజాతి స్త్రీలకు మన దేశంలో నాటికీ, నేటికీ ప్రత్యేక స్థానం వుంది. పూర్వకాలపు సర్కసులలో ఆంగ్లో ఇండియన్ గరల్స్ ఉండితీరవలసిందే. అటులనే రాజుల మెప్పులకై ప్రజాకర్షణకూ, ప్రాచీన సంస్కృత నాటకాలలో యవనస్త్రీలకు పటీధారణ పాత్ర కల్పించి వుంటారు. వారికి సంస్కృతం, ప్రాకృతం వచ్చియుండదు. కాన, వారివి మూగపాత్రలు - ఆంగిక అభినయం మాత్రమే. శ్వేతజాతి స్త్రీలు నాటకరంగంలో కాని, సర్కసులో కాని, జాతీయరంగంలో కాని దేదీప్యమానంగా వెలిగినారు. స్వామి వివేకానందుని శిష్యురాలు సోదరి నివేదిత (అమెరికన్ స్త్రీ)ని టాగూరు అనుకొంటాను "మహాశ్వేత" (బాణుని "కాదంబరి" లోని ఒక విశిష్ట పాత్ర) అని అభిమానంతో పిలిచినాడు. అనిబిసెంటు (ఐరిష్ స్త్రీ) మన దేశానికి చేసిన మేలు మరువరానిది. పశ్చిమోత్తర భారతదేశంలో, గుప్తుల సామ్రాజ్యంలో, గ్రీకుల ఉనికి, ప్రభావం క్రీ.పూ. 1-8 శతాబ్దాలనుండి క్రీ.శ. 5-6 శతాబ్దాల వరకూ ఉండేది. ఆ కాలాలలో వెలసిన భరతుని నాట్య శాస్త్రంలోనూ, ప్రాచీన సంస్కృత నాటకాలలోనూ "యవనిక" రంగ ప్రవేశం చేసిందని మనం నిర్ణయించుకో వచ్చును. యవని రూప సౌందర్యం వల్లనేకాక, "యవనిక" శబ్ద సౌందర్యంవల్ల కూడా, తెరకు "యవనిక" అనే పదం సర్వే సర్వత్ర ప్రచారంలోకి వచ్చింది.

## సహాయ గ్రంథములు

1. ఎ. బి. కీత్ - "ద సాంస్క్రిట్ డ్రామా" (1970)

2. డి. ఆర్. మంకడ్ - "ఏన్షియంట్ ఇండియన్ థియేటర్" (1960)

"శ్రీ"

---

# లేఖ

## అలంకారాలు

నర్తకీమణులు "శశికళ, శోభ" ముఖచిత్రంతో వెలువడిన "భారతి" పత్రిక ముగ్ధమనోహరంగా వున్నది. "బాలనర్తకి" సుచిత్రతో ఇంటర్వ్యూకి కోలపల్లి ఈశ్వరరావుగారు చక్కగా ఇంటర్వ్యూచేసేరు. ఈలాటి నర్తకీమణులు గాయకులు, విద్వాంసులతో ఇంటర్వ్యూలు ప్రచురించండి. ఇవే భారతికి అలంకారాలు.

బత్తుల వెంకటేశ్వరరావు
కాకినాడ.

# గ్రంథ విమర్శలు

## నేరము - శిక్ష

[జి. విలసత్కళాధర్, జి. కె. రాజు, గోకుల్ నగర్, హన్మకొండ, పది రూపాయలు.]

ఇందులో వున్న నాలుగులో మూడు నాటికలనీ, ఒకటి నాటకమనీ రచయిత తన తొలిపలుకులో చెప్పారు. "నేరము-శిక్ష"లో తండ్రి కొడుకును ప్రేమించటం ఇన్‌స్పిరింగ్ అని రచయిత చెప్పారు. ధనికుడయిన ఓ డాక్టరు చాలా బీదదైన ఒకామెకు ఆపరేషన్ చేయడానికి కేవలం యాభై రూపాయలు లంచ మడిగి, ఆ ఆపరేషను నెలరోజులు పెండింగ్‌లో పెట్టి...ఆమె చావుకు కారకుడయి కోర్టులో యావజ్జీవ కారాగారశిక్ష పొంది, అక్కడే గుండె ఆగి చనిపోతాడు. అతని కొడుకు యీ కేసుకు సాక్షి అవుతాడు. కోర్టుసీనులు, చట్టమూ-కోర్టు తెలియకుండా రాస్తే పేలవంగా వుండి, అపహాస్యమయిపోతాయి. ఈ నాటకంలోని కోర్టు సీనూ అంతే! కనువిప్పు ఇతివృత్తమే అసంభవం. రామాయణ మహాభారతాలు చాలా అసంభవాలయిన కథలనీ(?)...ఇలాటి కల్లబొల్లి కథలు చదివించీ-వినిపించీ-చూపించీ ప్రజల్ని పసిపిల్లల్లా నమ్మించి, సంభవాలను గురించి స్వతంత్రంగా ఆలోచించే శక్తి లేకుండా 'సేల్' చేసి పారేశారు ప్రాచీనులు అని దుయ్యబడుతూనే తానూ ఓ అసంభవాన్ని రాసి అది మాత్రం నమ్మాలని పలికారు. ఇదొహ విడ్డూరం....కాగా, రామాయణ మహాభారతాలను కల్లబొల్లి కథలుగా తీసిపారేయడము చాలా విచారించవలసినదే!

—భూపతి

## అక్షరాలు పదునెక్కిన వేళ

కవితా సంకలనం

వెల : రు. 2-00లు

ప్రతులకు : జన సంస్కృతి కేరాఫ్ కేకలు వారపత్రిక ఏక్లి బజార్, నిజామాబాద్ – 503 001

సాహితీ వేదిక జనసంస్కృతి నిజామాబాద్‌వారు ఈ కవితా సంకలనాన్ని అచ్చు వేశారు. ఈ సంకలనానికి ప్రముఖ కవి శ్రీ కె శివారెడ్డి ఆలోచనాత్మకమైన పీఠికను రాశారు. పోరాట కవిత్వాన్ని రాసే కవి బాధ్యతను శివారెడ్డి చక్కగా చెప్పారు. "నినాద స్థాయినుంచి, వచన స్థాయినుంచి కళాస్థాయికి కవితను చేర్చటం అంత సులభమైందేమీ కాదు. మామూలు వస్తువుని కవిత్వ స్థాయికి లిఫ్ట్ చెయ్యటం నిత్య సాధనలో మెలుకువతో చేయాల్సిన పని. లేకుంటే మన ధ్యేయం తప్పిపోతుంది" అంటున్నాడు శివారెడ్డి. కవిత్వంలో రచనా శిల్పానికి గల ప్రాముఖ్యాన్ని చాలామంది నిర్లక్ష్యం చేస్తున్న ఈ రోజుల్లో శివారెడ్డి లాంటి కవి సామాజిక పోరాటాలకు చెందిన కవిత్వం రాస్తున్నవాళ్ళకు ఇట్లాంటి మాటలు చెప్పటం గొప్ప విశేషమే.

ఈ సంకలనంలో వచన కవిత్వం, జనం పాట రెండూ చోటు చేసుకున్నై. ప్రభుత్వాల గళాలకూ, కలాలకూ సంకెళ్ళు వేస్తున్నా—

నా పాట
పీడితజనం గుండెచప్పుడు
నా పాట
ఆకలి పేగుల ఆర్తనాదం
నా పాట రేపటి పొద్దుపొడుపు

అంటున్నారీ కవులు. వీరి ఆశయం ఈ క్రింది పాదాల్లో ఇంకా బాగా వ్యక్తమైంది.

భూమ్యాకాశాలను ఉరితీసిన
ఈ సిగ్గులేని వ్యవస్థను
చెప్పు కాలితో సన్మానించి
ఉరికొయ్యమీద ఉమ్మేసిన నీ ఆశయం కొరకు
జీవితకొలిమి——
వర్గ పోరాటాలై నిప్పులు చెరుగుతోంది
వాళ్ళు ఉల్లిపొరల్లా విప్పుకుంటున్న అర్థాల్ని సృష్టిస్తు
న్నారు
ఉరికంబాల పైన ఊగుతూ చీమలదండు
మహాప్రస్థానమై కదులుతోంది
నీ ఆశయాల్ని కొనసాగిస్తూ
నీ కిది సంతాపం కాదు కామ్రేడ్
సమరానికి మేమిచ్చే హామీ మాత్రమే.

పొల్లు అక్షరాలు ఏమీ లేకుండా ఇదంతా శుద్ధ సమర కవిత్వం.

—టి. ఎల్. కాంతారావు

## తూర్పు గోదావరి జిల్లా తీర్థ క్షేత్రములు-ఆలయములు

రచయిత : గుండు విఘ్నేశ్వరశాస్త్రి

ప్రాప్తిస్థానము. శ్రీ వీరవెంకట సీతారామ భజన మందిరము, లలితా నగరము, రాజమహేంద్రవరము-4.

పుటలు : 397; వెల : రూ. 25-00

కోనసీమతో గూడిన గోదావరి జిల్లా సాంస్కృతికముగాను, ఆర్థికముగాను ఆంధ్రప్రదేశ్‌లో ఒక ముఖ్యమైన జిల్లాగా పరిగణింపబడుతోంది. ప్రాచీన కాలం నుండి ఆ జిల్లాకు అట్టి ప్రాముఖ్యము కలదు. గోదావరి, దాని శాఖానదులు ఆ ప్రాంతాన్ని సస్యసమృద్ధంగా చేయటంవల్ల ప్రాచీన కాలంలోనే అచట అనేక తీర్థాలు క్షేత్రాలు ఆవిర్భవించెను. వాటిలో ముఖ్యమైనవాటిని గూర్చి స్థలపురాణములతో ఈ గ్రంథము రచింపబడింది. అట్టి సమాచారం సులభంగా లభ్యము కాదు. అయా గ్రామాలు తిరిగి పెద్దలనుండి విషయము సేకరించి గ్రంథకర్త దీన్ని రచించిరి. ఆ జిల్లాలో అన్నవరం, పిఠాపురం, దాక్షారామం, కోరుకొండ, కోటిపల్లి, ధవళేశ్వరం, పలివెల, భీమవరం, భద్రాచలం, ముక్తేశ్వరం, అంతర్వేది, రాజమహేంద్రవరం, ర్యాలి, సర్పవరం, వ్యాఘ్రేశ్వరం క్షేత్రాలు ముఖ్యమైనవి. చారిత్రకంగా కూడ వీటిలో కొన్ని ప్రసిద్ధమైనవి. ఉదాహరణకు పిఠాపురం పూర్వం పిష్టపురమనే పేరుతో క్రీ.శ. 350 ప్రాంతంనాటి సముద్రగుప్తుని అలహాబాదు శాసనంనుండి ఇటీవలి సూర్యారాయ జమీందారునాటి వరకు రాజకీయంగాను సాంస్కృతికంగాను ప్రముఖ స్థానం వహించింది. అచట బౌద్ధ, జైన సంప్రదాయములు కూడ పూర్వము వర్ధిల్లినట్టు నిదర్శనాలున్నవి, పాదగయాక్షేత్రమని, కుక్కుటేశ్వర క్షేత్రమని పురుహూతికా పీఠమని ఇది ప్రఖ్యాతి

గాంచెను. మాధవస్వామి గుడికూడ ప్రాచీనమైనదే. ఈ విధంగా పిఠాపురంలో అనేక మత సంప్రదాయాలు వర్ధిల్లినట్లు తెలుస్తుంది. కళింగరాజులు, చాళుక్య రాజులు, రెడ్డి రాజులు ఈ జిల్లాలో అనేక దేవాలయాలు నిర్మించి వృద్ధిపరచిరి. దాక్షారామం, రాజమండ్రి, భద్రాచలం, ర్యాలి మొదలైనవి ఆనాటినుండి సుప్రసిద్ధ క్షేత్రాలుగా వాసికెక్కెను. వాటిని గూర్చిన స్థలపురాణాలు, చరిత్రలు సామాన్య ప్రజలకు తెలియచేయాలనే ఉద్దేశంతో రచించిన గ్రంథమిది. అట్టి అవసరాన్ని తీర్చుచున్నది కూడ. ప్రధాన క్షేత్రాలలో గల దేవాలయాలను గూర్చియేకాక గ్రంథకర్త ఇతర పుగ్రామాల్లో ఉన్నవాటిని గూర్చి కూడ కొంత సమాచారం సేకరించి యిందు పొందుపరచిరి. అది భావి పరిశోధకులకు కొంతయైనను ఉపయోగించగలదు. ఇందలి విశేషం మఱియొకటి గలదు. ఆధునికంగా ఆయా దేవాలయాలకు క్షేత్రాలకు చేర్చదగిన నూతనాంశాలను కూడ సందర్భోచితంగా చేర్చిరి. సర్. ఆర్థర్ కాటన్ నిర్మింపజేసిన గోదావరి ఆనకట్టను గూర్చి వ్రాయటం అట్టి విశేషాల్లో ఒకటి. అవసరం అని తోచిన కొన్ని చిత్రపటాలను కూడ చేర్చిరి.

పి. వి. పరబ్రహ్మశాస్త్రి

## కుమ్మరి మొల్ల

[బి. యల్. ఎన్. ఆచార్య, వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్ మద్రాసు. పది రూపాయలు.]

కుమ్మరి మొల్ల జీవితాన్ని ఇంటూరి వెంకటేశ్వరరావుగారి కుమ్మరి మొల్ల నవల ఆధారంగా చేసుకుని, రచయిత నాటకంగా వ్రాశారు. కాస్త పెంకిగా, మొండిగా, అన్యాయాన్ని ఎదుర్కొనే ధైర్యవంతురాలిగా, నిస్సంకోచిగా, నాస్తికురాలిగా ఆరంభంలో వున్న మొల్లలో చైతన్యం కలుగుతుంది. భగవంతుణ్ణే వివాహం చేసుకున్నాను నేను అని అందరితో చెప్తూ, తాను రామాయణాన్ని అయిదు రోజులలో రాస్తుంది. తెనాలి రామలింగడు ఆమెను ఉత్తేజపరుస్తాడు.

రామాయణ రచన చేసి, రాయలు పరీక్షకు నిలచి, అందరి ఎదుటా ఆమె శ్రీరామునిలో ఐక్యమయిపోతుంది.

ఇదీ కథ.

నాటకంలో హాస్యం కాస్త చప్పగా వుంది, కొన్నిచోట్ల పాత్రలను చాలా అపహాస్యం చేసేట్టు వుంది. రంగస్థల నాటకమే అయినా, రంగస్థలంలో చూప వీలులేని సన్నివేశాలిందులో చాలా వున్నాయి.

## కత్తుల పంజరం

[కప్పగంతుల మల్లికార్జునరావు. క, గా, కా, కౌ ప్రచురణలు, రాజమండ్రి ఇరవై రెండు రూపాయలు]

'కత్తుల పంజరం'లో అన్నీ లోగడే వివిధ పత్రికలలో ప్రచురింపబడిన మరో పద్దెనిమిది కత్తులున్నాయి. కథలన్నీ చక్కగా వున్నాయి. శైలి రమ్యంగా వుంది. భాష, సంభాషణల్లో రచయిత పాత్రల స్వభావాలను, మనస్తత్వాలనూ చక్కగా వివరించారు. కత్తుల పంజరంలోని పారిజాతం ఉద్యోగం చేయాల్సిన అవసరం లేకపోయినా భర్త కోర్కెమీద కాలేజిలో లెక్చరరు పోస్టుకు ఇంటర్వ్యూకు వస్తుంది. చక్రపాణి విద్యాధికుడు. ఆమె కాలేజ్ మేట్. ఆమెకు చదువు కూడా చెప్పి అలనాడు ఆమె మనస్సు కూడా దోచుకున్నవాడు. అతనా ఉద్యోగం తనకు ఇప్పించమని ఆమె నడుగుతూ తాను నిర్ధనుడననీ, నిరుద్యోగి ననీ వివరించి, ధనికురాలైన ఆమెకన్నా ఆ ఉద్యోగం తనకే యివ్వడం న్యాయ మని అనడంతో ఆమె అహం దెబ్బతింటుంది. ఉద్యోగం తనకే వచ్చేలా చూసు కుని, అతన్ని పలుకరించకుండా పోతుంది. ఆమె మనస్తత్వం... గతంలో విద్యార్థినీ దశలోనే అతను లేనివాడయినందువల్ల తన ప్రేమ నాతనివైపు పెరుగ నివ్వదు. ఎటొచ్చీ ఆమె పుట్టింటి, అత్తింటివైపువారు ధనికులయి "నా కెందుకు ఉద్యోగం" అనుకునే ఆర్థిక స్తోమతను చిత్రీకరించడంలో వారికి స్కూటరుగాక, కారు వుండి వుంటే సమన్వయంగా వుండుండేది.

ఈ కథకు చిత్రకారుడు శ్రీ బాపు వేసిన ముఖచిత్రం అద్భుతం. కథ నంతా చెప్పగల గీతలవి.

## 'అగ్గిపుల్లలు'

[జి. విలసత్కళాధర్, జి. వి. కళాధర్, లెక్చరర్, హన్మకొండ ఆరు రూపాయలు]

రచయిత తన యీ కథల పుస్తకానికి "అగ్గిపుల్లలు" అనే పేరు ఎందుకు ఎన్నుకోవలసి వచ్చిందో "అగ్గిపుల్ల"లో వివరించారు. అందులోనే ఉత్తమ కళా ఖండమయినా దాని నందుకునే స్థాయికి ఎదిగినవానికే ఉల్లాసాన్నిస్తుందని - తన ఫీలింగ్స్ నచ్చేవారికే నచ్చుతాయని - నచ్చనివాని కొరకు వాళ్ళకు నచ్చే పద్ధతిలో మంచి పేరు ప్రఖ్యాతులు గడించిన రచయితల్లా వ్రాయడానికి తాను ప్రయత్నించననీ కూడా వ్రాశారు. అసలు తన రచనలు నచ్చవనే అనుమానం గానీ, నమ్మకంగానీ తన కెందుకొచ్చిందో తెలియబరచలేదు.

కథలలో కొన్నిటి ఇతివృత్తం మంచిదే వున్నా, ఆ కథను పెంచాల్సినంత రచయిత పెంచలేదు. "ఋజుమార్గం"లో మీనాక్షి తన కొడుకును గాలికి వదిలేసి పక్కింటి వారబ్బాయికి లానే తల్లిగా అన్ని పనులూ చేస్తూంటుంది. "బాబు చూడండి; కలియుగ మన్మథుడు...వాళ్ళ నాన్నగారి నోటిలోంచి ఊడిపడి నట్టుంటాడు. అంత అందమైన ఆయనకు ఆ పగలు చూస్తే రాత్రి కల్లోకొచ్చే రమణమ్మనా భార్య! ఆయనెలా వొప్పుకున్నారో" అని ఆమె పరాయి మగవాని అందాన్ని తన భర్తతో చర్చిస్తుంది. ఆ భర్త "వాడిమీది మమత పిల్లవాడిద్వారా

తీర్చుకుంటోంది" అని అనుకుంటూంటాడు. ఈ కథలో ఆమె అలా అనుకోడాని కానీ, పక్కింటి ఆ బాబు నాయనమ్మ ఛట్టున వచ్చి "మీ పిల్లాడుండగా మావాడికి సిరీ ఇట్లయా అపి కొనివ్వడం ఏమిటి? ఆడుదానికి అందం కాదు, గుణం ప్రధానం" అని, తన కొడుక్కి ఆఘెకూ రంకు కట్టినంత వివరణగా అనడానికి తగిన సందర్భాలు రచయిత సృష్టించలేకపోయారు. తాను రాసిన కథ చదువరికి నచ్చేట్టు చేయవలసిన బాధ్యత రచయితదే కదా!

ఇందులోని కథలలో ఎక్కువ యిలా వున్నవే!

ఫాలాక్షుడు

## తారక బ్రహ్మరాజీయము

గ్రంథకర్త: చింతలపూడి ఎల్లనార్యుడు, పరిష్కర్త: శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ, జనరల్ ఎడిటర్: డా. వి. వి యల్. నరసింహారావు, ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం-పరిశోధనాలయం, హైదరాబాదు-500 001. మూల్యం: రు. 34/-

'తారకబ్రహ్మ దివ్యమంత్రము భవాబ్ధితరణి శ్రీరాముడురు కర్ణధారి సుమ్ము। తారకబ్రహ్మ దివ్యమంత్రము జపించువాడు శివునట్లు బ్రహ్మభావము వహించు-'

అని వాలఖిల్యులతు అగస్త్యుడు చెప్తాడు. వసిష్ఠ శిష్యుడైన వామదేవుడు ప్రయాగక్షేత్రమందు పరాశరమునీంద్రుణ్ణి తారకబ్రహ్మ మంత్రప్రభావం చెప్ప వలసిందిగా కోరగా పరాశరుడు చెప్తాడు. ఆ చెప్పడం రామేశ్వరక్షేత్రమందు అగస్త్యుడు వాలఖిల్యులకు చెప్పినట్టుగా ఉంటుంది.

తృతీయాశ్వాసమునుంచి రామజననాదికం... పంచమాశ్వాసంలో పట్టాభిషేకం అయి శివుడు సభలో తాండవించి శ్రీరాముణ్ణి నుతించినంతవరకు ఉన్నది. గ్రంథం ఇరవైనాలుగు గద్యపద్యాలతో ఆ అయిదో అశ్వాసం ముగిసింది. (ఇంతవరకే ఉపలబ్ధము. తక్కిన భాగము లుప్తము అని అచ్చులో ఉన్నది.)

ఈ ప్రబంధానికి ప్రయాగక్షేత్ర వాసియైన నారాయణ సంయమి అనే యతీశ్వరుని సంస్కృతగ్రంథం మూలం-కృతి పరామర్శచేస్తూ శర్మగారిచ్చారు ఆధారవాక్యం.

ఎల్లనార్యుడు 'రాధామాధవం' వ్రాసి పేర్గాంచిన శృంగారకవి. కాబట్టి అతని కవితారీతిని గురించి దిగదీసిచెప్పడానికి అవకాశంలేదు. శృంగారం విషయంలో మాత్రం కొంచెం ప్రైస్థానులో గంటం నడిపిన వాడని చెప్పవలసిందే. ఇది కేవలం తారకబ్రహ్మ గొప్పదనం చెప్పేదే అయినా బ్రాహ్మణ యువకునికి బోయ యువ్వనికి సంబంధించిన ఉపాఖ్యానంలో బరిదిగి చెప్పాడు. అసలు నాయికా నాయకులైన సీతారాముల విహారంకూడా అత్రోపనే నడిపించాడు. శాస్త్రంమాటకేమి సామాన్య దృష్టిలోకూడా ఆచెప్పడం అనౌచిత్యవిచారణకి తగిన ఆనకట్ట అనే చెప్పాలి.

శ్రీరాముని పట్టాభిషేకం సందర్భంగా ఆ సభలో శివుడు తాండవం చెయ్యడం సీతారాములను స్తుతించడం అనేది ఎల్లన్న కల్పనకాదు. మూల గ్రంథకర్త పని అనే చెప్పవలసిఉంటుంది.

దిలీపునకు బ్రహ్మజ్ఞానాత్మకమైన రామాయణంచెప్పే పనిలో ఉన్నందున తనకు చెప్పడానికి అవకాశంలేదు. ప్రయాగకి వెళ్ళు. అక్కడ పరాశరుడు చెప్తాడని వసిష్ఠుడు తన శిష్యునితో అంటాడట!

బృహస్పతి లక్ష్మీదేవిని ప్రార్థించగా ఆ దేవి రామునకు సీతతో ఎడబాటు కలిగేట్టుచేస్తానని వరమిచ్చిందట. అవిధంగా శూర్పణఖ నందనవనానికిరావడం, వేల్పులామెను పొగిడి నీకు తగినవాడు రాముడు వెళ్ళి వరించు అని చెప్పడం అంత శూర్పణఖ మానవనారీరూపిణియై రామునిపద్దకు రావడం.... ఇలాటి కల్పనలతో ఉంది యీగ్రంథం.

సుప్రసిద్ధ శైవక్షేత్రముగా పేర్గన్న కాశీక్షేత్రం వైష్ణవక్షేత్రముగా దీనియందు కనిపిస్తుంది.

వాల్మీకి రామాయణానికి ఇంత భిన్నంగా ఉన్న యీగ్రంథం నారాయణ యతికల్పితం. అతనికి ఆధారం ఏదోమరి?

ఈ తెలుగుగ్రంథాన్ని పరిష్కరించి లోపించిన స్థలాలను చక్కగా పూరించిన శ్రీ వేంకటేశ్వరశర్మగారున్నూ ప్రచురణభారం వహించిన జనరల్ ఎడిటర్ శ్రీ నరసింహారావుగారున్నూ అభినందనీయులు. కవితారస పిపాసువులు ఓపికగా చదవవలసిన గ్రంథం.

## భారతకథ - జీవునివ్యవస్థ - సాధకునివ్యవస్థ

శ్రీకృష్ణానందమఠం- శ్రీకృష్ణానందాశ్రమ గీతా ప్రచారసంఘం, దిల్‌సుఖ్ నగర్-హైదరాబాదు-36, వెల: రూ. 9/-

పినతండ్రి పెదతండ్రి కొడుకులు ఆస్తి పంపకంకోసం దారుణంగా యుద్ధంచేసి చచ్చిపోయిన మాపుకున్నారు. ఆదే భారతం. పద్ధెనిమిది పర్వాల మహాగ్రంథం. లౌకికమైన యీ యితివృత్తాన్ని ఆధ్యాత్మికంగా సమన్వయించి చెప్పినది ఈ గ్రంథం.

గురుశిష్యులిద్దరు ఈ గ్రంథములో పాత్రలు. శిష్యుని ప్రశ్నలూ- సందేహాలూ- వాటికి గురుని సమాధానాలూ.

'భారతగ్రంథాన్నిగానీ, భగవద్గీతనుగానీ లౌకికదృష్టితో అర్థంచేసుకుంటే ఘోరమనే అనిపిస్తుంది. లౌకికదృష్టితోగాక తత్వదృష్టితో అర్థంచేసుకుంటే అంతా చాలా క్రొత్తగా - తత్త్వపరంగా - తత్త్వధ్యేయంతోనే భారతకథ చిత్రీకరింపబడినట్లు తెలుస్తుంది— ఇది గురువుగారి నిర్ణయం.

పద్ధెనిమిదిపర్వాల పాండవ కౌరవ ప్రవృత్తికి సంబంధించిన ఇతివృత్తాన్ని భగవద్గీత ఆధారంగా తాత్విక విషయాకృతిగా సమర్థించి రూపొందించిన తాత్విక విషయాదర్శం ఇది.

పుస్తకం అట్టచివర - కురువంశం - సాధనవంశం- అనే శీర్షికలక్రింద ఇచ్చిన విషయం చదివితే యీ గ్రంథం అర్థమవుతుంది.

'ధర్మాధర్మవివేకం, దృఢత్వం, కుశలతనం, యుక్తి, అనుభవం- ఈ అయిదూ వరుసగా పంచపాండవులు. కామాదులరాజు దుర్యోధనుడు.

'వింటే భారతంవినాలి- అనే నానుడిని వేదాంత విజ్ఞానపరంగా వివరించి ఆంధ్రవాఙ్మయంలో మణిపూసను చేశారు గ్రంథకర్త. తొంభైనాలుగుపుటల యీ చిన్నకృతి ఆధ్యాత్మిక సాధకులకు దివ్యభావమణి దర్పణం అనడానికి సందేహంలేదు. పెద్దపెద్ద వ్యాఖ్యానాలు చదివి అర్థంచేసుకోలేని పాఠకులకు తత్వజిజ్ఞాసువులకు సులభంగా అసలు అర్థంఅయెట్టు తేట తెలుగుమాటలతో సంతరించిన రచయితను అభినందిస్తూ సర్వులూ ఆదరించి పారాయణ గ్రంథముగా చేపట్టవచ్చు అని నా అభిప్రాయం.

## సంక్షిప్త శ్రీమద్భగవద్గీత

(ఏకశ్లోకి, సప్తశ్లోకి, అష్టాదశశ్లోకి)

రచన - సంకలనం - శ్రీ పరిటి సూర్య సుబ్రహ్మణ్యం, ప్రతులకు రచయిత 16-6-87 కొడుగంటివారివీధి, విజయనగరం - 531202 మూల్యము రు. 6/-

ఆధ్యాత్మిక విషయమునుచెప్పే సూత్రాలూ భాష్యాలూ గ్రంథాలూ చాలా

ఉన్నాయి. వాటిలో భగవద్గీతకి ఉన్నంత వ్యాప్తి ఇక దేనికీ లేదంటే కాదన లేరు. దాని హృదయం తెలిసినా తెలియకపోయినా శ్రద్ధగా పారాయణ చేసిన వారినీ చేస్తూన్నవారినీ నేనెరుగుదును. నిగూఢమైన ఆత్మజ్ఞాన విషయమును అంత సులభమైన భాషలో చెప్పిన గ్రంథం అది. భగవద్గీతకి ప్రాచీనులమాట కేమి ఆధునికులలోకూడా చాలామంది మన తెలుగువారు వచనంలోనూ పద్యం లోనూ మలిరూపాలు సంతరించారు. సంతరిస్తున్నారు. సంతరిస్తారు. ప్రస్తుతం యీ చిన్న కృతిగురించి రెండుమాటలు. పదునెనిమిది అధ్యాయాలూ ఓపికగా చదివి అర్థంచేసుకోడానికి ఆస్కారంలేనివారికి పద్దెనిమిది శ్లోకాల్లో గీతాహృదయం చెప్పే పద్ధతి ఉంది. అలాగే ఏడుశ్లోకాల్లోనూ ఒకే ఒక్క శ్లోకంలో వివరించడం మరోవిశేషం.

'యత్రయోగీశ్వరః కృష్ణోయత్ర పార్థోధనుర్ధరః-

అనే ఒక్కశ్లోకం (ఇది గీతోపనిషత్తుకి చివరఉన్నది.) తీసుకుని గీతార్థం స్పష్ట పరిచారు- ఇది ఏకశ్లోకగీత.

'ఓమిత్యేకాక్షరం'- ఇత్యాది శ్లోకముతో ఆరంభించి ఏడుశ్లోకాలను ఎంచి తీసుకుని గీతాహృదయాన్ని వ్యక్తంచేశారు.

'న కాంక్షే విజయం కృష్ణ' అనే శ్లోకం మొదలుగా పద్దెనిమిదిశ్లోకాలు ఎన్ని వాటిని వివరించి గీతాతత్వం విశదీకరించారు.

అర్థం తెలియక ఆకాశం చూడనక్కరలేని చిన్నచిన్న తెలుగుమాటలతో ఇలా గీతావిషయాన్ని సంతరించి సూర్య సుబ్రహ్మణ్యంగారు ఆసక్తి కలవారి కందరకు ఎంతో వాదోడైనారని అభినందిస్తున్నాను. గీతాతత్వం సులువుగా తెలుసుకుని ఆనందించవచ్చు. సామాన్య సాధకలోకానికిది కరతలపారిజాతం.

## ఆమని

(త్రిభాషా కవితాసంపుటి) రచన: చీర్ల అంజనేయులు, ప్రతులకు: లక్ష్మి పబ్లికేషన్స్, 4-4-671 సుల్తాన్‌బజార్-హైదరాబాదు-1. వెల: రు. 10/-

ఆంగ్ల- ఆంధ్ర- హిందీభాషల్లో వెలార్చిన కవితాసంకలనం ఇది.

వసంతానికి 'ఆమని' తెలుగుపేరు.

పొంగారు అందాల పొంకాలు విరబూయ। కనుకొలుకులలోన్

వెలుగుజిలుగులు నింప-అమృతవీక్షణమ్ముల అలరింప లో

కాల - ఒంపుసొంపులెన్నొ నింపుకొని పొసియించి। నెరజాణయై

పఠితల నెమ్మనంబులు దోచ-రూపుదిద్దుకొన్న రూపసి నాకవిత-

అని రచయిత తన కవితా స్వరూపస్వభావాలు వివరించారు.

శ్రీశ్రీని అనుకరించి వ్రాసిన రచనకూడ దీనిలోఉంది.

'కలవారల వేదంలో కలగాంచిన యీదేశం

నిరుపేదల వాదంలో నిదురించెను యీదేశం'-

తెలుగుపదాలు ఉపయోగించుకోడం ముచ్చటగాఉన్న రచన రచనంత కూర్పులో కనిపిస్తుంది ఇక - భావాలూ, తోవలూ ఇలాటి రచనలు చేసేవారందరూ చూపుతూన్నవే.

'ఇది ఒక వెన్నెల వసంతం- అలవోకగానవ్విన చెలి కనుప్పులనిశాంతం'.. ఏమిటోయీ 'నిశాంతం'- ఆంగ్లరచన చురుకుగాఉంది.

-ఆధునికంగా వస్తూన్న యీలాటి కవిరాపంక్తుల్లో వరప్రయోగ సరణిలో ఇవి 'ఆమని'లాగా ఉండవచ్చు.

## శ్రీయోగ వాసిష్ఠము
## శ్రీవాసిష్ఠ మహారామాయణము

(తెలుగు వచనము) ప్రథమ సంపుటము రచయిత : శ్రీ బులుసు వేంక టేశ్వరులు, 8-22-14 గాంధీనగర్ కాకినాడ-4 వెల: పదిరూపాయలు.

రామునకు ఐహికజీవితానికి సంబంధించి విరక్తికలుగుతుంది. అప్పటికి ఇంకా పెళ్ళికాలేదు. తీర్థయాత్రలకు వెళ్ళివచ్చాక ఏమిటీబ్రతుకు' ఏమిటీధర్మం అర్థం, కామం, సిరి, సంపద - ఇలా తనలో తర్కించుకుంటూ ఏకాంతంగా పద్మాసనస్థుడై ఏదో ధ్యానంచేస్తూన్నట్టు కూర్చుంటూ ఉంటాడు. వెలవెలలాడే మోము, చెమర్చేకళ్ళూ- క్రమంగా చిక్కిపోయేదశకి వస్తాడు. సేవకుడుమొదలు దశరథుడు దాకా అంతా చింతామగ్నులవుతారు. అలాటి అవస్థలో విశ్వామిత్రుడు వస్తారు. విషయం అంతా తెలుసుకుని బ్రహ్మణ్యుడైన వసిష్ఠునితో చెప్తారు 'దాశరథికి ఆత్మబోధచేసి సామాన్యస్థితికి రప్పించవలసిందని. తరువాత వసిష్ఠుడు రామునకు బోధిస్తాడు. రాముడు జిజ్ఞాసువుగా ప్రశ్నలు వేస్తూ ఉంటాడు. ఆచార్యుడుగా వసిష్ఠుడు సమాధానాలు చెప్తాడు. అదే యీ 'యోగవాసిష్ఠం'

దీనిని వాల్మీకి కర్తృకంగానే చెప్తారు. వాల్మీకి తొలి రామాయణానికి 'కథోపాయము- అనే దీనికి 'మోక్షోపాయము' అనే పేర్లు తొలి రామాయణం సప్తకాండాత్మకమైనట్టే ఇదికూడా చివరి ప్రకరణము రెండుభాగములయి సప్త ప్రకరణాత్మకమై ఉన్నది. ఇందలి భాగాలకు 'ప్రకరణములు' అనిసంజ్ఞ వాటిలో

వైరాగ్య-ముముక్షు వ్యవహారములనే మొదట రెండు ప్రకరణములతో శ్రీ వెంకటేశ్వరులుగారి తెనుగు గద్యరచన యీగ్రంథం. 'అనర్థశతమహాపంక నిర్మగ్నమైయున్న సంసారకోటరమున బడియున్న జగత్తును గనుగొన్న నా మనస్సు మహావ్యధనందుచున్నది. భయమందుచున్నది- ఇలా అంటాడు రాముడు.

ఈలాటి చిక్కుప్రశ్నలకన్నిటికీ వసిష్ఠుడు క్రమంగా చక్కని సమాధానాలు చెప్తాడు. తత్వసమస్యలన్నిటికిది శాశ్వతపరిష్కారమిచ్చిన మహాగ్రంథము. దీనియందు అద్భుత భావబంధురములైన కథలు కూడా ఉన్నాయి. రాముని వైరాగ్యము ఆధారముగా జీవలోకానికి వసిష్ఠుడు ప్రసాదించిన ఆధ్యాత్మిక దివ్య బోధ ఇది.

భాష కాస్త బరువుగాఉన్న ఉత్తమోత్తమమైన యీ గ్రంథం నిదానంగా పఠించి భద్రపరుచుకోవలసినది.

యామిజాల పద్మనాభస్వామి